# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

99

జనవరి 1980

---

శ్రీ శ్రీ
కల్లోల/నక్సల్బరీ/విరసం దశాబ్దం
పరిభావం - పరిశీలన

---

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంచిక నుంచి
వత్సర చందా రు. 20-00

పేజీలు 136+VIII
ఈ సంచిక రు. 3-00

## శ్రీశ్రీ ప్రత్యేకం



---

శ్రీశ్రీ చిత్రాలు : ఫోటో - బోనేపల్లి మురళి, తెనాలి.
రేఖా చిత్రం - చంద్ర

---

సవరణలు : 1. శ్రీశ్రీ పై సృజనలో (132వ పేజీ)
శ్రీశ్రీలో అలంకారికత, మే 1971, రచయిత అర్వియార్‌గా
చదువుకోవాలి.

2. సమీక్షలు (133వ పేజీ) లో
'ఖడ్గసృష్టి' రస (కుస్తీ) పట్లు - కె.వి. రమణారెడ్డి
అగస్టు '69 - సంచిక 12 చేర్చి చదువుకోవాలి.

# కల్లోల/నక్సల్బరీ/విరసం దశాబ్దం - శ్రీశ్రీ

శ్రీశ్రీ డెబ్బైయేళ్ళ జీవితంలో, ఏభైయేళ్ళ సాహిత్యోద్యమ జీవితంలో ఆయన నుంచి ప్రజలు స్వీకరించింది చాలాఎక్కువగా వెలుగు.

ఆయన పట్ల అపారమైన ఆదరాభిమానాలు, గౌరవం వుండి కూడ ప్రజాభిప్రాయానికి భిన్నంగా చెప్పిన ఆయన ఏ మాటనూ ప్రజలు అంతగా పట్టించుకోలేదు. అంతేకాదు తెలంగాణరైతాంగ పోరాట కాలంనాడో, అభ్యుదయ రచయితల సంఘం అభ్యుదయ పథంలో వున్ననాడో ప్రజలు గౌరవించిన కవులు క్రమంగా 1950 నుంచే వాళ్ళ దృష్టిలో మరుపులోనో ముక్కు విరుపులోనో మిగిలిపోగా శ్రీశ్రీ ఒక్కడే తప్పులుచేస్తూ ఐనా తమతో వున్నందుకు ప్రజలు గర్విస్తున్నారు.

అఖిలభారత అభ్యుదయ రచయితల ఉద్యమంలో, ఇప్టా (ఇండియన్ పీపుల్స్ థియేటర్ అండ్ ఆర్ట్స్) ఉద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్న వారిలో ఈనాడు సజీవంగా వున్న ఏ ఒక్కరూ నక్సల్బరీ ఉద్యమాన్ని బలపరచిన దాఖలాలేదు. కాలక్రమాన అందరూ పార్లమెంటరీ అభ్యుదయ పథాన్ని గానంచేసే పాలక పక్షరచయితలుగానే మారిపోయారు. ముప్పైఏళ్ళు నిండకుండానే భారత కమ్యూనిస్టుపార్టీ (1922-'51) ముసలిదైపోగా, 'ఎముకలు క్రుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరు'లను వదిలి 'నెత్తురు మండే శక్తులు నిండే' యువకుల పక్షం చేరిన, వయస్సుతో నిమిత్తంలేని యువ మనస్కుల్లో సాహిత్యరంగంలో శ్రీశ్రీ భారతదేశంలోనే అరుదైన యుగ సంకేతం. 'సినిమాల చిట్టడవి'లో చిక్కుకున్న బొంబాయి, మద్రాసు, బహుశా కలకత్తా అభ్యుదయ రచయితల్లో శ్రీకాకుళం వైపువచ్చింది కూడ ఒక్క శ్రీశ్రీయే.

1955 ఆంధ్రా ఉపఎన్నికలు అడ్డంపెట్టుకొని కమ్యూనిస్టు పార్టీమీద, మార్క్సిజంమీద, శ్రీశ్రీ మీద బురదచల్లడానికి, విషంకక్కడానికి తెలుగుదేశంలోని ప్రముఖ మేధావులు, కవులు పాలకవర్గాల పావులై బరి తెగించిననాడు శ్రీశ్రీ ఒక్కడు 'మరో ప్రపంచం' పిలుపుకు 'ఎర్రబావుటా' నాయకత్వాన్ని స్వీకరించినాడు. పోరాడాడు. అప్పుడాయన అండన కమ్యూనిస్టుపార్టీ, అభ్యుదయ రచయితల సంఘం, ప్రజానాట్య మండలి వున్నాయి.

వర్గ సామరస్య రాజకీయాల రొంపిలో దిగి అదే కమ్యూనిస్టుపార్టీ, అదే అభ్యుదయ రచయితల సంఘం శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మానం పేరుతో పాలక వర్గాలకు ఆయన కలాన్ని దాసోహం చేయాలని కుట్ర చేసినపుడు నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలను బలపరచడం ద్వారా ప్రజల పక్షం వహించడమే కాదు, నక్సల్బరీ పోరాట సాహిత్య సాంస్కృతిక అవసరంగా ఏర్పడిన విప్లవ రచయితల సంఘం

పోరాట జెండాను తన అరవయ్యోఏట ఎత్తుకున్నాడు. విరసం కోసం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వాన్ని వదిలించి వేసాడు.

ఆఫ్రో - ఆసియా రచయితల సంఘాన్ని ప్రపంచ శాంతి సంఘం లాగా బోర్జువా సామ్రాజ్యవాదానికి ఊడిగం చేసే సాహిత్య సాంస్కృతిక సంస్థగా వాడు కోవాలని చూసినపుడు 1970లోనే ఆఫ్రో - ఆసియా రచయితల మహాసభల్లో ఢిల్లీలో నక్సల్బరీ సాంస్కృతిక యువశక్తి తిరుగుబాటు జెండాను ఎగరేసింది కూడ శ్రీశ్రీయే. ఏర్పడిన తొలి రోజుల్లోనే అఖిల భారత స్థాయిలో విరసం వాణి వినిపించి ప్రజా కళా ఉద్యమాల నాయకత్వం కోసం తెలుగుదేశం వైపు చూపు మళ్ళించడం అప్పుడే ప్రారంభమైంది.

1975 జూన్ దాకా కూడ శ్రీశ్రీ ప్రజాసాహిత్య ఉద్యమ బాధ్యతను సంస్థకు గర్వకారణంగా నిర్వహించాడు. గర్వకారణంగానే అన్నప్పుడు కూడ ఆయన ఏ తప్పూ చేయలేదనికాదు; ఆయనేకాదు విరసం, విప్లవోద్యమం కూడ ఏ తప్పులూ చేయకుండా ఎదిగినవి కావు. ప్రజల మంచికి అవసరమైన పనులను చేపట్టడంలో మొత్తం మీద సరియైన మార్గాన నడిచాయని అర్థం.

విరసం దశాబ్దంలోనే శ్రీశ్రీ విరివిగా రచనలు చేసాడు. శ్రీశ్రీలోని శబ్దశక్తి భావశక్తికీ, ఉరవడి సారళ్యానికీ, మాత్రాచ్ఛందస్సులు పాటల వైపుకూ చూపు మళ్ళించింది కూడ ఈ రోజుల్లోనే.

శ్రీశ్రీ నోటికి మాటధాటీ, కాళ్ళకు 'లాంగ్ మార్చ్' నడకా అబ్బింది కూడ ప్రజాపోరాట ప్రచార క్రమంలోనే.

పుస్తకాలతోనే పరిచయమున్న శ్రీశ్రీని ప్రజల్లోకీ, మారుమూల పల్లెల్లోకీ తెచ్చి పలికించింది నక్సల్బరీయే.

అందుకే శ్రీశ్రీని 'హైజాక్' చేసారని (ఎత్తుకుపోయారని) ఆరోపించి విప్లవ రచయితలను అరెస్టు చేసినపుడు, విప్లవ కెరటమే తనను 'హైజాక్' చేసిందని శ్రీశ్రీ సరిగానే చెప్పాడు. విప్లవ రచయితల మీద కుట్ర కేసులు పెట్టినపుడు ఆయన ప్రదర్శించిన ఆగ్రహం వెంగళరావు మీద రాసిన పాటలో ప్రతి అక్షరంలో ప్రత్యక్ష మవుతుంది. ఆయన ఆగ్రహం రాతలకు పరిమితం కాలేదు. 1964 నుంచి 75 దాకా ఒక దశాబ్దం పైగా పౌరహక్కుల ఉద్యమంతో శ్రీశ్రీ, శ్రీశ్రీతో పౌరహక్కుల ఉద్యమం ఊపిర్లుపోసుకున్నాయి.

అధివాస్తవికవాదము, అరాచకత్వము ప్రేమించి అభ్యుదయ రచయితల్లాగే అంతో ఇంతో అందరు 'అభ్యుదయ' రచయితల వ్యక్తిగత జీవితాల్లోనూ, అరసం తాత్త్విక చింతనలోనూ చోటుచేసుకున్న చారిత్రిక దశను గమనంలోకి తీసుకొన్నపుడు ఈ రెండు ధోరణులను తెలుగు కవిత్వంలోకి తన జీవితంలోకి తెచ్చిన శ్రీశ్రీ బలహీనతలను క్షమించవచ్చు.

భద్రత, భవిష్యత్తుపై భరోసాలేని ప్రాయంతో ప్రారంభమైన శ్రీశ్రీ జీవితం అవసరాన్ని, భయాన్ని అధిగమించగల పరిస్థితుల్లోనూ, పరిసరాల్లోనూ రాటుదేలలేదు. కాని శ్రీశ్రీ ఎప్పుడూ పదవికీ, కీర్తికీ, ప్రలోభానికీ లొంగిపోలేదు. ఆయన వ్యాపార సంస్కృతిలోనే జీవిక కొనసాగిస్తున్నా ఆయన స్వభావానికి ఆశ్రయింపు, అవకాశ వాదంలాంటి గులాంగిరీ, కాకా లక్షణాలు అబ్బలేదు.

భూమయ్య కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షల రద్దుకోసం 'భూమ్యాకాశాల'ను కదిలించిన ఉద్యమంలో ఒకడుగా ఈ కామ్రేడ్స్‌ను ఉరితీస్తే 'ఈ భారత ప్రభుత్వంకన్నా ఆ జార్ చక్రవర్తే నయం' అని లోకం అనుకోగలదని హెచ్చరించిన శ్రీశ్రీయే భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరితీసిన అదే ఇందిరా భారత ప్రభుత్వాన్ని 'వామపక్ష నియంతృత్వం' అన్నాడు ఎమర్జెన్సీలో.

సరస్వతీగిరి పద్యాలకు సర్టిఫికెట్ ఇవ్వడంలో, శేషేంద్ర కవితకు సర్టిఫికెట్లు యిచ్చి వాపసు తీసుకోవడంలో శ్రీశ్రీలో చాపల్యాన్ని ఆమోదించక పోయినా అర్థం చేసుకోవచ్చు. కాని ఏ డిఎంకె ప్రభుత్వం వుండడంవల్ల తమిళనాడులో తాను కట కటాలు తప్పించుకోగలిగాడో అది పడిపోయిన తెల్లవారే దాని గురించి చెడు మాట్లాడడం, 'ఇందిరమ్మ భాజాభజంత్రీగా' అని వెంగళరావును తిట్టి ఎమర్జెన్సీ పెట్టగానే తానుకూడ ఆ 'బ్యాండ్ వ్యాగన్'లో చేరిపోవడం అవకాశ వాదమవుతుంది గానీ అవగాహనా లోపం కాజాలదు.

ఇరవై సూత్రాలను బలపరచానే గానీ, ఎమర్జెన్సీని కాదు అని అనబోయాడంటే చేసిన తప్పు చాలదన్నట్టు ఇంకా ఆత్మవంచనకు పూనుకుంటున్నట్లే. కనుక 'సంజా యిషీ' చెప్పడంకాదు కావలసింది; నిజాయితీతో కూడిన పశ్చాత్తాపంతో శ్రీశ్రీ తన తప్పు గ్రహించి దిద్దుకోవాలి.

శ్రీశ్రీ పరీక్షకు పెట్టబడినపుడు ఈ కల్లోల / నక్సల్బరీ / విరసం దశాబ్దంలో 1970 జులై 4 (విరసం అవతరణ) నుంచి 1975 తెలుగు ఉగాది (ప్రపంచ తెలుగు

సభలు) వరకు ఈ పరీక్షకు తట్టుకొని నిలిచాడు. ఈ కాలమంతా కూడ చిన్నతప్పులు చేస్తూ పెద్దఒప్పులు చేసాడు.

నక్సల్బరీ దశాబ్దంలో శ్రీశ్రీ చెప్పిందంతా విప్లవమని భావించే వెర్రివాళ్ళు ఎవరూ లేక పోవడం వల్ల ఆయన విప్లవం గురించి ఉత్తేజకరంగా, ఉద్వేగ భరితంగా చెప్పింది మాత్రమే యువతరానికి ఉషారు నిచ్చింది, పనికొచ్చింది. ఆయన తప్పులన్నీ ఆయనకే వెలితిగా మిగిలిపోయాయి.

తమది కూడ శ్రీశ్రీ యుగం అని వినమ్రంగా అంగీకరిస్తున్న నక్సల్బరీ యువ తరంపై శ్రీశ్రీకి వున్న ప్రభావం - తనవల్ల కాగలిగితే వాళ్ళవెంట నడుస్తూ, 'మహాప్రస్థానం', కమ్యూనిస్టు పార్టీ, విరసం తనకు కలిగించిన వ్యక్తిత్వాన్ని, దాని కుండే శక్తిని ప్రజలకొరకు సద్వినియోగపరచడంపై ఆధారపడి వుంది.

విరసం 'క్షుద్ర' రాజకీయాలకు దూరంగా వుండాలనో, 'వ్యక్తిగత హింసా వాదా'న్ని వదులు కోవాలనో, 'విరసంలో రాజకీయాలు ఎక్కువయ్యాయ'నో ఆయన విప్లవ సాహిత్యోద్యమంలో వుండి చెప్తే పట్టించుకుంటారు గానీ, ఎమర్జెన్సీలోనో, అరసం వేదిక మీంచో, సన్మాన సభల్లోనో చెప్తే - చెప్పించిన వాళ్ళకు కూడ ఆయన తేలికే అవుతాడు. సరియైన దారిలో వున్నవాళ్ళకు దారి తప్పేవాని గురించిన ఆవేదనే గానీ అతనివల్ల తాము దారి తప్పుతామేమోనన్న భయమూ, ఆందోళనా కాదిది.

ఒక నక్సల్బరీ పోరాటయోధుడైన విప్లవకవి తరచు ఆందోళన వ్యక్తపరచి నట్టుగా - "శ్రీశ్రీ శత్రు శిబిరంలో చనిపోగూడదు." ఆయన స్పందన విప్లవంలో వున్నది. ఆయన మనస్సు **మార్పులో** వున్నది. ఆయన చూపు 'మరో ప్రపంచం'పై వున్నది. ఆయన అవసరాలు, అలవాట్లు, పరిస్థితులు ఆయనను ప్రలోభపెట్టడం - ముఖ్యంగా తనకీ వ్యక్తిత్వం ప్రజల నుంచి వచ్చిందని నిశితంగా అవగాహన చేసుకునే రాజకీయ స్థాయి కొరవడినపుడు - చాల సహజం.

ప్రమాదానికీ, ప్రలోభానికీ భయపడకుండా లొంగకుండా శ్రీశ్రీ చరిత్ర చోదక శక్తుల్లో చేరుతాడా, చరిత్రగా మిగిలిపోతాడా అనేవి ఈ డెబ్భయ్యో ఏట ఆయన చుట్టూ ముసురుకుంటున్న పొగడ్తలూ, అతి త్వరలోనే ప్రజాస్వామ్యవాదులకు మళ్ళీరానున్న పరీక్షా సమయమూ తేలుస్తాయి.

ఎంత బలహీనమైన పరిస్థితుల్లోనైనా 'విరసం జెండా కిందనే చనిపోతాను' అన్న శ్రీశ్రీ బలవత్తరమైన ఆకాంక్షకు జేజేలు చెప్పుదాం.

1980 జనవరి 2

– వరవరరావు

## గర్జించు రష్యా గాండ్రించు రష్యా
## దేశాలనన్నీ కబళించు రష్యా

టంకశాల అశోక్

అంగోలా నుండి అఫ్ఘనిస్తాన్ వరకు
రష్యన్ మర తుపాకుల వర్షంలో
కుప్పకుప్పలుగా కుప్పకుప్పలుగా
ఎవరి శవాలివి
ఎవరి శవాలివి

టాంకులూ, గన్ కాప్టర్లు
నాపామ్‌లు, డీఫోలియెంట్లు
మిస్సైల్సు, విషపు గ్యాసులూ
ఎవరి కోసమివి
ఎవరి కోసమివి

ప్రజలంతా రియాక్షనరీలు
ఏజెంట్లే ప్రగతివాదులా
సిద్ధాంతపు జరీముసుగులు
ఎందుకోసమిది
ఎందుకోసమిది

ముడిసరుకులు, వ్యాపారాలు
పెట్టుబడులు, దోపిడిదారీ
రాజకీయ పెత్తందారీ
నాజీలను చంపినదేశం
నాజీలను మించిందా

చెక్ నుండి కంపూచియా వరకు
రష్యన్ మర తుపాకుల వర్షంలో
ఎవరి శవాలివి
ఎందుకోసమిది

# ప్రజల మధ్య శ్రీశ్రీ

లోచన్

"ఎర్రెర్రని విప్లవ సంప్రదాయం గల తుంగతుర్తి రైతుకూలీ సోదరులకు నా లాల్ సలామ్."

మైక్‌లో శ్రీశ్రీ కంఠం మారుమోగింది- సభలోగోల హఠాత్తుగా ఆగిపోయింది-

అది 1975 ఏప్రిల్- తేదీ జ్ఞాపకం లేదు. రాత్రి సుమారు 8 30. గం. సూర్యాపేట తాలూకా తుంగతుర్తి గ్రామం రైతుకూలీ సంఘం ఏర్పాటు చేసిన బహిరంగసభ- సభలో శ్రీశ్రీ ప్రధానవక్త.

అలా ప్రారంభమైన శ్రీశ్రీ ఉపన్యాసాన్ని చివరిదాకా ఎంతో ఆసక్తిగా హుషారుగా విన్నారు జనం, మధ్యమధ్య హర్షధ్వానాలతో, విప్లవ నినాదాలతో.

అనేక సభల్లో శ్రీశ్రీ తానుమాట్లాడ వలసిన విషయాన్నుంచి వైదొలగి శాఖా చంక్రమణం చేయడం చూసిన నేను ఆనాటి ఆయన ఉపన్యాసంవిని ఆశ్చర్యపోయాను- ఆరోజు శ్రీశ్రీ ఎంతోసూటిగా శక్తివంతంగా మాట్లాడారు- మళ్ళీమళ్ళీ వినాలనిపించిన ఉపన్యాసం అది-

'ఈనాడు దేశంలో శ్రామికుల నికృష్టజీవితం- ప్రభుత్వం అండ దండతో భూస్వామ్య, బూర్జువావర్గాలు సాగిస్తున్న క్రూరమైన దోపిడీ, హింస, రక్తపాతం- ఇవ్వాళ విప్లవ ఆవశ్యకత దాని అనివార్యమైన విజయం'- వీటిని గూర్చి శ్రీశ్రీ ఎంతో ఉత్తేజకరంగా మాట్లాడారు-

నిజానికి ఆనాడు సభలో అక్కడి రైతుకూలీ జనం సృష్టించిన వాతావరణం, ఉత్సాహం శ్రీశ్రీతో అలామాట్లాడించనై.

బహిరంగసభకన్నా ముందు, సాయంత్రం రైతుకూలీజనం తుంగతుర్తి గ్రామ వీధుల్లో శ్రీశ్రీ ముందు నడుస్తుంటే, పిల్లలు, యువకులు, వృద్ధులు, అర్ధనగ్న శరీరాలతో, చేతుల్లో ఎర్రజెండాలతో కంఠాల్లో విప్లవ గీతాలతో అత్యంత ఉత్సాహంగా ఊరేగింపు జరిపారు. అక్కడి రైతుకూలీ జనానికి ఎర్రజెండా అన్నా, ఎర్రజెండా పాటలన్నా ఎంత ప్రాణమో, ఆనందమో చూడవలసిందే- శ్రీశ్రీ ఎర్రజెండాతో ఊరేగింపుగా వెంగళ్రావు పోలీసు కిరాతకులచే దారుణంగా హత్యచేయబడ్డ 19 ఏళ్ళ హరిజన యువ విప్లవకారుడు దేవయ్య గుడిసెకు వెళ్ళి ఆ అమరవీరుని నిరుపేద తల్లి దండ్రులను పరామర్శించారు- ఊరేగింపు జనాన్ని చూసి దేవయ్య తల్లి "మందిల కలిసిపోయినావురో నా తండ్రి దేవయ్యా, మందిల బతుకుతానవా, నాయనో దేవయ్యా" అని గుండెపగిలేటట్టు ఏడుస్తుంటే శ్రీశ్రీతో పాటు అందరమూ చలించిపోయాం.

బహిరంగసభ ముగిసేసరికి రాత్రి 12 దాటింది. ఆ రాత్రి తుంగతుర్తిలోనే పడుకున్నాం. మరునాడు శ్రీశ్రీ హైదాబాద్‌లోనూ మరికొన్ని చోట్ల బహిరంగ సభల్లో మాట్లాడి అక్కడి నుండి మద్రాసు వెళ్ళిపోవాలి. ఎటు వెళ్ళాలన్నా మొదట సూర్యాపేట వెళ్ళాలి. తుంగతుర్తికి సూర్యాపేట సుమారు 11 మైళ్ళు. రోడ్డు సౌకర్యంలేదు. కాలిబాట. అదైనా సుగమంగా లేదు. అంతా ఎగుడు దిగుడు. రాళ్ళు, రప్పలూ, బురదా, మధ్యలో మూసీనది. సూర్యాపేట చేరాలంటే యివన్నీ అధిగమించాలి. కాలినడక, రెండెడ్ల బండి తప్ప మరే వాహనమూ పనికిరాదు. (జీపు అతికష్టంగా వెళ్ళగలదేమో.)

శ్రీశ్రీతో పాటు అనేక దూరప్రాంతాల నుండి తుంగతుర్తి వెళ్ళిన 11 మందిమి ఉదయం 5 గం. లకే కాలినడకన సూర్యాపేటకు వెళ్ళడానికి సిద్ధమైనాం. వయోభారం దృష్ట్యా శ్రీశ్రీ ఒక్కరికైనా ఎడ్లబండి ఏర్పాటు చేస్తామన్నారు గ్రామస్థులు. కాని శ్రీశ్రీ ఒప్పుకోలేదు. అందరితో పాటు తానూ కాలినడకనే వస్తానన్నారు.

అందరమూ కలిసి ప్రయాణమైనాం. అది ఎండాకాలమైనా మోట బావులనీళ్ళు ప్రవహించి అనేక చోట్ల దారిబురదైపోయింది. అక్కడక్కడ చెప్పులు చేతపట్టుకొని నడిచాం. బురద, ఎగుడు దిగుడు, రాళ్ళు, ముళ్ళు. ఇరవైఎనిమిదేళ్ళ 'స్వరాజ్యం' తరువాత గ్రామాల పరిస్థితి యిది. ఇలాంటి దారిలో 11 మైళ్ళ ప్రయాణం. మాలో దాదాపు అందరమూ అలసిపోయాం. 65 ఏళ్ళ శ్రీశ్రీ తాను అలసిపోయానని చెప్పక పోయినా ఆయన ముఖంలో, నడకలో అలసట స్పష్టంగా కనిపించింది. చివరికి సూర్యాపేట పొలిమేరలు సమీపించాం. అక్కడే మూసీనదిని దాటాలి. ఎత్తైన గట్టు దాటి నది యిసుకలోకి నడిచాం.

"నదీ నదాలూ, అడవులు, కొండలు, ఎడారులా మన కడ్డంకి" మహాప్రస్థాన గీతాన్ని demonstrate చేస్తున్నారా అని శ్రీశ్రీని అడిగాను తమాషాగా. ఆయన చిరునవ్వునవ్వి ఊరుకున్నారు. ఎండాకాలం, నదిలో నీరులేదు. సన్నని నీటిపాయ మాత్రం పారుతోంది. నీళ్ళలో కాళ్ళూ చేతులూ తడుపుకొని యిసుకలో తేలిన వెడల్పాటి ఒక బండమీద కాసేపు విశ్రాంతి తీసుకుందామని కూర్చున్నాం. మధ్య శ్రీశ్రీ చుట్టూ అందరమూ. శ్రీశ్రీ ఎన్నో కబుర్లు చెప్పారు. ఆయనను కదిలిస్తే ఎన్నోకథలు, కవితలు, టుప్రీలు ఒకటి తరువాత ఒకటి వస్తూనే ఉంటాయి. ఆయనలో మంచి Fun (వినోదం) ఉంది. ఆ వినోదం వెనక ఏదో సీరియస్‌నెస్ ఏదో జీవితపు చేదునిజాల నీడలు తిరుగుతున్నట్లు ఏదో చాప్లిన్ తత్వం ఆయనలో ఉన్నట్లు

అనిపిస్తుంది- తరుచూ ఆయన ఏదో సుదూర సుందర భవిష్యత్తులోకి విలోకిస్తున్నట్లు, ఒక నూతన ప్రపంచం కోసం ఎదిరిచూస్తున్నట్లు అనిపిస్తుంది- అలా మూసీ యిసుకలో సుమారు ఒక గంట గడిపాక అవతలిగట్టు దాటి సూర్యాపేట చేరుకున్నాం- అక్కడి నుండి శ్రీశ్రీ బస్సులో హైదరాబాదు వెళ్ళిపోయారు-

1975లో జరిగిన యీ చిన్న సంఘటనను నేను యిక్కడ చెప్పడానికి కారణం, సినీపసందుల, సర్కారీ విందుల మధ్య విమానాల్లో, కార్లలో, సోఫాల్లో కూచొని కవిత్వం అల్లిపారేసే ఈనాటి అభ్యుదయ కవుల్లా కాకుండా సినీరంగంలో ఉంటూ కూడా దెబ్బయిల్లో శ్రీశ్రీ జీవితం ప్రజా ఉద్యమాలతో ముఖ్యంగా ప్రజా హక్కుల పోరాటంతో ఎలా పెనవేసుకొనిపోయిందో మచ్చుగా చెప్పడానికే-

ఆ రోజుల్లో శ్రీశ్రీ తెలుగుదేశంలో చాలా గ్రామాలు తిరిగారు- అనేక మారుమూల పల్లెటూళ్ళకు సైతం వెళ్ళి పౌరహక్కుల, రైతుకూలీ సంఘాల, విప్లవ రచయితల సభల్లో మాట్లాడారు- తాను నెలలో 10 రోజులు మాత్రమే మద్రాసు నగరంలో ఉంటూ 20 రోజులు ప్రజా కార్యక్రమాల్లో తెలుగుదేశం మారుమూల గ్రామాలు తిరుగుతూ అచ్చమైన ప్రజా సాంస్కృతిక సైనికుడిలా జీవించారు-

శ్రీశ్రీని ఎందరు విమర్శించినా, ఆయనలో యీ వ్యవస్థాపరమైన, వ్యక్తిగతమైన లోపాలు ఎన్ని ఉన్నా ఎప్పుడూ పీడితుల తాడితుల దగాపడ్డ తమ్ముల పక్షాన నిలబడ్డ ప్రజా కళాకారుడు శ్రీశ్రీ-

శ్రీశ్రీలో నిరంతరం ఏదో అలజడి, ఆందోళన, ఏవో భావాల పెనుగులాట నూతన ప్రపంచం కోసం ఆరాటం- శ్రీశ్రీ పసివాడు, స్వాప్నికుడు, నవ్య భావుకుడు- మనిషి- మనవాడు- ఆయన రక్తంలో కవిత్వం- కవిత్వంలో మానవ సంగీతం, వేగం, ప్రాణం, పురోగమనం, మనిషి స్వేచ్ఛ కోసం తపన-

సినీ ఊబిలోంచి బయటపడాలని ఆవేదన ఉండీ బయటపడలేకపోయిన వాడు శ్రీశ్రీ- ఆయన మాటల్లోనే "My sympathy is always with the extremist of the extreme"- అయితే తనలోని తుక్కు కరిగిపోవడానికి Political education (రాజకీయ విజ్ఞానం) కావాలనుకొనే కాంక్ష, తనలోపం యొక్క స్పృహ ఉన్నవాడు శ్రీశ్రీ- ఒక క్రమబద్ధమైన జీవితం ఉండి ఉంటే శ్రీశ్రీ యింకా ఎక్కువ సాహిత్య సేవ, ప్రజాసేవ చేయగలిగేవారు ఏమైనా తెలుగు కవితను అభ్యుదయ పథంలో ముందుకు నడిపి ప్రజల మనస్సుల్లో సంతకం చేసిన మహాకవి శ్రీశ్రీ-

# శ్రీశ్రీ వారసత్వం

శివసాగర్

శ్రీశ్రీ ఒకటి కాదు రెండు: 'మహాప్రస్థానం' శ్రీశ్రీ; ప్రయోగవాది శ్రీశ్రీ. మనం 'మహాప్రస్థానం' శ్రీశ్రీకే వారసులం. ప్రయోగవాది శ్రీశ్రీకి కాదు, శ్రీశ్రీ అంటే 'మహాప్రస్థానం' శ్రీశ్రీయే.

ఏదీ శూన్యం నుండి వూడిపడదు.

నాలుగు దశాబ్దాల కమ్యూనిస్టు ఉద్యమంలోని విప్లవాంశకు వారసత్వం నక్సల్ బరీ ఉద్యమం కాగా అనేక సంవత్సరాల అభ్యుదయ సాహిత్యోద్యమంలోని విప్లవాంశకు వారసత్వం విప్లవసాహిత్యోద్యమం.

అభ్యుదయ కవితా సాహిత్యోద్యమం సాధించిన విజయాలకు శ్రీశ్రీ, సుంకర ప్రతీకలు. శ్రీశ్రీ విప్లవ సాహిత్యోద్యమంలోకి రాగల్గాడు; సుంకర రాలేకపోయాడు.

ఈ శతాబ్దం మూడవదశకంలో, రెండవ సార్వత్రిక సంక్షోభకాలంలో, దేశంలో ఆర్థిక మాంద్యం తీవ్రంగావున్న సమయంలో, శ్రీశ్రీ 'మరోప్రపంచ' శంఖారావం చేశాడు. ప్రారంభంలో ప్రపంచ అభ్యుదయ రచయితల సంఘం మానిఫెస్టో అతనికి ఉత్తేజం.

మూడవ సార్వత్రిక సంక్షోభకాలంలోని అతని వారసులకు నక్సల్‌బరీ, శ్రీకాకుళ గైతాంగ సాయుధపోరాటాలే ప్రత్యక్ష ఉత్తేజాలు.

వారసత్వసమస్యను పరిశీలించటమంటే పూర్వీకునికి, వారసునికి మధ్యవున్న పోలికల్ని, తేడాల్ని పరిశీలించటమే. పోలికలు ఆధిక్యతా స్థానంలో వున్నప్పుడే వారసత్వసమస్య ఉదయిస్తుంది. ఉభయులకూ ఒకే ప్రధానలక్ష్యం వుండితీరాలి.

'వ్యధార్త జీవిత యథార్థదృశ్యం' కవితలో కనిపించాలనీ, అది 'జాతిజనులు పాడుకునే మంత్రం'గా వినదించాలనీ, శ్రీశ్రీ లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు అతను కృషి చేశాడు.

శ్రీశ్రీ విప్లవ కవితాసందేశం మొదటిసారిగా సామాన్య మధ్యతరగతిని తాకింది, వూపింది, వుత్తేజపరచింది.

వయా శ్రీశ్రీ [మహాప్రస్థానం] కమ్యూనిస్టు ఉద్యమాన్ని చేరినవాళ్ళు చాలా మందున్నారు. అతని 'మహాప్రస్థానం' చదివి జనం కోసం కలం పట్టినవాళ్ళున్నారు.

శ్రీశ్రీ సామాన్యుల గురించి అసామాన్యంగా వ్రాశాడు.

శ్రీశ్రీ వారసులు అతని కవితాలక్ష్యాన్ని మరింత ముందుకు తీసుకపోయారు. విప్లవ కవితాసందేశాన్ని పొలాల్లోకి, ఫ్యాక్టరీల్లోకి, పాఠశాలల్లోకి, పల్లెల్లోకి, ఎల్లల్లోకి, కొండల్లోకి, నిరుపేద జనం గుండెల్లోకి తీసుకపోగల్గారు.

శ్రీశ్రీలా ప్రజలగురించి వ్రాయటమేగాక, ప్రజాబాణీలో వ్రాయగల్గారు.

శ్రీశ్రీకి 'మరోప్రపంచం' ఒక విప్లవ స్వప్నం. అతని వారసులకు అది రక్తతర్పణంచేసి, పోరాడి సాధించాల్సిన విప్లవలక్ష్యం.

శ్రీశ్రీ ఎల్లప్పుడూ వామపక్షాన్నే నిలిచాడు. అయితే శ్రీశ్రీ కన్న అతని వారసులు రాజకీయంగా, సిద్ధాంతపరంగా నిలకడగలవారు.

అతని వారసులు అతని బలహీనతల్ని అర్థంచేసుకొని, చిరునవ్వుతో క్షమించ గలరు.

శ్రీశ్రీ అతనికి అతనే వారసుడు. 'మహాప్రస్థానం' శ్రీశ్రీకి మనంవారసులం. అలాగే 'మరోప్రస్థానం' శ్రీశ్రీ 'మహాప్రస్థానం' శ్రీశ్రీకి వారసుడు.

పరవళ్ళు తొక్కుతూ పురోగమించే మహాకవితా స్రవంతి శ్రీశ్రీ

సాహితీరణరంగంలో శ్రీశ్రీ మనకు ఆద్యుడేగాదు సహయోధుడు కూడా.

డెబ్బైయో పడిలో ప్రవేశిస్తున్న 'మావాడు, మా శ్రీశ్రీ'కి ఇవే మా విప్లవ జేజేలు.

21-12-79

## నక్సల్బరీ - శ్రీశ్రీ

మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు
ఝాన్సీలక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు
సరోజినీదేవీ ఫొటో పటంకట్టి పొగడుతారు
పంచాది నిర్మలంటే భయంపట్టి వణుకుతారు।

తెల్లవాడు నిన్ననాడు భగత్సింగు అన్నాడు।
నల్లవాడు నువ్వనేడు నక్సలైటు వన్నాడు।
ఎల్లవారు నిన్నురేపు వేగుచుక్క అంటారు।
శ్రీకాకుళ వారసుడా। శ్రీశ్రీ కవిత్వలాలసుడా।

ఊగరా, ఊగరా, ఊగరా!
నువ్వూగుతుంటె శత్రువులకి గాభరా

# శ్రీశ్రీ మార్గం శ్రీశ్రీ కంటె గొప్పది!

శ్రీశ్రీగారిని గురించి చెప్పుకోవాలంటే మనం యేమయినా చెప్పుకోవచ్చు.

పసితనం నుండీ పద్యాలు రాయటం ఆరంభించి పాతికేళ్ళ వయసుకే మహా మహుల మన్ననలు అందుకున్నారనవచ్చు. వీచే ప్రభంజనంలాగా, హోరని యెగసిపడే జలపాతంలాగా, గలగలపారే సెలయేరులాగా వారి కవిత్వం పామరుల హృదయాల్లోనేగాక పండితుల మనస్సులో కూడా కలకాలం చెదరని ముద్ర వేసిందనవచ్చు. సాహిత్యంలో ఆయన తీర్చిదిద్దని ప్రక్రియలేదనీ; ముందుండి నడపని ఉద్యమం లేదనీ, భాషచేత ఆయనలా వూడిగం చేయించగల కవి యింకొకరు లేరనీ; కవిత్వంలో ఆయన చేసినన్ని ప్రయోగాలు యింకెవ్వరూ చేయలేదనీ; కవుల్లో ఆయనకున్న ఫాలోయింగ్ యింకే కవికీ లేదనీ; చమత్కారానికి ఆయన్ని చెప్పే యింకొకర్ని చెప్పాలనీ—ఇలా యెన్నైనా ఆయన గురించి చెప్పుకోవచ్చు.

అయితే –

ఒక మనిషి బాలప్రాయంలోనే మహా బలవంతుడైనందువల్ల, దరిమిలా ఒడ్డూ పొడుగు చాకచక్యం ఒడుపూ పెంచుకోవడంవల్లా, ప్రదర్శించడంవల్లా అవి ఆయనకు కీర్తి కారణాలైతే కావచ్చు. లేదా అందువల్ల ఒరిగేదేమేనావుంటే ఆయనకు ఒరగవచ్చు. అంతేకాని లోకానికేమీ ఒరగదు.

అందుచేత –

లోకదృష్టితో చూస్తే, చూసి ఒక మనిషి గురించి చెప్పుకోవాలంటే, చెప్పుకోవలసేవి ఆ వ్యక్తి శక్తి సామర్థ్యాలు కావు. ఆ శక్తి సామర్థ్యాలు దేనికోసం వినియోగమయ్యాయన్నది చూడాలి. దేనికోసం వినియోగమయ్యాయో చూసేక అవి ఏమి సాధించాయో చూడాలి.

ఆ విధంగా చూస్తే –

శ్రీశ్రీ తన శక్తియుక్తులన్నింటినీ తన కోసంకన్నా పరులకోసమే వినియోగించాడని తెలుస్తుంది.

అంతేకాదు –

ఆదిమ జాతులవారికి ప్రకృతి శక్తులపట్ల ఎలాంటి భయ భక్తులుండేవో నిన్న మొన్నటిదాకా కవిత్వమన్నా, కవులన్నా తెలుగువారికి అలాంటి భయభక్తులుండేవి.

శ్రీశ్రీ సాగించిన ఉద్యమంవల్ల శ్రీశ్రీ, అతని తరువాతి కవులూ "ఛందస్సుల బందో బస్తుల నుండీ" "వ్యాకరణాల సంకెళ్ళ నుండి" "తెలుగు కవితా సరస్వతికి" విముక్తిని సాధించేరు.

దాని పర్యవసానంగా –

ఈనాడు వేలాది యువతీ యువకులు తమ ఆశలనూ, ఆవేశాలనూ, ఆనంద విషాదాలనూ బరువులనూ, బాధలనూ, ఆ బాధల నుండి విముక్తికి మార్గాలనూ వ్యక్తీకరించేందుకూ, తమ సాటివారితో పంచుకునేందుకూ, కవిత్వాన్ని ఒక సాధనంగా ఒక వాహనంగా ఉపయోగించుకుంటున్నారు.

పైగా –

కొత్తతరం. శ్రీశ్రీ తరువాత తరం. శ్రీశ్రీ కలలుగన్న లక్ష్యాన్ని సాధించబోతోంది. సామాన్యులవరకూ వచ్చిన కవిత్వాన్ని వారు సమాజంలో అట్టడుగు పొరలవరకూ తీసుకుపోతున్నారు. ఆ విధంగా ఆయన ధూమార్గం పట్టించిన రథ చక్రాలు, జగన్నాథ రథచక్రాలు నేల నాలుగు చెరగులకూ సాగిపోతాయి.

కాబట్టి –

శ్రీశ్రీకన్నా గొప్పది శ్రీశ్రీ కవిత్వం.

ఆయన కవిత్వం కన్నా గొప్పది ఆయన అనుసరించిన మార్గం.

– **కాళీపట్నం రామారావు**

(ఆంధ్రజ్యోతి' వారపత్రిక 30-11-79 సౌజన్యంతో)

## ఆయన కవిత, ధర్మం చేతిబాణం

....పాపాల అరాతీసే శ్రీశ్రీ గారి గాలి మామూలు గాలి కాదు. అది వెర్రి గాలి. అది స్వేచ్ఛా వాయువు. అది ప్రచండ ప్రభంజనం. కొన్ని చోట్ల కొందరు పెద్దలు దాన్ని కిటికీలు మూసి, తలుపులేసి, తాళాలు బిగించి ఉంచగలరేమో కాని, దాన్ని లొంగ దియ్యలేరు. లిక్విడేటు చెయ్యలేరు. సముద్రంలోంచి నీరు తోడగా తోడగా అది ఆఖరికి నిన్నే ముంచేస్తుంది. దాన్ని ఎన్ని కొట్లలో దాచగలవు నువ్వు? దాన్ని వేడెక్కించి ఉడుకు లెత్తించి ఆవిరిగా మార్చినా అది నీరుగా మారి మళ్ళీ నిన్నే ముంచేస్తుంది.

శ్రీశ్రీగారు కవిత్వంలోనే ప్రభంజనం రేకెత్తించలేదు, ప్రజల్లో కూడా ప్రభంజనం రేకెత్తించేరు. నీ కవిత్వానికీ ప్రజకీ సంబంధం లేనప్పుడు ఆ కవిత్వం ఎన్ని సుళ్ళు తిరిగినప్పటికీ అది నీ టీ కప్పులోనే ఉంటుంది. .... శ్రీశ్రీ గారు పేదజనుల, దీన జనుల ప్రభంజన కవే కాని పెద్దింటి వారి వంటకవి కాదు. ....

.... శ్రీశ్రీ గారు కవిత్వానికి ఏ తొడుగు తొడిగేరు అనేది ముఖ్యంకాదు. కవితామతల్లి ఆదిశక్తి. ఆ శక్తిని అతను పతితుల, భ్రష్టుల బాధాసర్ప దష్టుల పక్షాన నిలబెట్టేడు. ఆమె చేతికి ఆయుధాలుగా ఇచ్చేడు తన కవితల్ని. శ్రీశ్రీ మహాకవి ధర్మంపక్షాన నిలబడ్డాడు. ఆయన కవిత, ధర్మం చేతి బాణం.

రాచకొండ విశ్వనాథశాస్త్రి

23-1-70

# నక్సల్బరీ తరం - శ్రీశ్రీ

"తనకూ, ప్రపంచానికీ సామరస్యం కుదిరిందాకా కవిచేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వం"

– చెలం (మహాప్రస్థానం; యోగ్యతాపత్రం)

మొత్తంగా ప్రపంచానికీ 'తనకూ' 'సామరస్యం' కుదరడం వరకుసాగే అంతర్ బహిర్ యుద్ధారావంగా శ్రీశ్రీ కవితా సమరభేరిని ఒకచక్కని వ్యక్తీకరణలో కుదించాడు చెలం. చెలానికి సంబంధించినంత వరకు అది వాస్తవమే అయింది. 'భగవాన్ రమణ మహర్షి' ప్రపంచానికీ తనకూ "సామరస్యం" కుదిరించి "సీజ్ ఫైర్" ఏర్పాటు చేయడంతో చెలం భౌతికమరణం కంటె బాగాముందే మరణించాడు.

మహాకవి శ్రీశ్రీ సంఘంలో వర్గవైరుధ్యాల్ని దర్శించగలిగాడు. విరుద్ధవర్గాల్లో ప్రగతి శీలమైనదీ, పోరాటంలో న్యాయందిక్కున వున్నదీ పీడిత ప్రజానీకం. ఆ ప్రజలపక్షాన, అదీపోరాట ప్రజల పక్షాన నిలిచాడు. కనుకనే, శ్రీశ్రీ గతతరంనుండి నక్సల్బరీ తరానికి పరిక్రమించాడు. "నెత్తురుమండే, శక్తులునిండే సైనికులారా! రారండి!" అని యువకులకు ఒక పిలుపునిచ్చి, తానుమాత్రం "ఎముకలు క్రుళ్ళిన, వయస్సు మళ్ళిన సోమరుల"తో కలిసి హాయిగా చచ్చిపోకుండా 70 సంవత్సరాల వయస్సులో "పావన నవజీవన బృందావన నిర్మాతల్లో, ముందుయుగం దూతల్లో" ఒకడుగా నిలిచాడు.

ఆనాడు "అగ్నిధార"లు కురిసిన వాళ్ళూ మెరిసిన వాళ్ళూ "వజ్రాయుధాలు" ఝళిపించిన వాళ్ళూ తమ అస్త్రాలు బొగ్గులుజేసి ప్రభువుల వంట యిళ్ళకు సరఫరా చేశారు. తమ ఆయుధాల్ని ప్రభువుల పాదపీఠాల మీద పెట్టి మోకరిల్లినారు. సింహాసనాల మీద, సింహాసనాలిచ్చే శాంతి నినాదాల మీద పజ్యాలు వండుతూ పండి పోయారు. మహాకవి మాత్రం "మహాప్రస్థానం" నుండి "మరో ప్రస్థానం"నికి ప్రయాణమై నడుస్తూనే వున్నాడు. మరో ప్రపంచాన్ని ఆవాహనచేసి అంతటితో ఆగిపోకుండా ఎర్రబావుటా నిగనిగలు, అగ్ని కిరీటపు ధగధగల అండతో తనతో తాను పోరాడుతూ, సరిచేసుకుంటూ, ఏటి కెదురీదుతున్న "నక్సల్బరీ తరం"తో కదం కదం కలిపి నడుస్తున్నాడు.

ఈనాడు – మహాకవి శ్రీశ్రీ మా తరంలో, నక్సల్బరీతరంలో ఒక భాగం. మా తరం యవ్వనంలో ఒక ముఖ్య జీవశక్తి. గతకాలం నుండి మాకు సంక్రమించిన విలువైన సజీవ సంపద.

"నక్సల్బరీతరం"తో యింతగా కలగలిసి పోయినా, శిల్పంరీత్యా ఆయన "మార్గం అనితరసాధ్యమే" అయింది. సామూహికత్వంలోనే సొంత వ్యక్తిత్వం అద్భుతంగా వికసిస్తుందని ఆయనే ఎక్కడో అన్నట్లు గుర్తు. సామూహికతలో కలగలుస్తూ సొంత వ్యక్తిత్వం నిలుపుకున్నది ఆయన కవిత. అందువల్లనే, మొత్తం లోంచి భాగాన్ని విడదీసి పరిశీలించవలసిన అవసరం కూడా కలుగుతోంది. తోటను పరీక్షించాలంటే "గుర్రం మీుపు మీంచి పరిశీలించడం", "గుర్రందిగి ఒక్కొక్క పువ్వునూ పరిశీలించడం" రెండు చేయాల్సిన పనులే.

## నక్సల్బరీతరం మీద శ్రీశ్రీ ప్రభావం

నక్సల్బరీతరం; శ్రీశ్రీ. రెండు అంశాలు. అవి ఒకదాన్నొకటి ప్రభావితం చేసుకున్న అంశాలు. ఒకదానికొకటి దోహదం చేసుకున్న అంశాలు. ఒకటి లేకుండ మరొకటి యిపుడున్నంత పదునుగా వుండేవి కావు.

"నక్సల్బరీతరం"లో వికసించిన కవుల్లో బాగా ఎక్కువ మంది శ్రీశ్రీని తప్పని సరిగా చదివివుంటారు. అంతకు ముందు సాహిత్యంతో పరిచయమేమీ లేకుండా, పోరాట మిచ్చిన ఉత్తేజంతో గుండె గొంతకలోన కొట్లాడగా పొలాల్లోంచి, గనుల్లోంచి అక్షరప్రమేయంలేని పాటలు కూడా వినిపించాయి. వినిపిస్తున్నాయి. సీరియస్‌గా కవిత్వం రాద్దామనుకున్న యువకులు ఆ తరువాతనైనా యీ కవిత్వపు గనిని తప్పక పరిచయం చేసుకుని వుంటారు.

"మహాప్రస్థానం" చదివి కమ్యూనిస్టులైన వాళ్ళ సంఖ్య అతిశయోక్తిగావచ్చు కాని, "మహాప్రస్థానం" చదివి విప్లవ కవనం పైపు మొగ్గిన యువకులకు కొదువలేదు.

శ్రీశ్రీని చదివి అనుకరించబోయి మోకాలిచిప్పలు విరగ్గొట్టుకున్న వాళ్లు "నక్సల్బరీ తరా"నికి సమకాలికుల్లో ఎందరో వున్నారు. "మహాప్రస్థానా"న్ని శీర్షికనుండి ఇంప్రింట్‌దాకా కాపీకొట్టబోయి, రిడిక్యులస్‌గా తేలిపోయినకావ్యం "మహాసర్గ" అనేది శ్రీశ్రీ శిల్పాన్ని ఎంచక్కా కాపీకొట్టాలనీ చూసింది యీకావ్యం. "నాదుర్గం అనితర భేద్యం"అని మహాకవి వాక్కు ("నామార్గం అనితరసాధ్యం")ను యీకావ్యం రుజువు చేసింది. వికసిత యవ్వనోత్సాహాన్ని వర్ణించిన శిల్పంతో, పదసముదాయంతో శవాన్ని శ్లాఘించబోయి అపహాస్యం పాలయింది.

శ్రీశ్రీ వ్యతిరేకించింది సరిగ్గా దీన్నే. అనుకరణను.

శ్రీశ్రీ నుండి వుత్తేజం తీసుకున్న "నక్సల్బరీతరం" కవులుమాత్రం- ఆయన మార్గాన్ని- సొంతగొంతు సవరించడంగా, సామూహిక చర్యను శ్లాఘించడంగా, ఉత్పత్తిశక్తుల విప్లవ విజృంభణను గుండెకు హత్తుకుని తిరిగి వ్యక్తీకరించడంగా- అవగాహన చేసుకున్నారు. నిజాయితీని, నిర్భయత్వాన్ని ఆయన కవిత్వంనుండి నేర్చుకున్నారు. ఈతరం కవిత చివరికి శ్రీశ్రీని కూడా యథాతథంగా తీసుకోడానికీ, అనుకరించడానికీ అంగీకరించదు. అట్లా అంగీకరించక పోవడంమీదే శ్రీశ్రీ ప్రభావం వుంది. ప్రారంభంలో తనమీద పడిన కృష్ణశాస్త్రి, విశ్వనాథల ప్రభావాన్ని వదల్చుకోడానికి ఆనాటి యువకవి శ్రీశ్రీ పడిన తపన నుండి కూడా "నక్సల్బరీ తరం" నేర్చుకుంది.

చిలీలో ఫాసిస్టు జుంటా చేతుల్లో అలెండీ ప్రభుత్వం కిరాతకంగా విలిపివేయబడి వేలాది కమ్యూనిస్టులు వూచకోత కోయబడినప్పుడు "శాంటియాగో"ను సంబోధిస్తూ శివసాగర్ రాసిన కవిత, యింకా యితరుల కవితలు కొన్నిటిలో శ్రీశ్రీ కవితావేశపు ఛాయలు కనిపిస్తాయి.

అయినా, ఈతరం కవితలో శ్రీశ్రీ ఛాయ ఎంతవుంది అని అన్వేషించడం అకాడెమిక్ పని మాత్రమే అవుతుంది. రక్తసిక్త పోరాట పతాకాలెగరేస్తూ త్యాగాల మైలురాళ్లువేస్తూ సాగిన నక్సల్బరీ శ్రీకాకుళం, గోదావరిలోయ పోరాటాల ప్రేరణతో రాయబడిన కవిత్వాలుయివి. నిజాయితీ, నిర్భయత్వం, ఆవేశప్రాణంగా కలిగిన శ్రీశ్రీ కవిత "నక్సల్బరీ తరం" కవితకు శిల్పంరీత్యా, వస్తువురీత్యా వుదహరణగా పని చేయడం, కేవలం సహజంకాని "నక్సల్బరీతరం" కవిత్వం ప్రజల వుపయోగంకోసం శ్రీశ్రీ తొక్కని దార్లు కూడా తొక్కింది. కొన్నిట శ్రీశ్రీని తొక్కించింది.

శ్రీరంగం శ్రీనివాసరావు-శ్రీశ్రీ

## శ్రీశ్రీకి అందగా నక్సల్బరీ తరం

భారతదేశ చరిత్రలో తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటచరిత్ర రక్తాక్షరాలతో రాయబడివుంది. శ్రీశ్రీ కవిత్వంలోమాత్రం దాని ప్రత్యక్ష ఛాయ కనిపించదు. ఈనాడు వర్గపోరాట మార్గాన్ని తిరస్కరించి వర్గసామరస్యం బోధించడానికి 'శాంతి' పాటలు కూస్తున్న కవులు తెలంగాణ పోరాటాన్ని ఆనాడు వేనోళ్ళ శ్లాఘించారు. కుందుర్తిలాంటివాళ్లు మార్క్సిజం పేరుతోనే యూనియన్ సైన్యాల కిరాతకచర్యను ఆకాశానికెత్తారు. సోమసుందర్ వజ్రాయుధం ఝళిపించాడు. ఆరుద్ర "త్వమేవాహ" మన్నాడు, ఎవరికీ అంతుపట్టని అరుపులతోనైనా.

శ్రీశ్రీతో తెలంగాణ పోరాట ప్రభావం గీతాలు రాయించినట్లులేదు. కారణాల అన్వేషణ అప్రస్తుతం, కనుక, వదిలేద్దాం. ఆయన పీడిత ప్రజల పోరాటంనుండి ప్రత్యక్షంగా ప్రుత్తేజం తీసుకున్నది, నక్సల్బరీనుంచే. దీనికి కారణం ఈ యుగంలో విరిసిన "నక్సల్బరీతరం" కవిత ప్రభావమేనని భావించవచ్చు.

'షష్టిపూర్తి 'పేరిట ఆయన చరిత్రను పరిసమాప్తిచేయడానికి నక్షత్ర(క) సప్తకం ప్రయత్నిస్తే యీతరం శ్రీశ్రీని రక్షించుకుంది.

"రచయితలారా! మీరెటువైపు?" అని అరుదూ ఎన్నెస్. ప్రకాశరావు తదితర విశాఖ విద్యార్థులు విసిరిన సవాలు సరిగ్గా యీసమయంలోనే వచ్చింది. ఈ ప్రశ్న తెలుగుసాహిత్యంలో ఒక ప్రకంపనాన్ని సృష్టించింది. తమ కవితావేశంకంటె వేగంగా, వున్నతంగా తోసుకొచ్చిన సాంఘిక ఘటనలు కవుల్ని కాలరుపట్టి నిలదీశాయి.

పందిమీద పన్నీటివాన కురిసినట్లు కొందరు సంఘం విసిరిన యీసవాలును దులి పేసుకున్నారు.

విజాయితీ పరులైవుండి, పూర్వవాసనలు వదలని కొందరు తమలోతాము గింజు కున్నారు. చెప్పొద్దూ, విసుక్కున్నారు.

చాల త్వరగా సర్దుకుని పోరాటంలో కలిసి వచ్చిన కవుల్లో శ్రీశ్రీ ఒకరు.

ఇప్పటి విప్లవరచయితల్లో ఒకముఖ్యుడు పై. కాశీపతికి ఇచ్చిన ఇంటర్వ్యూలో శ్రీశ్రీ "విప్లవం పూచికప్పల్లలతో రాద"ని సాయుధపోరాట ఆవశ్యకతకు కమిట్ అయ్యాడు.

"ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే యువతరం శ్రీకాకుళంవైపు వేలు చూపి"స్తున్న తరుణమది. కాశీపతికిచ్చిన యింటర్వ్యూనుచూసి కొందరు 'స్పీడ్‌బ్రేకర్' విమర్శకులు "సినిమాకవి సికాకోలం పోతాడంట" అని శ్రీశ్రీని హేళనకూడ చేయ బోయారు.

శ్రీకాకుళ పోరాటాన్ని మొదట ప్రస్తావించిన శ్రీశ్రీ కవిత"జట్కావాలా"యే ననుకుంటాను. దయనీయమైన జట్కావాలా జీవితాన్ని కళ్లకు కట్టిన యీకవితలో సిరిసిరిమువ (శ్రీశ్రీ)జట్కావాలాకు శ్రీకాకుళం గురించి చెబుతాడు.

అయితే యీ మధ్యకాలంలో మహాకవి ఏంచేశాడు. తన గొంతు కోసం, తన ప్రజల కోసం ఆయన పడిన వేదనకు ఎప్పుడూ విరామంలేదు.

"న....న....వత్తి మాటలుకూడా
మ.... మ.... మన వాత్రల్లో ఉండొచ్చు" నంటూ రకరకాల ప్రయోగాలు చేస్తూకూడా తనలిమరిక్కుల్లో, ప్రాసక్రీడల్లో సమాజాన్ని, రాజకీయాల్ని వ్యాఖ్యానించాడు.

1966 కంటె ముందే "కుళ్ళిపోతున్న సమాజవృక్షాన్ని సమూలచ్ఛేదం చేయడానికి" "జనంతో నిర్మిస్తున్న స్వర్గం. కలంతో నిర్మిస్తున్న ఖడ్గం" ఒకటి సృష్టించాడు.

"రెండు రెళ్లు నాలుగన్నందుకు
గూండాలు గుండ్రాళ్ల విసిరే సీమలో
క్షేమం అవిభాజ్యం అంటే
జైళ్లు నోళ్లు తెరిచే భూమిలో
అహింస ఒక ఆశయమే కాని
ఆయుధం ఎప్పుడూ కాదు
ఆశయం సాధించాలంటే
ఆయుధం అవసరమేమరి
ఆశయాలు సంఘర్షించేవేళ
ఆయుధం అలీనం కాదు"

అని నక్సల్బరీ పోరాటంకంటె ముందే, ప్రజలు జరుపవలసియున్న వర్గ పోరాటంగురించీ, దాని రూపంగురించీ గొప్పకవిత్వం చెప్పాడు. ప్రజల పక్షాన స్థిరంగా నిలిచాడు. "నక్సల్బరీ తరం" అండగా ఆ తరువాత ప్రజాపోరాటాల్ని ప్రత్యక్ష్యంగా సమర్థిస్తూ ముందుకు వచ్చాడు. ఈ విషయంలో "నక్సల్బరీతరం" మహాకవి మీద ప్రభావం చూపించింది.

తెలంగాణా సాయుధ పోరాట కాలంలో ఆ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొంటూ, తక్షణ ప్రచార కర్తవ్యాలు నెరవేర్చడం కోసం కవులు ప్రజల భాషలో, ప్రజల బాణీలలో పాటలు కట్టారు. కాని, పోరాటం బయట వుండిన కవిత్వైక జీవులు మాత్రం కవిత్వానికి ప్రత్యేకమైన భాషకే పరిమితమయ్యారు. కవిత్వైక జీవుల కవనాలు సహజంగానే పుస్తకరూపంలో మాత్రమే మిగిలితే ప్రజల భాషలో, బాణీలలో రాసిన పాటలు ప్రజల నాలుకల మీద చిరంజీవులైనాయి.

"నక్సల్బరీతరం" కవుల్లో ప్రజల భాషలో, బాణీలో పాటలు రాయటం వుద్యమంలోపలా, బయటా ఒక బలమైన ధోరణి. ఈ ధోరణి "మహాకవి"ని ప్రభావితం చేయకపోలేదు. "ఇప్లవం యాడుందిరా, అడనే నీ కూడుందిరా, గూడుందిరా" అని మహాకవి జనం భాషకోసం చేసిన ప్రయత్నం యీ ప్రభావంతోనే. 'జట్కావాలా' వుండనే వుంది.

నక్సలైట్లుగా ప్రసిద్ధులైన కమ్యూనిస్టు విప్లవకారులపై ఆనాటి హంతక ముఖ్యమంత్రి వెంగళరావు దుర్మార్గాల్ని నిరసిస్తూ మహాకవి రాసిన గీతం పోరాట అగ్రగామి దళంతో గుండె గుండె కలుపుకోడానికి తార్కాణం.

శ్రీశ్రీ కలం నుండి వెలువడి "మహాప్రస్థానం" గీతాలంతగా వ్యాపేసిన గీతం "ఉరికొయ్య". ప్రజలకోసం పనిచేసిన నేరానికి వురిశిక్షలు వేయబడ్డ రైతువీర కామ్రేడ్లు భూమయ్య, కిష్టాగౌడ్లు యీ గీతానికి ప్రేరణకావచ్చు.

వేదన కత్తి వాదరగా ఘనీభవించిన గీతం యిది. ఉరికొయ్యకు వ్రేలాడే ప్రజావీరుడి శరీరాన్ని వూహించుకుని ఒక కవితాత్మ పడిన ఆవేదన, అందులోంచి వుత్పన్నమైన కసి. ఇలాంటి పాట మరొకటి రాలేదనవచ్చు.

నక్సల్బరీ పోరాట యోధుని గురించి అతిశయోక్తి అనిపించేంత స్వభావోక్తితో వీరావేశం పలికించిన పాట "ఊగరా.... ఊగరా సోదరా.... ఉరికొయ్య అందుకొని ఊగరా.... సోదరా.... సోదరా" అంటూ దీర్ఘాంతాలతో కూడిన పల్లవి గొడ్డులోంచి వుబికి వచ్చే వేదనను ధ్వనిస్తుంది.

నక్సల్బరీ పోరాట కాలంలోనే సరిగ్గా జనచైనాలో "సాంస్కృతిక విప్లవం" జరిగింది. రివిజనిజానికి వ్యతిరేకంగా పోరాటంలో నిపుణత్వం, ఎర్రదనం (ఎక్స్పర్టయిజ్, రెడ్‌నెస్) రెండు అంశాల మధ్య కమ్యూనిస్టు కావడం అన్నిటికన్న ముఖ్యమనే వాదం ముందుకు వచ్చింది. రివిజనిస్టు వ్యతిరేక పోరాటంలో యీ ధోరణి సహజం. దాని మంచి, చెడుల గురించి చర్చ యిప్పుడనవసరం కాని యిది, శ్రీశ్రీతో రాయించిన గీతమే వుంది.

"డాక్టర్‌వి కావాలన్నా, యాక్టర్‌వి కావాలన్నా ముందో కమ్యూనిస్టువి కావాలి. నువ్వో కమ్యూనిస్టువి కావాలి." జనతా ప్రజాస్వామిక విప్లవాన్ని సాధించి, సోషలిస్టు నిర్మాణంలో పురోగమిస్తున్న జనచైనా సహజంగానే "నక్సల్బరీతరా"నికి ఆసక్తి కలిగించే అంశం. ఈ తరం కవుల్లో జనచైనా, మావో ఆలోచనా విధానం వస్తువుగా కవిత్వం రాసిన వాళ్లు పెక్కుమంది.

అయితే, శ్రీశ్రీ విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడిగా పనిచేసిన కాలం అతిముఖ్యమైనది. అధ్యక్షుడుగా వుంటానికి ఆయనా, ఆయనను అధ్యక్షుడుగా కలిగి వుంటానికి వి.ర.సం. గర్వించాయి. ఈ కాలంలో ప్రజావ్యతిరేక సంస్కృతిపై ధ్వజమెత్తి ఆంధ్రదేశంలో ఆయన జరిపిన పర్యటనలు, చేసిన ప్రసంగాలు గొప్ప ప్రభావం కలిగించాయి.

కాని అత్యవసర పరిస్థితి కాలంలో, ఫాసిస్టు నిర్బంధం క్రింద ఆయనలోని బలహీనతలు తోసుకువచ్చాయి. శ్రీశ్రీ లోంచి శ్రీరంగం శ్రీనివాసరావు తోసుకొచ్చాడు. ఫాసిస్టు నియంత విజయం కోరే దాకా వెళ్లాడు. ఆ తరువాత "నక్సల్బరీ తరం" శ్రీశ్రీని సరిచేసుకుంది. ఇక్కడే నక్సల్బరీ తరం శ్రీరంగం శ్రీనివాసరావుకు వ్యతిరేకంగా శ్రీశ్రీ జరిపిన పోరాటంలో శ్రీశ్రీక అండగా నిల్చింది. ఆయన తన తప్పిదాన్ని గుర్తించి సరిచేసుకున్నాడు. అనివార్యంగా అధ్యక్ష స్థానం నుండి తప్పుకున్నా వి.ర.సం. తో "నక్సల్బరీ తరం"తో నిలిచాడు.

"నక్సల్బరీ తరం" కవులమైన మేము శ్రీశ్రీ గొప్పతనం నుండి నేర్చుకుంటాము. ఆయన తప్పులనుండి గుణపాఠాలు తీసుకుంటాము. శ్రీశ్రీ మాతో వున్నందుకు గర్విస్తాము; ఆయన పోరాట ప్రజలతో నిలిచేదాకా.

— హనుమంతరెడ్డి

## 2

అందరిలాగే 'భావకవితాంబర వీధుల్లో' సంప్రదాయం అర్థమో ! అనర్థమో ! తెలియక విహరించే 'చీకటి రోజుల్లో' శ్రీశ్రీ పరిచయం నాకు ఓ వెలుగురేక

బతుకులో సంఘర్షణలను చవిచూచేక, చూస్తున్న దానికి, అనుభవిస్తున్నదానికి, రాస్తున్నదానికి పొంతన లేదనిపించింది. ప్రశ్నలు మెదడులో కట్టలైనయ్. అప్పుడు శ్రీశ్రీ కవిత్వం 'మరోప్రపంచ' దర్శనం చేయించింది. ఆ ప్రభావమే క్రమక్రమంగా విప్లవ సాహిత్యోద్యమంతో సంబంధం కలిగించింది.

శ్రీశ్రీ 'శ్రామిక లోకపు సౌభాగ్యానికి' కవిత్వాన్ని కదిలించిన వాడు. ఆకాశ మార్గాన అడావుడిగ వెళిపోతున్న కవిత్వాన్ని భూమార్గం పట్టించి, భూకంపం పుట్టించిన మహాకవిగా, దేశికునిగా నక్సల్బరీ తరం శ్రీశ్రీని గుర్తిస్తుంది. శ్రీశ్రీ చెట్టయితే నక్సల్బరీ తరం రచయితలు కొమ్మలు, రెమ్మలూను. వీటన్నిటికీ వూపిర్లు పోసేది 'ప్రజాపోరాటాల' సూర్యకాంతి.

శ్రీశ్రీ కవిత్వం 'వ్యధార్థ జీవిత యదార్థ దృశ్యం' చూయించింది. దోపిడీ వర్గ సాహిత్యానికి పిడుగు పాటయింది. శ్రీశ్రీ కవిత్వం ఒరవడిలోనే నక్సల్బరీతరం 'కత్తిపాటలు' పాడింది. గెరిల్లా గీతాలు గీసింది. బతుకుపాటలు పాడుతూవుంది. ఈ తరంలో శ్రీశ్రీని వెదుక్కోవటం అంతసులువైన పనేంకాదు. నక్సల్బరీతరం శ్రీశ్రీ విరివి. శ్రీశ్రీ వారసత్వాన్ని కాపాడు కుంటూ ఈ తరం నక్సల్బరీతరం కమిట్ మెంట్‌తో ముందుకు పోతూవుంది, పోవాలి.

— హిమజ్వాల

## 'మహాప్రస్థానం' శ్రీశ్రీ

(1979 సెప్టెంబర్ 30న విరసం మహాసభలు జరుగుతున్న సందర్భంలో తిరుపతిలో 'సంఘర్షణ' (అనంతపురం) పత్రిక కోసం శ్రీశ్రీ కాశీపతి కిచ్చిన ఇంటర్వ్యూలోని కొన్ని భాగాలు. ఈ ప్రశ్నలన్నీ శ్రీశ్రీ వామపక్షం వైపు ఎట్లా ఆకర్షింపబడ్డాడు, 'మహాప్రస్థానం' గీతాలకు ప్రేరణ, అనాటి సాహిత్యోద్యమానికి సంబంధించినవే.)

ప్రశ్న : 1928 లో 'ప్రభవ' రాసే నాటి మీ మానసిక, కళాత్మక పరిస్థితి ఏమిటి ?

శ్రీశ్రీ : నా 18వ యేట నేను "ప్రభవ" రాశాను. ఆరోజుల్లోనాకు నాచుట్టూ ఒక సమాజ ముందన్న స్పృహ కూడాలేదు. నేను, నా బూర్జువా Surroundings మాత్రమే నాకు కనుపించాయి. అయినా మానసికంగా Art for Art sake (కళ కోసమే కళ) వ్యక్తిని. అప్పటికి మాకు ఆస్తి పాస్తులుండేవి. బాధ్యత లేవీ వుండేవి కావు. అందుకే సమాజాన్ని పట్టించుకొనే అవసరం లేకపోయింది.

ప్రశ్న : 'మహాప్రస్థానం' మొదలైన అప్పటి మీ గీతాలకు నేపథ్యం గురించి అంటే ఈ రకమైన స్పృహ మీలో కలుగడానికి కారణమైన పరిస్థితుల గురించి వివరిస్తారా ?

శ్రీశ్రీ : నేను 1928లో కాలేజీ చదువులకోసం విశాఖపట్నం నుండి మద్రాసు వెళ్లాను. మా ఆర్థిక పరిస్థితులు దిగజారడంకూడా అప్పటి నుండే ప్రారంభమైంది. ప్రపంచ మంతటా ఆకలిదప్పుల హాహాకారాలు వినిపిస్తున్నాయి. 1930 దశాబ్దాన్ని ఆకలి దశాబ్దం (Hungry Thirties) అంటారు. ఈ అన్నిటి ప్రభావ ఫలితంగానే 'మహాప్రస్థాన' గేయాలు వచ్చాయి, అంటే కుటుంబ ఆర్థిక పరిస్థితి, హంగ్రీథర్టీస్, నాకు అప్పుడు చదువుకోడానికి లభ్యమైన సాహిత్యం, నిరుద్యోగ పట్టభద్రుడిగా వున్న చోట వుండకుండా తిరిగిన తిరుగుడు, నాలో సామాజిక స్పృహ కలిగించాయి.

ప్రశ్న : సుఖమైన జీవితం నుండి కష్టాల ప్రాంగణంలోకి అడుగు పెట్టినప్పుడు మీరెలా ఫీలయ్యారు ?

శ్రీశ్రీ : నేనెప్పుడూ Optimist (ఆశావాది) నే. అందుకే బూర్జువా శ్రీశ్రీ నుండి రెబెల్ శ్రీశ్రీ తయారయ్యాడు.

ప్రశ్న : ఈ దశలో మిమ్మల్ని అత్యంత ప్రభావితం చేసిన పుస్తకం, రచయిత ఎవరో చెప్పగలరా ?

శ్రీశ్రీ : ప్రిన్స్ క్రొపోట్కిన్ (రష్యన్ అనార్కిస్టు రచయిత) రాసిన 'An appeal to Youth' (యువకులకు విజ్ఞప్తి) అనే వ్యాసం నా దృక్పథాన్ని పూర్తిగా మార్చివేసింది.

ప్రశ్న : అప్పటికి మీపై మార్క్సిజం ప్రభావంగానీ, అక్టోబర్ విప్లవ ప్రభావంగానీ ఏమైనా వుందా ?

శ్రీశ్రీ : ప్రత్యక్షంగా వాటి ప్రభావం లేదుగానీ, నేను అప్పుడు చదివిన సాహిత్యం — నా కుటుంబ పరిస్థితి (ముఖ్యంగా స్పెయిన్‌లో అంతర్యుద్ధం) — ఇవి నన్ను వామపక్ష దృక్పథం వేపు లాక్కుపోయాయి.

ప్రశ్న : మీ 'ప్రతిజ్ఞ' గేయానికి ప్రేరణేమిటి ?

శ్రీశ్రీ : ఇంగ్లండులో మన భారతీయ విద్యార్థులు స్థాపించిన అభ్యుదయ రచయితల సంఘం (Progressive Writers' Association) వారి అరశావు మేనిఫెస్టో ఇండియాలోకి స్మగుల్ అయ్యింది. దాని కాపీ (ప్రతి) ఒకటి నాకు అబ్బూరి రామకృష్ణారావుగారు యిచ్చారు. అది చదవగానే 'ప్రతిజ్ఞ' (పొలాలనన్నీ హలాల దున్ని....) అనే గేయం రాశాను. ఆ తరువాత ఆ గేయం చదివి అబ్బూరి రామకృష్ణారావుగారికి వినిపించాను. గేయం విని మొత్తం మేనిఫెస్టో సారాంశమంతా నీ గేయంలో దించావని ఆయన నన్ను అభినందించారు. అదే రోజుల్లో ముద్దుకృష్ణ 'జ్వాల' పత్రిక వచ్చేది. 'జ్వాల' పత్రికలో ముద్దుకృష్ణ రాసిన ఒక ఎడిటోరియల్ ప్రేరణతో 'దేశ చరిత్రలు' గేయం రాశాను.

ప్రశ్న : మీ 'మహాప్రస్థాన' రచనాకాలంలో వున్న సాహిత్యోద్యమం గురించి మీ అభిప్రాయ మేమిటి ?

శ్రీశ్రీ : నవ్యసాహిత్య పరిషత్తుదే ఆ రోజుల్లో పైచేయి. సాహితీ సమితి సభ్యులే అందులోనూ ప్రముఖులు. అక్టోబరు విప్లవం జరిగినా, ప్రపంచలో ఫాసిస్టు పిశాచి విలయతాండవం చేస్తున్నా పీడిత జనం ప్రపంచ వ్యాప్తంగా ఆకలితో అలమటిస్తున్నా, ఆంధ్రదేశంలో మాత్రం భావ కవిత్వానిదే పైచేయిగా వుండేది. ఆంధ్రదేశంలో రచయితలకు ప్రధానంగా స్వాతిశయభావం, అసమగ్రమైన జాతీయ

దృక్పథమే తప్ప అంతర్జాతీయ దృక్పథం లేదు. కాంగ్రెస్ ఉద్యమాలే స్వరాజ్యం తెస్తాయని రచయితలు భావించేవారు. చాలా మంది రచయితలకు యే ఉన్నవ లక్ష్మీనారాయణ లాంటి వారికో తప్ప అక్టోబర్ విప్లవం జరిగిందనే విషయమే తెలీదు. దీనికి ప్రధానం కారణం బ్రిటిష్ సెన్సార్‌షిప్.

ప్రశ్న : మీ కవిత్వంలో శైలి, భాష, వస్తువులో ఒక నూతనత్వం వుంది. ఆ రోజుల్లో నవ్యసాహితీ పరిషత్. సాహితీ సమితి మీ కవిత్వం పై ఎట్లా react (రియాక్ట్) అయ్యేవి ?

శ్రీశ్రీ : వాటిల్లోనూ రైటిస్ట్స్ - లెఫ్టిస్ట్స్ వుండేవారు. తల్లావఝుల శివశంకరశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి లాంటి వారు మితవాదులైతే చింతా దీక్షితులు వంటి వారు అతివాదులు. గురజాడ అప్పారావుగారు కవిత్వం కూడ వ్యవహారిక భాషలోనే రాయాలనీ అదే యీనాటి సరియైన మార్గమనీ సూచించిన మలుపుని నేను వెడల్పు చేశాను. నవ్యసాహిత్య పరిషత్తు వేదికలపై నా గేయాలు చదువుతూ వుండేవాడిని. ప్రజల నుండీ మంచి రెస్పాన్స్ (Response) వచ్చేది, పండితులు తల లూపేరు.

నవ్యసాహిత్య పరిషత్ వదలిపోయి అభ్యుదయ రచయితల సంఘం భారత దేశంలో ఆ రోజుల్లోనే ఏర్పడింది. నా 'మహాప్రస్థాన' గేయాలవంటి శక్తివంతమైన కవితలు భారతదేశంలో 1930-40 మధ్య మరే కవీ రాయలేదు. అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణంలో తొలుత నా ప్రత్యక్ష పాత్ర లేకపోయినా అంతకు ముందే నేను రాసిన గేయాల ద్వారా అభ్యుదయ సాహిత్యోద్యమానికి శ్రీకారం చుట్టింది నేనే. అదే సమయంలో వల్లతోల్‌గానీ, సుబ్రమణ్య భారతిగానీ, రవీంద్రనాథ టాగూర్‌గానీ సోషలిస్టు విప్లవం గురించి కాక జాతీయ దృక్పథంతోనే కేవలం బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక సాహిత్యాన్నే సృష్టించారు. దీన్ని అంతర్జాతీయ స్థాయికి తీసికెళ్ళింది నా 'మహాప్రస్థాన' గీతాలు.

ప్రశ్న : బ్రిటిష్ ప్రభుత్వం మీ రచనలపై - మీపై దాడిచేయలేదా ?

శ్రీశ్రీ : బ్రిటిష్ ప్రభుత్వం 'మా కొద్దీ తెల్లదొరతనం' లాంటి గేయాలను నిషేధించింది - కానీ నా 'మహాప్రస్థాన' గేయాలపై అది దాడి జరపలేదు. కారణం- ఆ రోజుల్లోనే నా 'మహాప్రస్థాన' గీతాలు గ్రంథంగా వెలువడకపోవడం కావచ్చు. సాహిత్యం మీద దాడి చేయడంలో నేటి మన ప్రభుత్వం కంటే బ్రిటిష్ వాడే నయం.

# 'మరోప్రస్థానం' శ్రీశ్రీ

(1979 నవంబర్ 25న తెనాలి 'చైతన్యవేదిక' నిర్వహించిన శ్రీశ్రీతో 'ఇష్టాగోష్టి'లో 'సృజన' కోసం జుగాష్విలీ, పసుపులేటి వెంకటరమణ, పి.జె. వర్ధనరావు ఇంటర్వ్యూ చేసారు. ఇందులో విరసం మొదలుకొని, విప్లవ పాట అవసరం దాకా శ్రీశ్రీ తన అభిప్రాయాలు చెప్పాడు.)

ప్రశ్న : శ్రీశ్రీ మహాకవి అయితే కావచ్చుకానీ ప్రజాకవి కాదని కొందరు విప్లవకారుల అభిప్రాయం. మీ వ్యాఖ్య ?

శ్రీశ్రీ : ఏకీభవిస్తున్నాను. నేను అక్షరాస్యుల కవిని. చదువురాని వారి కవిని కాను. ప్రజాకవికాని వాడు మహాకవి కూడ కాలేడు. కవిత్వం వల్ల విప్లవం వస్తుందని నేననుకోను. రాజకీయ విప్లవానిక ముందు ఆలోచనా విప్లవం రావాలి. దానికి నా కవిత కొంత మెట్లు వేసిందని అనుకొంటున్నాను. విప్లవానికి ఆహ్వానమిచ్చే కవిత నాది.

ప్రశ్న : విరసం గత దశాబ్ద కాలంలో సాధించిన ప్రయోజనాలేమిటి ?

శ్రీశ్రీ : 1970 నా షష్టిపూర్తి. విరసం ఆవిర్భావం జరిగాయి. ఇది కల్లోలిత దశాబ్దం. అందుకే నేను Burning Decade (దందహ్యమాన దశాబ్దం) అంటున్నాను. విప్లవం అనుకొన్నప్పుడల్లా రాదు. వస్తే ఎవరూ ఆపలేరు. విరసం ఏర్పడటమే ఒక సాధింపు. సాధించవలసింది చాలా వుంది. విరసం నిర్మాణంతో సాహిత్య స్వరూపమే మారింది. సంస్కృతులు రెండు. బూర్జువా సంస్కృతి శవ సంస్కృతి. కష్టజీవుల సంస్కృతి సజీవ సంస్కృతి. అది ఈనాటిది కాదు. పెద్దన, శ్రీనాథుడు వాళ్ళ కాలంలో వారి కవిత్వం వారు రాసుకొంటున్నా పొలంలో కర్షకులు, పనిచేసే స్త్రీలు వారి పాటలు వాళ్ళు పాడుకొంటూనే వున్నారు : అదే జానపద సాహిత్యం. బూర్జువా సంస్కృతిని నిరాకరించే సజీవ సంస్కృతికి పట్టాభిషేకం చేయడమే ఒక ఘనవిజయం.

ప్రశ్న : అభ్యుదయ కవిత్వానికి విప్లవ కవిత్వానికి తేడా ఏమిటి ?

శ్రీశ్రీ : అభ్యుదయ కవిత్వం భారత కమ్యూనిస్టుపార్టీ కవిత్వం. విప్లవ కవిత్వం భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) కవిత్వం. ప్రజల్లో భావ విప్లవం రావాలి. విప్లవకవులు దానికి గ్రౌండ్ ప్రిపేర్ చేస్తున్నారు.

ప్రశ్న : సమాజంలోని అట్టడుగు వర్గాలను దృష్టిలో పెట్టుకొని వచ్చిన విప్లవ సాహిత్యం వారి దగ్గరకు వెళ్తుందా ?

శ్రీశ్రీ : నేను ప్రజాకవిని కాను. నా కవిత్వం 70 శాతం ప్రజల దగ్గరకు వెళ్ళడం లేదు. విప్లవ కవిత్వం వారి దగ్గరకు వెళ్ళిందా అంటే అనుమానమే. వారి దగ్గరకు వెళ్ళాలంటే జానపద కళా రూపాలలో గద్దర్, వంగపండు ప్రసాదరావు లాగా రాయాలి. శ్రామిక సంస్కృతి సజీవ సంస్కృతి.

ప్రశ్న : నిబద్ధత, నిమగ్నతల గురించి చెప్పండి ?

శ్రీశ్రీ : నిమగ్నత చాల గొప్పది. అందుకే సుబ్బారావు పాణిగ్రాహి మాకు ఆద్యుడు. నక్సల్‌బరి పోరాటం ఇరవై సంవత్సరాల క్రితం వచ్చివుంటే నేనూ నిమగ్నుడినై వుండే వాడి నేమో. కానీ యిప్పుడు ముసలివాడినై పోవడంవల్ల తుపాకీ పట్టుకోలేక కలంతోనే పోరాడుతున్నాను.

ప్రశ్న : సినిమాల ద్వారా ఈ సమాజాన్ని బాగుచేసే అవకాశమేమయినా వుందా ?

శ్రీశ్రీ : ప్రజల్ని నమ్ముకోవాలన్నాడు మావో. సినిమాల ద్వారా కూడా ప్రజల్లో మంచి మార్పు తీసుకురావచ్చు. కానీ ఈ సెన్సార్ షిప్ పోవాలి. పెట్టుబడి దారీ వ్యవస్థ యొక్క ముఖ్య లక్షణమైన లాభం అనేది పోవాలి. లాభాల కోసం హింస, సెక్స్ చూపిస్తే పాలక వర్గాలకు అభ్యంతరం లేదు. పాలక వర్గాలను కూల ద్రోయాలంటే మాత్రం వూరుకోవు. సినిమా కొన్ని లక్షల ఖర్చుతో తయారయ్యేది. లక్షలు ఖర్చుపెట్టినవాడు మరిన్ని లక్షలు సంపాదించాలను కొంటాడు. ఇదొక Visious Circle. ఈ సర్కిల్‌లో విప్లవ చిత్రాలు రావాలంటే ఫిలిం సొసైటీలు పూనుకోవాలి.

ప్రశ్న : ప్రేమ, నేటి వివాహ వ్యవస్థలపై మీ అభిప్రాయం ?

శ్రీశ్రీ : ప్రేమ first Casulation. పెళ్ళి గురించి ఒక జోక్ జ్ఞాపకం వస్తుంది. 'Punch' Weekly కొత్తగా పెళ్ళాడదల్చుకొన్న వారికి 'Don't' అని సలహా యిచ్చింది. నేనలా చెప్పదలచుకోలేదు. నేటి మన ప్రేమ, వివాహం ధనస్వామ్య వ్యవస్థ మీద ఆధారపడివున్నాయి. ప్రేమ నిజమైనదైతే మృత్యువు కూడా దడుస్తుంది.

ప్రశ్న : ఎంతో మంది కవులుండగా తిక్కన- వేమన- గురజాడలే కవిత్రయ మని మీరు చెప్పడానికి కారణమేమిటి ?

శ్రీశ్రీ : నాదృష్టిలో తిక్కన - వేమన - గురజాడలే కవిత్రయం. ఎందు కంటే వీళ్ళు ప్రజల్ని ఉద్దేశించి ప్రజల కోసం కవిత్వం వ్రాసిన వాళ్ళు. వీరు కాక

నాలో భావ చైతన్యాన్ని ఉద్దీపింపజేసిన వాళ్ళు మార్క్స్, లెనిన్, మావో. భారత ప్రజలు ఇంకా 16, 17 శతాబ్దాలలోనే వుంటున్నారు. వాళ్ళను 20వ శతాబ్దంలోకి నెట్టడానికే ఈ శతాబ్దాన్ని నాది అంటున్నాను. 1930 దాకా వచ్చిన కవిత్వం చతుష్పాదం. కానీ 1930 నుండి వాడుక భాషలో వ్రాయడం మొదలైంది. కాని యిప్పుడు వ్రాయవలసింది పాఠకజనం యొక్క భాషలో. రచయితలు పాఠకజనం యొక్క భాషను స్వీకరించాలి.

"విప్లవం యాడుందిరా
అడ నీ కూడుందిరా"

ప్రశ్న : చెలానికీ మీకూ భావైక్యత వున్నదా ?

శ్రీశ్రీ : విప్లవవాదిగా ఆ కాలంలో చలం రచనల వల్ల ప్రభావితుణ్ణైనాను. నాకు ఉపకరించాయి. పూర్తిగా భావైక్యత లేకపోయినా ఆయన రచనలు సాహిత్యంలో మార్పు తీసుకురావడానికి ఉపయోగపడ్డాయి. అదే మా భావైక్యత.

ప్రశ్న : చలం సాహిత్యం ఏ మాత్రమూ పనికిరాదని కొందరు మార్క్సిస్టుల వాదం - సరైనదా ?

శ్రీశ్రీ : ఏ మాత్రమూ పనికి రాదన్న మాట మార్క్సిస్టులు అన్నా అది తప్పే అవుతుంది. చలం మార్క్సిజం చదువుకోలేదు. గురజాడ కూడా మార్క్సిజం చదువుకోలేదు. 'కన్యాశుల్కం' సమాజ రుగ్మతలకు మందు. ఏ మాత్రమూ ఉపయోగపడలేదని అనలేము. అలాగే చలం ఆలోచనలు మార్పు తెచ్చాయి.

ప్రశ్న : ఆలోచనలరీత్యా చలం, ప్రవర్తనరీత్యా శ్రీశ్రీ వివాదాస్పదమైన వ్యక్తులని ఒక అభిప్రాయం - మీ సమాధానం ?

శ్రీశ్రీ : ఏకీభవించడానికి అభ్యంతరం లేదు. నేను అందరికీ నచ్చకపోవచ్చు.

ప్రశ్న : శేషేంద్రశర్మ 'కవిసేన' అభ్యుదయ శక్తులకు ఉపయోగపడేదేనా ?

శ్రీశ్రీ : విశాఖపట్టణంలో కవిసేనశాఖ Poster కవితలు, శేషేంద్రశర్మ కవిసేన కవితలు చూసాను. భావ కవిత్వం మళ్ళీ మొలకెత్తుతుందేమోననిపిస్తుంది. ఎందుకనో వారిలో భావకవితాచ్ఛాయలు యింకాపోలేదు. సమాజాన్ని వెనక్కినడుపుతుంది- కవిసేన. అభివృద్ధి నిరోధకమైనదే.

ప్రశ్న : ప్రయోగ వాదం పేర నగ్నముని సాగిస్తున్న 'విలోమ' రచనల మీద మీ అభిప్రాయం ?

శ్రీశ్రీ : ఆ రచనలేవీ నేను చదవలేదు. కనుక సమాధానం దాటవేస్తున్నాను.

ప్రశ్న : మీరు రష్యా చైనా దేశాల రెండిటా పర్యటించారు కదా ! రెండు వ్యవస్థల పనితీరులో మీకు తేడా తోచిందా ? ఆ తేడా ఏమిటి ?

శ్రీశ్రీ : కడుపునిండిన బేరం రష్యా - కడుపుమండిన బేరం చైనా. 54లో ఒకసారి, 67లో ఒకసారి రష్యా వెళ్ళాను. 54లో వెళ్ళినపుడు లెనిన్ సమాధి పక్కనే స్టాలిన్ సమాధి వుంది. మిలటరీ దుస్తుల్లో నిద్రపోతున్నట్టే వుండటం నేను చూసాను. రివిజనిస్టు కృశ్చేవ్ ఆ తరువాత దానిని అక్కడ నుండి తీసివేసాడు. రెండు శతాబ్దాలలో అమెరికా సాధించినది రష్యా 50 ఏళ్ళలో సాధించింది. రోదసీ విజయం, మాస్కో అండర్ గ్రౌండ్ ప్లానింగ్ ఇదంతా అభివృద్ధే. ఇవాళ రష్యా తన పొరుగున వున్న దేశాలన్నిటిని తనకు సామంత రాజ్యాలుగా చేసుకొంటూంది. అందుకే మావో దాన్ని సోషల్ ఇంపీరియలిజం అన్నాడు. నేను చైనాలో 21 రోజులు వున్నాను. డెలిగేటుగా వెళ్ళడం వల్ల వాళ్ళు చూపించింది చూసాను. చైనాలో మంచి డిసిప్లిన్ కనిపించింది. ఒక విద్యార్థిని నీ జీవితం ఎందుకు అని అడిగితే "నా పొరుగు వాడికి తోడ్పడం కోసం, నా దేశాన్ని రక్షించడం కోసం, కమ్యూనిజాన్ని ప్రపంచ వ్యాప్తం చేయడం కోసం" అని చెప్పాడు. "నేను విశాఖ పట్టణంలో పుట్టాను. అనగానే మ్యాప్‌లో విశాఖ పట్టణాన్ని గుర్తుపట్టాడు. విశాల దృక్పథం చిన్నప్పట్నించీ, అగ్గిపుల్ల దగ్గర నుంచి అణుబాంబు దాకా ఏ దేశం మీద ఆధారపడకుండా చేసుకొంటున్నారు. పరస్పర ఆరోపణల జోలికి పోదల్చుకోలేదు.

ప్రశ్న : ఈ యుగకవిగా మీరు యువతరం రచయితలకు యిచ్చే సందేశం ?

శ్రీశ్రీ : సందేశాలనిచ్చే అలవాటులేదు. మీనుండి నేర్చుకోవడమే నా సందేశం. యువతరం విప్లవాల వేడి చల్లారకుండా జాగ్రత్త పడమని ప్రార్థిస్తున్నాను.

---

విరసం ఏడవ మహాసభల సందర్భంగా 'నేటి కవిత్వం'పై జరిగిన చర్చా గోష్టిలో మహాకవి శ్రీశ్రీ ప్రసంగిస్తూ "ఈ చర్చలో unscheduled గా ప్రవేశించాను. శ్రీశ్రీ లేకుండా నేటి కవిత్వమేమిటి ?"

"....కవిత్వం కూడ గాలి, నీరు, నేల లాగే నిత్యోపయోగ వస్తువు కావాలి."

"ఈనాటి కవిత్వం శ్రామికవర్గ సంస్కృతిలో భాగం కావాలి. ప్రజలను చైతన్యప్రదీప్తం చేసేదిగా వుండాలి. నిజమైన ప్రజా సంస్కృతిక నివాళి పట్టాలి" అన్నారు.

---

# శ్రీశ్రీ 'అనంతం' - పరిశీలన

కె.వి. రమణారెడ్డి

ఎవరైనా పుస్తకం రాసేముందు మనస్సులోనైనప్పటికీ ఏదో ఒక ప్రణాళిక లాంటిది వుంటుంది. 'బ్లూప్రింట్'లా అది కాగితమ్మీది కెక్కితే మంచిదే- అలా కానప్పుడు. వీలులేనప్పుడు రాయదలుచుకుందొకటీ రాసేదొకటీ అయికూచుంటుంది. అందువల్ల, రాసేవాడి కేమోగాని చదివేవాడికి అగమ్యగోచరమే. శ్రీశ్రీ 'అనంతం' దీనికి దాఖలా.

వచనశైలి విషయంలో శ్రీశ్రీ రచన స్పష్టతకూ పటిష్టతకూ ఉత్తమ లక్ష్యమే అయికూడా, వస్తుగాంభీర్యమో జటిలత్వమో భారమో లేకుండానే ఎందుకిలా శాఖాచంక్రమణంగా రూపొందినట్టు? "అర్థాన్ని అధ్వాన్నపుటడవిలో" వదిలేసెయ్యడం యిప్పుడు తన లక్ష్యంకాదే!

ఇక్కడే ఉంది కిటుకుల్లో ఒకటి. దీన్ని తాను తలపెట్టి మొదలెట్టింది, "అర్థాన్ని అధ్వాన్నపుటడవిలో" వదలెయ్యాలనుకున్న అధివాస్తవిక దశలోనే. ఆ లక్ష్యశుద్ధి సవ్యమయ్యాక, మొదట 'ఆనందవాణి'లో ఒకమారు, తర్వాత 'ప్రజాతంత్ర' సంచికల్లో, తాజాగా 'స్వాతి' సంచికల్లో పునః ప్రారంభమంటూ ప్రకటించసాగాక, అంటే- యిప్పుడు కూడా- 'అనంతం' దారీ తెన్నూ లేకుండా సాగుతున్నదే మరి! మరో కారణం ఏమైవుంటుంది చెప్మా? Pot Boiler అంటారే, ఆ యింగ్లీషు మాటకు యీ రచన శ్రీశ్రీ యిస్తున్న సాక్ష్యం. అంటే, వెనకటిరోజుల్లో డాస్టోయ్‌వెస్కీ వంటి రచయితలక్కూడా పూట గడవడం కష్టమైనప్పుడు, ఏదో పత్రికకు తమ రచనలను అచ్చుకిస్తామని మాటిచ్చి ఎప్పటి కప్పుడు రాసిపడేస్తూ, అడ్వాన్సుగా చేజిక్కిన మొత్తాన్ని ఖర్చుచేసుకునే వాళ్ళు. శ్రీశ్రీ తిండి సమస్యనో చిరుదిండి సమస్యనో యీ రచనొక్కటే తీర్చగలుగుతున్నదని కాదు. 'మహాప్రస్థానం' విశాలాంధ్ర ప్రచురణాలయానికీ సినీపాటలు మరొక ప్రచురణకర్తకీ 'కృష్ణార్పణమస్తు' కావటానికి ఇదీ ఒక కారణం కాకుండా పోలేదు.

ఇంతకంటె ముఖ్యమైన విషయం శ్రీశ్రీది అ-సాంప్రదాయకమైన బుద్ధి. శ్రీశ్రీ బుద్ధికి యింకా నిలకడా పక్వతా కలగలేదు. తాను 'సహజ మానవుడి'లా శిశుప్రకృతితో చపలంగా చంచలంగా జీవించే వ్యక్తి. పూర్తిగా వ్యక్తి విషయమైతే దీన్ని పట్టించుకోక పోవడమే మర్యాద. "పబ్లిగ్గా వస్తేనే ఏమైనా అంటాం" అని కాస్త 'ప్రైవెసీ' (Privacy) ని ఇతరుల కిచ్చినట్లే తనకు తానూ ఇచ్చుకున్నాడు గనక, రచన అనేది పుట్టుకలో వైయక్తికమైన విషయమే ననిపించినా అచ్చుకెక్కి రచ్చకెక్కాక,

పైగా ఒకలాంటి వర్తకసరుకు (Conmodity) గా మారాక, అది 'పబ్లిక్' అయిపోక తప్పదు. అప్పుడు పాఠకులూ విమర్శకులూ దాన్ని పఠిస్తారు, పరిశీలిస్తారు, గుణ నిర్ణయం చేస్తారు.

అసలు విషయానికొస్తే, 'అనంతం' శ్రీశ్రీ జీవితచరిత్ర అనిపిస్తుందేగాని జీవిత చరిత్రను మించిన రచన. అందువల్లనే దాని క్లిష్టతా, పూర్వాపరాల అసంబద్ధత అనిపించే శాఖాచంక్రమణమూ, 'సంవిధాన' రాహిత్యమూ, పాదపీఠికలతో అర్థవివరణలతో రిఫరెన్సులతో 'ఎకాడమిక్' (Academic) రచనాపద్ధతి తనకు సరి పడదని యిప్పుడంటూవున్న శ్రీశ్రీ, 'ఉదయిని' రోజుల్లో గురజాడ 'ముత్యాలసరాల' ఛందస్సుగురించి రాసినప్పుడు- నలబయ్యేళ్ళ కిందటిమాట- ఎంతో జాగ్రత్త చూపాడు. 'అనంతం' విషయంలో మాత్రం అంతా అజాగర్తే. జ్ఞాపకశక్తిని నమ్ముకున్నా ఫరవాలేదు, టాల్‌స్టాయి, చెహోవ్, ఆండ్రీయేవ్‌ల గురించి గోర్కీ 'స్మృతులు' (రిమినిసెన్సెస్) వంటి ఉత్తమశ్రేణి రచనైనా రూపొందేది. శిష్ట్లా ఉమామహేశ్వర రావు విషయంలో తప్ప, 'అనంతం'లో మరో సాహిత్యజీవి గురించి శ్రీశ్రీ జ్ఞాపకశక్తి బిటువుగా పనిచేసినట్లనిపించదు. కృ శా. కి కాస్త జాగావుంది, విశ్వనాథకు లాగే. కాకుంటే, కంఠస్థం చేసిన తెలుగు, యింగ్లీషు కవితలో వచనం తుంటలో, ఫ్రెంచి, స్పానిష్ రచనాశకలాలో కొన్ని కనిపిస్తాయి. శ్రీశ్రీ సొంత జీవితవిశేషాలను అక్షరాల కెక్కించి, అందులో ఎంత నేర్పుచూపితే అంత మెప్పు పొంది వుండేవాడు. ఉదా హరణకు, సార్త్ (Sortre) Words ఉంది. అతని బాల్యం ఎన్నెన్ని కోణాలనుంచో మరెన్ని మలుపులనుంచో కళ్ళకు గట్టుతుంది. సాదాగా రాస్తున్నట్టనిపించినా టాల్స్టాయి అసలు పేర్లు మార్చి అద్భుతంగా తన బాల్య యౌవనాల గురించి రాశాడు. గోర్కీ విషయం చెప్పనే అక్కర్లేదు. మరి శ్రీశ్రీ ఎందుకిలా.... ?

అప్పుడూ, మరి యిప్పుడూ, తనమానాన తానుంటే, తన దారిన తనవి పోనిస్తే, శ్రీశ్రీ సహజాతాలు అరాజకంవైపు – అరాజ్యవాదం (Anarchism) వైపుక్కూడు- నడుపుకుపోతాయి. 'భావ' కవిత్వపరిధి నుంచి బయటపడే క్రమంలో శ్రీశ్రీ పూర్తిగా క్రమానికే తన భావాన్ని అర్పించాడనుకోవడం వాస్తవంకాదు. బిత్తిరి మధు సూదనరావు సూచన ప్రాయంగా చూపినట్లు. శ్రీశ్రీ 'కవితా ! ఓ కవితా !'లో ఆంద్రే బ్రెతో (Andre' Breto) ముద్రపడిన చరణాలు కొన్నైనా కనిపిస్తాయి. ఆ అరాచకం నుంచి రచయితగా శ్రీశ్రీని తప్పించింది, లోకానుభవంతోబాటు స్వీయాను భవం నుంచి కూడా 'ప్రపంచబాధ' పట్ల, 'విప్లవ' సిద్ధాంతం పట్ల ఆయన కేర్పడిన

అభిమానమే. నేటికీయిది అవగాహన స్థాయికి ఎదగలేదనడం అబద్ధంకాదు. నాటి కమ్యూనిస్టు ఉద్యమం శ్రీశ్రీ ప్రశస్తికి తోడ్పడినట్టే, శ్రీశ్రీ 'విప్లవ' కవిత ఆ ఉద్యమానికి తోడ్పడింది. అయితే తొలిరోజుల్లో క్రోపోట్కిన్ రచన 'యువకులకు ఉద్బోధం' (An Appealtothe youth) తనని బలంగా ఆకర్షించింది. 'రష్యా! ఓ రష్యా!' గేయంలో లెనిన్, స్టాలిన్‌ల సరసనే బకునిన్, క్రోపోట్కిన్ లుండటం గమనించదగింది. చెప్పొచ్చిందేమంటే, అరాజకవాదం మాటేమోగాని, 'బొహిమియనిజం' అనిపించుకున్న వ్యక్తి జీవిత అరాచకం శ్రీశ్రీకి ట్రేడ్‌మార్కు అయింది.

అభ్యంతరకరాలైన ఎన్నో ఇతర అంశాల నటుంచి, 'అనంతం'లో శ్రీశ్రీ అపరిణత రాజకీయావగాహన అక్కడక్కడా మెడ నిక్కుస్తుంది, తాను అధ్యక్షుడుగా ఉండిన విరసం, పౌరహక్కుల సంఘం, భారత - చైనా మిత్రమండలి సంస్థలకు చెందిన సహచరులు 'మీసా'పాలై జైలు నిర్బంధంలో వుండినప్పుడు, శ్రీశ్రీ ప్రవర్తన ఎలాగుండినా, రచన కూడా నియంతృత్వానికి వెల్లవేసేందుకు పనికిరావడం, శ్రీశ్రీ జీవితంలో అపూర్వంకాదు. ఇందిరాగాంధీ ఇంద్రజాలానికి తానూ లోనయ్యానని, ఎమర్జెన్సీపాలన "వామపక్ష నియంతృత్వం" అనుకున్నానని విరసం అధ్యక్ష పదవిని వదులుకునే సందర్భంలో తానిచ్చిన సంజాయిషీ, తత్కాలానికి ఎందరినో సంతృప్తిపరచి వుండవచ్చు కాని, 'అనంతం'లో తాను అటు తర్వాత రాసేప్పుడు "క్షుద్ర" రాజకీయాలకు విరసం దూరంగా వుండాలన్నాడు. ప్రజా పోరాట రాజకీయాలను అర్థంచేసుకుని, వాటి ఉదాత్తతను గమనించి, అధికార రాజకీయానికి "క్షుద్ర" విశేషణం తగిలించడం కాదిది. విశాఖపట్నంలో తనతో పురిపండాతో కలిసి 'కవితా సమితి'ని స్థాపించిన వడ్డాది సీతారామాంజనేయులు ("దండాలు దండాలు భారతమాతా" గేయకర్త) జైలుకెళ్ళి, సత్యాగ్రహోద్యమంలో తనకూ తెన్నేటి విశ్వనాథం తమ్ముని సలహా మేరకు ఆ మహదవకాశం వచ్చినప్పుడు, శ్రీశ్రీ వేసింది-వెనకడుగే. ప్రపంచ తెలుగు మహాసభల బాయ్‌కాట్ సందర్భంగా బొలారం పోలీసు స్టేషన్‌లో ఒక రాత్రి శ్రీశ్రీ 'పౌర' జీవితంలో ఆయనకు స్మరణీయమైన ఘటన. విరసం ఏర్పడ్డాకనే నిజంగా శ్రీశ్రీ 'పౌర' జీవితం మారాకు తొడిగింది. పౌర హక్కుల పోరాటానికి మొగేదారయ్యాడు. నిబద్ధత అక్షర లోకాన్ని దాటి క్రియా లోకానికి దిగివచ్చి, తన వ్యక్తిత్వాన్ని పైకెత్తింది. ఎమర్జన్సీ ప్రవర్తన యీ 'షణ్యాన్ని' అంతటినీ తుడిచిపెట్టింది. అయితే, ఏ ఉద్యమంలోనూ చిటికెనవేలైనా ఎత్తకుండా అక్షర లోకంలోనే వున్న విజ్ఞుల కంటె మాయమర్మం తెలీనట్టు కనిపించే

శ్రీశ్రీ చాలా చాలా నయం. ఏది 'శుద్ర'మో ఏది కాదో విమర్శించి తన శేష జీవితాన్ని క్రియాశీలంగా మార్చుకుంటేనే శ్రీశ్రీ. సాహిత్యజీవితం కూడా సార్థకత చెందుతుంది.

నవలలాగా రాద్దామనుకున్న 'అనంతం' అరణ్యంగా మారిందంటే, జేమ్స్ జాయిస్ 'యులిసిస్' కూడా సిగ్గుపడాలి. జీవిత చరిత్రకారుడికి వెయ్యికళ్లూ వెయ్యి చేతులూ వుంటే తప్ప. శ్రీశ్రీ జీవిత, సాహిత్య క్రమాన్ని సుసంబద్ధం చెయ్యడం అసాధ్యం.

'రాక్షసరాత్రిలు' వంటి భాగాల్లో శ్రీశ్రీ సొంత వింత దురలవాట్లు గురించి రాయటం, మర్యాద రామన్నల కెందరికో 'షాక్' కొట్టించి వుంటుంది. సిగ్గూ యెగ్గూ, సంకోచం, భయం - వీటికి అతీతుడనిపించాడు. చేస్తే తప్పుగానిది చెబితే నేనా తప్పు? భూస్వామిక యుగానికి చెందిన 'రసికత' బూర్జువా యుగంలో దొంగ ముసుగేసుకుంది. విక్టోరియారాణి హయాంనాటి 'ప్రూడర్'గా మారింది. ఇది కపటం. అచ్చుకావడానికి తగని మాటలూ చేష్టలూ కొన్ని ఉండవచ్చు. దాపరికం లేకుండా చెప్పదలిచిన రచయితకు మట్టుమర్యాదల గురించి లోక వాడుకలోవున్న భావాలు వర్తించవు. అయితే, పూర్తిగా ధైర్యం చాలలేదేమో ఇంకా 'అవాచ్యాలై'న వాటిని మెదడు పొరుగుల్లోనే దాపెట్టుకున్నాడు. లోకభీతి పూర్తిగా వదల్లేదు. తాము జీవిస్తూన్న నిర్దిష్టమైన సమాజంలో. వాడుకలోవున్న నైతికమైన కొలబద్దలతో శుద్ధ బొహీమియన్లుగా జీవించినవారు శిష్టా, శ్రీశ్రీ. అయితే మాత్రం? రేపటి సామాజిక వ్యవస్థను సూచించగల ప్రవర్తన రీతులేనా ఇవి? "రాబోవు యుగం దూతల"కు మార్గదర్శి కాదలిచిన వ్యక్తి, బాధ్యతనెరిగి నడవడం అందరికీ సాధ్యమయ్యేదికాదు. "పావన నవజీవన బృందావన నిర్మాతలు" అని వర్ణిస్తే, 'ఆహో! ఓహో!' అంటున్న మనం, 'బృందావన' శబ్దానికిగల ప్రకరణాన్ని (Context) గ్రహించారా? కవికే యీ స్పృహ వుందా? స్వేచ్ఛను విశృంఖలత్వంగా మార్చి అర్థం చెప్పుకోవడం సామాజిక అనర్థమే. రంగనాయకమ్మగారు ఆ సందర్భంలో చెప్పిన అభ్యంతరానికి సవ్యంగా సమాధానం చెప్పక, దిక్కుమాలిన వ్యంగ్యం వాడి రంగనాయకమ్మగారినే గాక మరెందరినో దబాయించి నోరు మూయించాలనుకున్నట్టుంది శ్రీశ్రీ. "రాక్షసరతి" సరే, దానికి గురైన అబల "భయంకర బాధలను" "పాటల పల్లవి"గా భావించి రాసిన కవి, 'శాడిస్టు' (ఇతరుల బాధనుంచి ఆనందం పొందేవాడు) అనిపించుకోడా?

ఎప్పటికి ఏది స్ఫురిస్తే వరసా క్రమమూ లేకుండానే రచనలోకి దూర్చి ఆ వారమో మాసమో తన శీర్షికను నిర్వహించా ననుకోవడం, తన కొక రచనా ప్రణాళిక

వుంటే దాన్ని గౌరవించదు, పాఠకుల రియాక్షనునీ ఖాతరుచెయ్యదు. 'అనంతం'లో పలుమార్లు జరిగిందిదే. లేకుంటే, రంగనాయకమ్మగారి విషవృక్షానికి జవాబుగా లత, రామాయణ రచనా ప్రేరణను శ్రీశ్రీయే నిషాలో వున్నప్పుడు తన కిచ్చారనడం గాని, దాన్ని బట్టుకుని శ్రీశ్రీ ఇంతకంతగా రాయడంగానీ జరిగివుండదు. తాత్కాలికంగా పాఠకులకిది 'హాట్‌హాట్'గా అనిపించి, 'గన్నులా'గా తోచివుండవచ్చు గాని, ఏ ఒక్కరికీ ప్రతిష్ఠాకరమైన విషయం కాలేదు.

'అనంతం'లో (అదీ ఒక క్రమంలో కాకుండా) శ్రీశ్రీ జనచైనా పర్యటనానుభవాలు ఆరేడు సంచికలను ఆక్రమించాయి. కానీ, ఫాయిదా ? కానీ ఫాయిదాకూడా లేదు. ఇలాగనడం శ్రీశ్రీని అవమానించడాని కనే మాట కాదు. తన 'మరో ప్రస్థానం' జనచైనాకు అంకితమైన గీతంతో- 'రష్యా ! ఓ రష్యా !' గీతానికి సాటిరాగల గీతంతో- ముగించాలని శ్రీశ్రీకి ఈనాడూవుంది. 'బెండయ్యగది' అనే నాటికను వూహల్లో మాటల్లో నలబయ్యేళ్లుగా నేస్తూనే రాస్తూనే వున్నాడు. శ్రీకాకుళం పోరాటం ఉధృతంగా ఉన్నప్పుడు ఏ భిల్లులోనో కాపురం పెడతానన్నాడు. చివరికి ఏవీ జరగలేదు. చైనాకు వెళ్ళి ఎంతో చూపువిప్పార్చుకు మార్పుల్ని గమనించి రావలసిన వ్యక్తి, పరమ పనికిమాలిన డైరీ ఎంట్రీలతో, డ్రింక్ కబుర్లతో, సిజర్ సిగరెట్ పెట్టెల ప్రస్తావనల్లతో, అత్యైన కాగితాలను సరే, నిజంగా 'అదృష్టం' లాంటి సదవకాశాన్ని ఎంతగా జారవిడుచుకున్నాడో. ఇంతకీ ఫిలింఛాన్స్ కోసం అర్ధంతరంగా పర్యటన ముగించు కొస్తాడా ? వచ్చేలోపల్నే ఆ ఫిల్ము ఛాన్సు కూడ పోయింది. నాకో మరొకరికో తెలుసు శ్రీశ్రీ దృష్టిలో బాధ్యతకంటె భద్రతే ముఖ్యం. (బెంగాల్ పెటీ బూర్జువా వర్గానికి 'భద్రలోగ్' అని పేరు) ఆయన అక్కర అలాంటిది. అది ఎక్కడికైనా- ఢిల్లీకీ కాకినాడకీ, శ్రీశ్రీ కాళ్ళకు దారి చూపుతుంది. అయితే ఇతగాడు మన శ్రీశ్రీ కాదు; ఆర్తుడూ, కుటుంబ "బాధాసర్పదష్టుడై"న బాహుకుడు ; ఇతగాని పేరు శ్రీరంగం శ్రీనివాసరావు మాత్రమే, మహాకవి శ్రీశ్రీ కాదు.

ఏదో రాయాలనుకుని మరేదేదో రాస్తున్నాడు శ్రీశ్రీ - ఒక విధమని కాకుండా పరిపరి విధాలుగా రచయితగా 'అనంతం' తనకు ప్రతిష్ఠాహేతువో గర్వకారణమో కాలేదింతవరకూ. అయినా, యీ 'తళుకు బెళుకు రాళ్ళ'నటుంచి, 'నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు' నన్న పద్ధతిలో చూస్తే, నీలాలు అక్కడక్కడ కనిపించి, 'యిదుగో శ్రీశ్రీ, వీటిలో వున్నాడు. తక్కిన వాట్లలో వున్నదల్లా శ్రీరంగం శ్రీనివాసరావే' అనిపిస్తుంది.

"ఆత్మ చరిత్రాత్మ చరిత్రాత్మ చరిత్రాత్మక రచన" పునఃప్రారంభం" (ప్రజాతంత్ర 13.4.1975) లోనే ఒక మాటన్నాడు మన శ్రీశ్రీ- దానిస మనస్తత్వాన్ని ఎదుర్కోడానికి, అస్తిత్వాన్ని సవాలు చేస్తూ- మానవుడి ఈశ్వరం దానిసత్వం "ప్రపంచం అంతటా ఓడిపోతున్న తత్వం. మాది గెలుస్తున్న తత్వం"

'సదసత్సంశయం' కాలం గడిచింది. శ్రీశ్రీ నాస్తికుడయ్యాడు వ్యక్తిగా (సమాజ సంబంధాలలో కాదు). 'నేను' అనేది ఆయన కవిత్వ శబ్దకోశంలో 'ఐ' గా కనిపించి, వెంటనే 'మనం'గా పరిణమించింది _'మనం' లో కలిసింది. వ్యక్తికి శక్తి వచ్చేదిలాగే. అయితే యిప్పటిదాకా నాస్తికతనీ గతితార్కిక భౌతికవాదాన్నీ ఒకటే నన్నట్టుగా చూస్తున్నాడు. బూర్జువా 'రేడికలిజం' వేసిన వెర్రితలల్లో అదొకటి అని మధుసూదనరావు లాంటి తజ్ఞులు చెప్పినా, మరొకరు చెప్పినా, తన దారి తనదే. 1945 జనవరిలో 'అనంతం' ప్రారంభిస్తూ, "సృష్టి ఒక శ్లేషకావ్యం" అనడంలో - ఆదిలోనే హంసపాదు- వేశాడు శ్రీశ్రీ. 'సృష్టి' అంటేనే 'సృష్టికర్త' వుంటుంది. వుంటాడు- శక్తి అను, demi-urge అను, దేవుడను. ఒకసారి నేను దీన్ని తన దృష్టికి తీసుకురాగానే, మరోమాట అనకుండా సవరించుకున్నది కూడా శ్రీశ్రీ యే. లోపాన్ని సవరించుకోవడానికి వుండవలసింది సౌజన్యమే కాదు, సాహసం కూడా. అది ఎందరికో లేదు గనకనే పిడివాదాలకు దిగడమో మొండికి పడడమో అలగడమో ఆగ్రహించటమో జరుగుతూంటుంది. విప్లవకారుడి కెవడికైనా యిది జాడ్యమే. సృష్టి శ్లేష అవునోకాదో గాని, 'అనంతం' సృష్టి శ్లేష్మం.

"ఈనాడు సంఘంలో రావలసిన విప్లవం ముందుగా భాషలో రావాలి. భాషను మార్చడానికి భావాలను మార్చాలి. జీవితపు పోకడలనే మార్చాలి. వీటిలో ఏది ముందు ఏది వెనక నేనాలోచించను. భావంవల్ల భాషవల్ల సంఘంవల్ల భావం మారుతుందో, భాషవల్ల సంఘంవల్ల భావంవల్ల భాషమారుతుంధో, సంఘంవల్ల భావంవల్ల భాషవల్ల సంఘం మారుతుందో అది అనవసరం. నాకు కావలసింది మార్పు."

(ప్రజాతంత్ర 1975 ఏప్రిల్ 27)

భౌతికవాస్తవంలో మార్పే మిగిలిన మార్పులకి సూత్రస్థానం. భావం మారాలంటే ముందుగా వాస్తవం మారాలి. పదార్థ ప్రాథమికత్వాన్ని అంగీకరిస్తే, ఇందులో పరాధీనత కాదు, పరస్పరాశ్రియత వుంది. సమాజ జీవిత నిర్మితిలో పునాదికి అధిక ప్రాముఖ్యం వున్నా, ఉపరితల నిర్మాణానికి అప్రాముఖ్యం లేదు సరిగదా, ఉపరితలం పునాదినే ప్రభావితం చెయ్యగలగడం అటుంచి, ఉపరితలంలోని ఒకానొక అంశమే

మొత్తానికీ అప్పటికి ప్రాధాన్యం పొందవచ్చు గూడా. శ్రీశ్రీ తార్కికుడో తాత్వికుడో కాదు- ముఖ్యంగా కవి. అంచేత, బుద్ధిబలాన్ని వాదోపవాదాల వైపు తిప్పకుండా, Impulsive అనిపించేట్టు, తెగేసి 'నాకు కావలసింది మార్పు' అనడం జరిగింది.

'మహాకవి మధుర స్వప్నం' అని 'ప్రజాతంత్ర' (1975 మే 25) పతాక శీర్షికతో వర్ణించిన శ్రీశ్రీ మాటలు- "ఎప్పటికైనా నేనొక పదిహేనాశ్వాసాల మహాకావ్యం రాస్తాను, దానిపేరు 'విశాఖపట్టణం'-" ఇంకో వృత్తిమాటే ఐనా, అందులో సూచన ప్రాయంగా వున్నదే, ఒకప్పుడు నాచేత శ్రీశ్రీ జీవిత చరిత్రలో ప్రథమ ప్రకరణానికి తగినదిగా స్ఫురించింది. తీర్థపురాళ్ల, డాల్ఫిన్స్‌నోస్, యారాడకొండ, తుమ్మెదల మెట్ట- యిలాంటి స్థానిక విశేషాలకేంగాని, తెలుగు దేశంలో భూస్వామిక యుగాన్ని నెట్టుకుంటూ పరిశ్రమలు రావడం చారిత్రికంగా ఎంతో ముఖ్యమైన ఘటన. హార్బర్ నిర్మాణం దీనికి సూచన. నిజానికి, గురజాడ జీవితంలో, వీరేశలింగం జీవితంలో, రైలు పడడమే గొప్ప విశేషం. అదే నాంది. రైళ్లే బ్రిటిషువాడి గోరీ రాళ్లవుతాయని మార్క్స్ ఎంతో దూరదృష్టితో రాశాడు. జనంచేత పాటలు కట్టించిందది. విశాఖ గురించి శ్రీశ్రీ రాసింది ఏమిటిగాని, నారాయణబాబు మా బాగా రాశాడు. భావకవుల మనస్సుల నుంచి భూస్వామ్యం, పండిత సంప్రదాయం, గ్రాంధిక వ్యామోహం పూర్తిగా పైదొలగకున్నా, ఈ కొత్త వ్యవస్థ గుండెల తొలి చప్పుళ్లను వాళ్లు, ఆత్మాశ్రియ వైఖరికి మూలమైన బూర్జువా వ్యక్తివిశిష్టతావాదం ద్వారా వినిపించారు. మరి, శ్రీశ్రీ? ఈ మార్పుకి పుట్టిన బిడ్డ. వాళ్లంతా అనూరప్రాయులు, తాను గరత్మంతుడే- "ఎగిరిన ఇనుప డేగ". "పొగగొట్టపు ఘూంకార ధ్వనులు" తన 'నవకవిత'కు వస్తువన్నాడు. "సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు" పేర్కొంటూ "శ్రమైక జీవన సౌందర్యానికి" తన సాహిత్యాన్ని అంకితం చేస్తానని నలభైయేళ్ల కిందటే 'ప్రతిజ్ఞ' చేశాడు. చాలా వరకు, నిలుపుకున్నాడు కూడా. ముందుగా విశ్వనాథ, కృష్ణశాస్త్రి గార్ల ప్రభావం నుంచి బయటపడి 'సొంత గొంతుక' వెదుక్కోడంలో, అప్పుడప్పుడే మన తెలుగుసీమలో మొదలు కాసాగిన వామపక్ష వుద్యమం తోడ్పడింది. ఈ శతాబ్దమంతా తనదంటున్న శ్రీశ్రీ, వ్యక్తి ఆధిక్యభావంతో గాక, చారిత్రక శక్తులైన అశేష ప్రజల ఆధిక్యభావంతో అలాగంటున్నాడనుకోవడం సబబు. అన్నట్లో వామపక్షానికి శ్రీశ్రీ, శ్రీశ్రీకి వామపక్షమూ తెలియదు. దానికి తగిన కవులు దానికి లేకాపోలేదు- పెండ్యాల లోకనాథం. శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు వగైరా. అయితే శ్రీశ్రీ అక్షరాలా 'శిష్ట' వర్గం మనిషి కాబట్టి, ఏ అబ్బూరి

చలివేందిరనో కవికొండల శివరాత్రి ప్రభనో శిష్ట్లా మహాలయ అమావాస్యనో ముద్దు కృష్ణ జ్వాల ఎడిటోరియల్‌నో, ఇంకాపోతే నజ్రుల్ ఇస్లామునో, మరీ వెనక్కెడితే ఆదిశంకరుడి దంటున్న భజగోవిందాన్నో, విదేశాలలో మయాకోవస్కీనో పేర్కొం టున్నాడే గాని, తన సీమలో వేళ్లతన్నుకుంటూ వచ్చిన యీ వామపక్ష సాహిత్యాన్ని (ప్రచార మనచ్చు, నినాదాలనవచ్చు నేటి 'విమర్శక' మహాశయులు సైతం!) గుర్తించనేలేదు– ఈనాటికీ. వాళ్ళ 'పామర' కవులుగానే వుండిపోయారు సాహిత్య చరిత్రలకే ఎక్కకుండా. తన ప్రమేయం లేకుండానే అరసం తలెత్తిందని గూడా మరచినట్టుంది. మొత్తం భారతదేశంలో తానే మొదటి విప్లవ కవినంటున్న శ్రీశ్రీ ప్రేమ్‌చంద్ ఉనికిని గుర్తించినట్టు లేదు. ఈ చారిత్రిక నేపథ్యం 'అనంతం'లో కనిపించవలసినంత నిండుగా, నిజంగా కనబడదు.

కొంపెల్ల జనార్దనరావు గురించి శ్రీశ్రీ, ఆర్ద్రమైన జ్ఞాపకాలు నిక్షేపించుకో దగ్గవి. సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు విశేషాలకు ఇంకా ఎక్కువ ప్రాముఖ్యం వుందని గుర్తించి వుంటే, బుర్రా శేషగిరిరావు అధ్యక్షోపన్యాస హేళన కంటె గొప్ప అనుభవాలను మనకు పనికి వచ్చేట్టుగా వివరించి వుండేవాడు. మీదు మిక్కిలి, మిత్రుడుగానే జనార్దనరావును చూశాడు తప్ప విమర్శక ధర్మానికి దాదాపుగా స్వస్తి చెప్పాడనాలి. జనార్దనరావు ఫక్తు వైదికప్పు కవి. అతని కావ్యభాష విశ్వనాథకే కొరుకుడు పడదు. తద్ధిత రూపాలు వగైరా "పండితైక వేద్యములే". అతని భావం అతిలోకం. 'ఉదయిని' సంస్థాపకుడుగా, మంచి మనిషిగానే తప్ప రచయితగా అతని నభిమానించగలగడం 'అస్మదాదులకు' అలివికాని పని. ఈ విషయంలో ప్రతి ఒకరికీ అర్థం కావాలనే, ప్రతి ఒక్కరికి నచ్చాలనే 'సాహిత్య ప్రజాస్వామ్య' దృక్పథానికి దువ్వూరి రామిరెడ్డి కూడా ('ఫిడేలు రాగాల డజను' గురించి రాసిన వ్యాసం చూడవచ్చు) వ్యతిరేకి. కే.సి దే, పాటలనందరూ అనుభవించే రోజుల గురించి కలలుగనే కమ్యూనిస్టులను చలం హేళన చేశాడు. ఇక జనార్దనరావా, అందని ఆకాశమే. దీన్ని శ్రీశ్రీయే "ఎరిస్టోక్రాటిక్ తత్వం" అనగలిగాడు (ప్రజా తంత్ర 1975 జులై 6). అతని కవిత్వాన్ని యీ కోణం నుంచి విమర్శించి వుండాల్సింది. కొంతవరకు చేసాడు. కాని అంతకంటె హెచ్చుగా, మిత్ర స్మృతిని పురస్కరించుకుని 'మహాప్రస్థానం' జనార్దనరావు కోసమే చేస్తున్నట్టు అంకితంలో రాసుకున్నాడు. "ఇలా చూడు నీ కోసం / ఇదే నా మహాప్రస్థానం!!"

సూక్ష్మంలో చెప్పాలంటే – 'అనంతం' అనే శ్రీశ్రీ రచనకు ఒక ఆరంభమూ (ఎప్పటి కెన్నిమార్లు ఆరంభించారో!) ఒక పరిసమాప్తమూ వుండవు. దీనిలో 'బండెడు చెత్త' అనిపించే పదార్థం పోగుబడివున్నా, ఇంత చెత్త నుంచీ కొంత మేలిమినైనా వెలికి దియ్యవచ్చు. 'విదూషకతత్వం జతకలిసి వున్నందు చేత, శ్రీశ్రీకి శాఖాచంక్రమణం ఎక్కువ – యీ రచనలో. ఇది నవలగాని నవల, ఆత్మ చరిత్ర గాని ఆత్మకథ. ఇలాంటిది శ్రీశ్రీ లాంటి అసంయమిత ప్రకృతిగల వారికే చెల్లు. ఆయన మాటల్లో –

"'అనంతం' నేను ఆషామాషీగా కాని, ఉబుసుపోకకుగానీ రాయలేదు. కళా కారుడుగా కూడా రాయలేదు. ఒక సైంటిస్టుగా నా జీవిత వాస్తవికతను సందర్శించే ఉద్దేశంతో రాస్తున్నాను." (ప్రజాతంత్ర 1975 అక్టోబర్ 19) మార్క్స్, ఫ్రాయిడ్, యూంగ్, అడ్లర్, ఎల్లిస్, నీచ్చే, కీర్కెగార్డ్, గటారి, ఎటెసెటారి కలకూర గంపా – సైన్సు?

'వసుధైక' భావం, కాబట్టి దేశ కాలాలకు ఒదిగి పోకుండా, విశాలమైన లోక దృశ్యాలను కొంచెం కొంచెంగా చూపే ఈ రచనకు, క్రమమూ పథకమూ లేక పోయినా, ప్రజా జీవిత వాస్తవం పట్ల గౌరవం ఉంది. "నా పాటల గమకం జీవిత గమనం." (ప్రజాతంత్ర 1975 ఆగస్టు 3) అన్న కవి, యీ సూక్తిని తన 'అనంతం' రచనకు అనువర్తింప జేసుకునివుంటే బాగుండేది. అంటే, జనానికి లాభించేది. అలా జరగనందుచేత, పూర్తి అయినా కాకపోయినా 'అనంతం' అరకొన్ను తృప్తిని, టన్ను అసంతృప్తినీ మిగిలిస్తుంది.

---

**శ్రీ శ్రీ**

దగాపడిన తమ్ముల
బాధా సంగీతం శ్రీశ్రీ
తరుణారుణ విప్లవాగ్ని
సంకేతం శ్రీశ్రీ
పెను నిద్దుర వదలించే
ఇనతేజం శ్రీశ్రీ
శ్రమజీవన సౌందర్యద్రష్టః
శబ్ద శిల్పి శ్రీశ్రీ

స్వేచ్ఛా పోరాట స్ఫూర్తి;
బిగిసిన పిడికిలి శ్రీశ్రీ
అజరామర, నవోన్మేష
కవితావేశం శ్రీశ్రీ
'మరో ప్రపంచం' వెలుగుల
ప్రస్థానగీతి శ్రీశ్రీ!

– విరాగ్

# తెనుగు 'వాడి'ని వాడే ప్రతిభ కలవాడు శ్రీశ్రీ

కాళోజీ

ఉద్యమాల గురించి పుస్తకాల్లో చదివి ప్రభావితుడై కవిత్వం రాసినవాడు శ్రీశ్రీ. ఇదివరకు ఏ ఉద్యమాల్లో పాల్గొన్నాడు గనక ఎమర్జెన్సీలో ఏమీ చేయకుండా వున్నాడని అనడం ?

ఇక ఎమర్జెన్సీలో శ్రీశ్రీ ఇందిరను, వెంగళరావును పొగిడినమాట: "అయ్యలు ఒల్లని మియ్యాలు మెచ్చని / యిస్లాహత్ (సంస్కరణలు) అవి ఎందులకు ?" అని నిజాం ప్రవేశపెట్టిన "ఎంగిలి విస్తరికన్నా హేయమైన సంస్కరణల"కు వ్యతిరేకంగా మేం ఒకవైపు పోరాటం చేస్తుంటే అప్పుడు శ్రీశ్రీ ఎక్కడున్నాడు ? ఆ సంస్కరణలను అమలు పెట్టేందు కేర్పడ్డ ఆఫీసులో నౌకరిలో. "ప్రస్తుతం నేను మ.ఘ.వ, నిజాం ప్రభువువారి (మ.ఘ.వ. అనగా మహా ఘనత వహించిన అని అర్థం) రిఫార్మ్స్ సెక్రటేరియట్‌లో ఉద్యోగిని.... ఆరు నెలల దాకా ఇలా బతకడానికి వీలుంది–" అని "ఒక బీర్ బుడ్డీ ముగించి రమ్ సేవిస్తూ" హైదరాబాదు నుంచి పురిపండా అప్పల స్వామికి శ్రీశ్రీ 1946 లో రాసిన ఉత్తరం శ్రీశ్రీ సంపుటాల్లో అచ్చయ్యాకనే నేనీ విషయం చెప్తున్నాను.

అసహాయ స్థితిలో సహజంగా వుండే బలహీనతలవల్ల శ్రీశ్రీ అట్లా చేసి వుండ వచ్చు. మా పోరాటానికి వ్యతిరేకంగానో, నిజాంకు అనుకూలంగానో, జల్సాగా జీవిద్దామనో, విశ్వాసాల (conviction) తోనో వచ్చినవాడు కాకపోవచ్చు. అవసరం లేకున్నా దిగజారి, తాము ఏం చేస్తున్నామో పూర్తిగా తెలిసే చేస్తున్న ఈనాటి సుప్రసిద్ధ కవులు చాల మందికంటె ఆనాటి శ్రీశ్రీ నయమే.

అయితే ఈనాటి శ్రీశ్రీ సినిమా పాటలు రాయడం విషయంలో మాత్రం వాళ్ళతో సమానుడే. విశ్వాసాలు వున్నోడు రాజీలోపనుడెట్లా ? ఆచరణలేని సిద్ధాంత బలం అర్థం లేనిది. Conviction without action is nothing, నిమగ్నత (involvement) లేకుండా ఎంత రాసినా. ఏమి రాసినా, ఏం ప్రయోజనం ?

శ్రీశ్రీ గురించి కొత్తగా చెప్పేదేమున్నది ?

1. శ్రీశ్రీ వయసు యిప్పుడు పది ఏళ్ళు.

2. అతనిది పిల్లతనం కాదు, పసితనం. (He is not childish, but child-like). తాగుతూ వుండే వాళ్ళల్లో కలిసి ఒకనిగా, వ్యభిచరించే వాళ్ళలో కలిసి ఒకనిగా, ఎవరిలో వుంటే వాళ్ళలో కలిసిపోయే రకం. పసి మనసుకు కంట్రోల్

వుండదు. అయితే శ్రీశ్రీ ఎప్పుడు ఏం మాట్లాడినా మూడ్‌లోనే వుంటాడు. ఆ మాటలో (చాలావరకు) నిజాయితీ వుంటుంది.

శ్రీశ్రీలోని చెడు గురించి మాట్లాడకుండా మంచిని మాత్రం చెప్పుకోవడం ఉత్తమం.

లండన్‌లో మదన్‌లాల్ డింగ్రా లాంటి తీవ్రవాదులతో కలిసి వుంటూనే కర్జన్‌విలీ పెట్టిన ఇండో ఆంగ్లియన్ క్లబ్‌లో చేరినపుడు సావర్కార్ యింతేచేసాడు. ఇండియన్ లీగ్ (పేరు యిదేనేమో)లో డింగ్రా పేర సంతాప తీర్మానం ప్రవేశపెట్టి ఆమోదింపచేసాడు.

నెహ్రూ 1946లో తాత్కాలిక ప్రభుత్వంలో చేరేదాక లోహియాకు మిత్రుడూ, మార్గదర్శి. ఆయన 1964లో చనిపోయినపుడు లోహియా అమెరికాలో వున్నాడు. అక్కడి నల్లవాళ్ళ ఉద్యమంలో పాల్గొని అరెస్టు చేయబడ్డాడు. "1946లో చనిపోయిన వేదాంతి, మార్గదర్శి అయిన నా మిత్రుని స్మృతిలో నేనీ పని చేసాను" అని మెజిస్ట్రేట్ ముందు చెప్పాడు నెహ్రూ పేరెత్తకుండా. లోహియా నెహ్రూ పేర మరే సంతాప ప్రకటనా చేయలేదు.

"నువు రాసి పారేసిన కవితలు గుబాళిస్తున్నపుడు
నువు తాగి పారేసిన సీసాలకంపు మాకెందుకు_"
అని మాత్రమే శ్రీశ్రీతో అనగలం.

"తెనుగు 'వాడి'ని వాడే ప్రతిభ" కలవాడు శ్రీశ్రీ.

['సాహితీమిత్రుల'తో శ్రీశ్రీ గురించి కాళోజి చెప్పిన విషయసంగ్రహం]

---

కాకినాడలో శ్రీశ్రీకి సన్మానం తలపెట్టిన సో.సు. శ్రీశ్రీ గురించి ఏమంటున్నాడు :

1. శ్రీశ్రీ యుగం 1940 లో అంతరించింది. తరువాత కొత్త యుగం ప్రారంభమైనది.... శ్రీశ్రీ తరువాతవారైన నయాగరా కవులు, ఆరుద్ర అస్మదాదులు సాహితీ యుగ స్రష్టలైనారు.
2. అభ్యుదయ కవితాయుగం 1940 లో ప్రారంభమైనది. దీనికి మాతృత్వస్థానం వహించిన భావకవిత్వం పూర్తిగా వైయక్తిక అంశాలతో కూడుకున్నట్టిది.
3. ....శ్రీశ్రీ 'జట్కావాలా' గీతం ఇచ్చిన ఉత్తేజాన్ని మానిఫెస్టోగా విరసం మలచుకోవటం దుఃఖభాజనమైన విషయం. నైరాశ్యం వలన విప్లవాలు రావు.

(అభ్యుదయ - నవంబరు, డిసెంబరు 1979)

# శ్రీశ్రీ యుగం 1940 లోనే అంతరించిందా ?!

"అభ్యుదయ సాహిత్యమనేది కేవలం కమ్యూనిస్టు ఉద్యమ ప్రేరణ అని, వైదేశిక అంశమని అభ్యుదయ సాహిత్యానికి వ్యతిరేకులు చిరకాలంగా నిందారోపణ చేస్తున్నారు. ఇది నిరాధారమూ, అవాస్తవికమైనది కూడా........

అభ్యుదయ కవితా యుగం 1940లో ప్రారంభమైంది. దీనికి మాతృత్వ స్థానం వహించిన భావ కవిత్వం పూర్తిగా వైయక్తిక అంశాలతో కూడుకున్నట్టిది....

....గురజాడ జ్ఞానాంశానికి ప్రతీక. తొట్టతొలి అభ్యుదయకవి, గురజాడ ఆనాడు తన సమకాలీనులైనట్టి విశ్వనాథ ఇత్యాదులపై తీవ్ర ప్రభావాన్ని కలిగించారు.

....శ్రీశ్రీ కవిత్వంలో శ్రీనాథుడు కనిపిస్తాడు. శ్రీనాథునివలె శ్రీశ్రీ కూడ పదగుంభనా విన్యాసంతో, భాషా పటిమతో పాఠకులను ప్రభమాకర్షితులను చేసు కుంటాడు. శ్రీరంగం నారాయణబాబు, శ్రీశ్రీ ఉభయులూ నన్నయ్య, నారాయణ భట్టుల వంటి వారు.

శ్రీశ్రీ యుగం 1940లో అంతరించింది. తరువాత కొత్త యుగం ప్రారంభ మైనది. శ్రీశ్రీ 'మరో ప్రపంచం'తో మేల్కొన్న ప్రజానీకానికి వారి కష్టాలను గానం చేసిన, శ్రీశ్రీ తరువాత వారైన నయాగరా కవులు, ఆరుద్ర అస్మదాదులు సాహితీయుగ ప్రష్టలైనారు.

....1940లో వచ్చిన అభ్యుదయ కవిత్వానికి, 1950లో ప్రారంభమైన డిటెక్టివ్ సాహిత్యానికి వికృతంగా పుట్టిన రోగగ్రస్త శిశువు దిగంబర కవిత. దిగంబర కవి త్వోద్యమమే విప్లవానికి మాతృస్థానమైనది. నైరాశ్యం విప్లవ కవితకు ప్రేరణ కాగూడదు.

నైరాశ్యం వల్ల విప్లవాలు రావు. కాని శ్రీశ్రీ 'జట్కావాలా' గీతం ఇచ్చిన ఉత్తేజాన్ని మానిఫెస్టోగా విరసం మలచుకోవటం దుఃఖ భాజనమైన విషయం."

(అభ్యుదయ కవిత - అరంభవికాసాలు, సోమసుందర్ చూ. పే. 45, 45, అభ్యుదయ నవంబర్ - డిసంబర్ 1979)

ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం అధికార పత్రిక 'అభ్యుదయ'లో అం. ప్ర. అ.ర.సం. అధ్యక్ష వర్గసభ్యుడు సోమసుందర్ రాసిన వ్యాసంలో అభ్యుదయ కవిత్వం- శ్రీశ్రీకి సంబంధించిన అంశాలన్నీ పైన యథాతథంగా ఎత్తి రాయడమైంది.

సో.సు. వేమనను నాటి సమాజంలో కల్మషాన్ని పూర్తిగా శుద్ధి చేయాలన్న స్పృహతో రచన సాగించిన (అప్పటికి) ఆధునికుడుగా అంగీకరిస్తున్నాడు.

సో.సు. గురజాడను తొట్టతొలి అభ్యుదయకవి అని ఒప్పుకుంటున్నాడు. 'కన్యాశుల్కం' ఆనాటికి సంపూర్ణ అభ్యుదయ భావావిష్కరణ చేసిన రచన అని 'లోకదుక్క' గీతం ఆనాటికీ ఈనాటికీ అభ్యుదయ కవిత అనికూడ ఒప్పుకుంటున్నాడు.

వస్తుపరంగా గురజాడ కవిత్వం గురించి ఒక పెద్ద పేరాగ్రాఫ్ రాసిన సో.సు. శ్రీశ్రీ విషయంలో "........శ్రీశ్రీ 'మరో ప్రపంచం'తో మేల్కొన్న ప్రజానీకానికి ........" అని కేవలం ఒక్క వాక్యం రాసి, శ్రీశ్రీ కవిత్వానికి లేదా 'మరో ప్రపంచం' గీతానికి ప్రజానీకాన్ని మేల్కొలిపే లక్షణం వుందని మాత్రం అంగీకరిస్తున్నాడు. అయితే ఈ మేల్కొల్పడం కూడ వస్తుగతశక్తి అని సో.సు. అంగీకరిస్తున్నాడనడానికి దాఖలాలేదు. ఎందుకంటే శ్రీశ్రీ పదగుంఫన విన్యాసం వల్ల, భాషా పటిమ వల్ల కూడ ప్రజల నిద్రాభంగం కావచ్చు.

పోనీ శ్రీశ్రీ 'మరో ప్రపంచం'తో మేల్కొన్న ప్రజానీకానికి ఏం గానంచేసి అవంత్సాదులు 'అభ్యుదయ సాహితీయుగ స్రష్ట' లైనారు? "వారి కష్టాలను" గానంచేసి।

ఇవ్వాళ ప్రజా పోరాటాలను గానంచేయడమే కాదు, సాహిత్య సాంస్కృతిక రంగంలో బలపరుస్తున్న విరసం నైరాశ్యం చెపుతున్నదని చారిత్రిక అవగాహన సరేకదా సరియైన సమకాలీన సమాచారం కూడా లేకుండా దబాయిస్తున్నాడు "కష్ట గాయక అభ్యుదయ సాహితీయుగ స్రష్ట."

కాబట్టి వేమన అప్పటికి ఆధునికుడు. గురజాడ తొట్టతొలి అభ్యుదయ కవి. ఎప్పుడు ప్రారంభమైందో తెలియని శ్రీశ్రీ యుగం (దాని స్వభావం పదగుంభన విన్యాసం, భాషాపటిమ) 1940కి అంతమైంది. అభ్యుదయ కవితాయుగం 1940తో ప్రారంభమైంది. అవంత్సాదులు ఆ యుగ సాహితీస్రష్టలు.

ఇదీ సోమసుందర్ తేల్చదల్చుకున్న చారిత్రిక సత్యం.

ఈ క్రమంలో గురజాడ తీవ్రమైన ప్రభావం ఎవరి మీద కలిగి-చాదయ్యా అంటే 'విశ్వనాథ ఇత్యాదులపై':

మార్గకవిత చాల ఉన్నతమైన స్థాయిలో వున్నట్లు జానపద కవిత అట్టడుగున వున్నట్లు సో.సు. మొదట నిర్ధారణచేసి తన మార్గకవితాభిమానాన్ని బయట పెట్టు

కున్నాడు. 'జానపద కవిత్వాన్ని రసమార్గంలో నడిపినవారు నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు, వీళ్ళంతా కవిత్వాన్ని అందంగా సృజించారు.' రసవాదం, సౌందర్యవాదం తెచ్చి జానపద కవిత్వంలో వున్న నిసర్గ సౌందర్యాన్ని గుర్తించడానికి నిరాకరించి లిఖిత సంప్రదాయమే వాటికాలక్షణాలు కలిగించినట్లు రాసి సాహిత్య చరిత్రను గురించి తన అజ్ఞానాన్ని సో.సు. బయట పెట్టుకుంటున్నాడు. నన్నయకన్న పూర్వమే జానపద కవిత్వమేకాదు అందులో అందాలు వున్న విషయమూ, ఉరుతర గద్యపద్యోక్తుల మార్గమార్గాన్ని ఈసడించి దేశి పద్ధతులను పాల్కురికి సోమనాథుడు మొదలయినవారు చేపట్టిన విషయమూ సో.సు.గారికి తెలియదా? మార్గకవితకు ఉన్నతస్థాయిని ఎవరు నిర్ణయించారు? జానపద కవితకు అధమ స్థాయిని ఎవరు నిర్ణయించారు? సో.సు. వంటి అభ్యుదయ సాహిత్య యుగ స్రష్టలేనా?

శ్రీశ్రీకి యుగకర్తగా కాకున్నా ఒక ప్రత్యేక స్థానమివ్వడం కూడ సో.సు.కు కష్టమే. అందుకే శ్రీరంగం నారాయణబాబును సాటితెచ్చాడు.

సో.సు. ఉద్దేశ్యంలో శ్రీశ్రీ నన్నయ, నారాయణబాబు - నారాయణభట్టు. నన్నయ నారాయణభట్టుల అనుబంధం (మహాభారత అవతారికలో నన్నయ చెప్పుకొన్నట్లు) శ్రీశ్రీ, నారాయణబాబులకు ఎన్నడైనా ఉన్నదేమో శ్రీశ్రీ చెప్పాల్సిందే. 1955 నించి చనిపోయేదాకా నారాయణబాబు కమ్యూనిస్టు వ్యతిరేకిగా శ్రీశ్రీకి సాహిత్య శత్రుశిబిరంలో చేరిపోయాడు. శ్రీశ్రీతో యుద్ధం చేసిన సాహిత్య శత్రువులంతా నారాయణబాబునే ముందు పెట్టుకున్నారు. నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగ పోరాటాలు, విరసం, శ్రీశ్రీ వ్యతిరేకతల పుణ్యమా అని 1970 తర్వాతనే 'రుధిరజ్యోతి' వెలుగు చూసింది. నారాయణబాబు చచ్చినా అరసం పేరుతోకూడ కమ్యూనిస్టు వ్యతిరేకులు శ్రీశ్రీని, కమ్యూనిజాన్ని ఇంకా నారాయణబాబునే అడ్డం పెట్టుకొని ఎదుర్కోవాలని చూస్తున్నారని ఈ పోలికలోని ధూర్తత్వం నిరూపిస్తున్నది.

అభ్యుదయ సాహిత్యం కేవలం కమ్యూనిస్టు ఉద్యమప్రేరణ అన్నది అభ్యుదయ సాహిత్య వ్యతిరేకులు చేస్తున్న నిరాధార, అవాస్తవిక చిరకాల నిందారోపణ అని సో.సు. ఆరంభంలోనే చెప్పాడు.

అభ్యుదయ సాహిత్యం కమ్యూనిస్టు ఉద్యమ ప్రేరణయే. సామ్యవాద సిద్ధాంతంపై ఆధారపడిన రాజకీయోద్యమంతో ప్రేరణ పొందిన సాహిత్యం - కూడు, గూడు, గుడ్డ, స్వేచ్ఛ, ప్రజాస్వామ్యాలు ఆకాంక్షించిన సాహిత్యం అభ్యుదయ

సాహిత్యమైతే అది కమ్యూనిస్టు ఉద్యమ ప్రేరణ పొందిందేనని చెప్పుకోవడంలో సో.సు. కుఇవ్వాళ అభ్యంతరం వుంది - ఆయన అరసం అధ్యక్షవర్గసభ్యుడు గనుక.

మరి కుందుర్తి తెలంగాణ, అరుద్ర త్వమేవాహమ్, గంగినేని ఉదయిని చివరకు సో.సు. వజ్రాయుధం కూడ కమ్యూనిస్టు ఉద్యమ ప్రేరణ లేకుండా వచ్చినవేనా ?

ఇంక వైదేశిక అంశమా ? స్వేచ్ఛా సమానత్వ సౌభ్రాతృత్వాలు ఫ్రెంచి విప్లవం నుంచి, ప్రజాస్వామ్యం యూరప్ దేశాల నుంచి, సామ్యవాదం బోల్షివిక్ విప్లవం నుంచి మనను ప్రేరేపించిన అంశాలే. సో.సు.యే మరొకచోట చెప్పినట్లు ఈ యుగాన్ని డార్విన్ పరిణామవాదం, ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతం, కార్ల్ మార్క్స్ గతితార్కిక చారిత్రిక భౌతికవాదం తీవ్రంగా ప్రభావితం చేసాయి. ఈ సిద్ధాంతాలన్నీ మనకే కాదు రష్యా చైనాలకు కూడ వైదేశికాంశాలే. మనం కోరుకోకుండానే మనను పాలించిన విదేశీయులు, వారిలో బ్రిటిష్ వాళ్లు మన నెత్తిన రుద్దిన వలసపాలన, సామ్రాజ్యవాదం, ఆ తర్వాత కూడ ఈనాటికీ కొనసాగుతున్న సామ్రాజ్యవాదాల దోపిడీ, రష్యాతో మన రక్షణ ఒడంబడిక - ఇవన్నీ వైదేశికాంశాలే. సామ్రాజ్య వాదం ఒక ప్రపంచ స్వభావంగా అర్థం చేసుకుంటే తప్ప ప్రపంచ వ్యాప్తంగా కార్మికవర్గ నాయకత్వంలో పీడిత ప్రజలు ఈ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా స్వేచ్ఛా సమానత్వాల కోసం పోరాడుతున్నారు, అందులో భాగమే భారత విప్లవమని అర్థం చేసుకుంటే తప్ప జాతీయ దురహంకారులవలెనే సో.సు. కూడ కమ్యూనిస్టు ఉద్యమం అన్నా, వైదేశికాంశం అన్నా - "నిరాధారమూ, అవాస్తవమూ" అని ఉష్ట్రపక్షి బాపతు ఇసుకలో తల దూర్చక తప్పదు. ఇంతకూ సో.సు.కు కూడ డార్విన్, ఐన్‌స్టీన్, సిగ్మండ్ ఫ్రాయిడ్‌ల ప్రభావాన్ని - అది వైదేశికమైనదైనా సరే అంగీకరించడానికి అభ్యంతరం లేనట్టుందిగానీ వచ్చిన అభ్యంతరమల్లా కార్ల్ మార్క్స్‌తో, అంతకన్న ఆయన మార్క్సిజంతో వున్నట్లున్నది. ఆయన కమ్యూనిస్టు వ్యతిరేకతను ఆదరించి, ఆశ్రయం ఇచ్చి అధ్యక్షస్థానంలో పెట్టుకోవడం అరసానికే చెల్లింది.

సో.సు.కు భావకవిత్వం పూర్తిగా వైయక్తిక అంశాలతో కూడుకున్నట్టిది కానీ బ్రహ్మసమాజం మాత్రం సామాజిక పరిస్థితుల పరిపక్వత, చైతన్యం ప్రభావంవలన ఏర్పడినట్టిది. "బహురూపమైన ఈ వ్యవస్థలో బ్రిటిష్ వారు తమ స్వార్థం కొరకై చిన్న యాంత్రిక విప్లవం కలిగించిన ప్రభావం మూలంగానే బ్రహ్మసమాజం ఆవిర్భవించినది...." (పై వ్యాసమే)

భావకవిత్వమైనా బ్రహ్మసమాజమైనా యూరప్‌లో వచ్చిన పారిశ్రామిక విప్లవం, ఫ్రెంచి విప్లవం ప్రభావం వలన పాశ్చాత్యదేశాల్లో వచ్చిన కాల్పనికవాద ఉద్యమం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం, సమానత్వాల కోసంతపన, భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనం (రినైజాన్స్) ప్రేరణతో వచ్చినవే. భారతదేశంలో వీటిపై జాతీయోద్యమ, సంస్కరణవాద ఉద్యమ ప్రభావాలున్నాయి. ఫ్యూడల్ సంస్కృతికి, విలువలకు వ్యతిరేకంగా బూర్జువా వర్గం చేసిన తిరుగుబాటు ప్రభావం వీటిపైవుంది. సాంఘికాచారాల్లో సన్యాసుల్కాల వ్యతిరేకత, విశ్వాసాల్లో తోకచుక్కను అరిష్టమనుకునే మూఢవిశ్వాస నిరసన, ఫ్యూడల్ భాషా అధికారాన్ని గుప్పిట్లో పెట్టుకున్న గ్రాంథిక భాషను, మార్గపద్ధతిని వ్యతిరేకించి వాడుకభాష, జానపద ఛందస్సులను ఉద్యమంగా స్వీకరించుట, దేశాన్ని ఆరాధనీయమైన మట్టి ముద్దగా కాకుండా జాగృత పరచవలసిన (ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడు నోయ్) మనుషులుగా గుర్తించే సామాజిక స్పృహ - ఇవన్నీ ప్రగతి శీలమైనవే.

ఆధునిక యుగంలో అభ్యుదయమంటే సామ్యవాద సమాజలక్ష్యం అని అర్థం. సామ్యవాద సమాజం వర్గపోరాటం ద్వారా కాకుండా శాంతియుత పరివర్తన ద్వారా, వర్గ సామరస్యం ద్వారా ఏర్పడుతుందని 'అభ్యుదయ' వాదులు భావించడం ప్రారంభించాక ఇంత అమాట కూడ ఆచరణలో తన అర్థాన్ని కోల్పోయింది. వర్గ పోరాటంద్వారా, విప్లవం ద్వారానే సామ్యవాద సమాజం ఏర్పడుతుందని 'అభ్యుదయ' వాదుల నుంచి వేర్పడి విస్పష్టం చేయాల్సిన చారిత్రిక అవసరం విరసం ఆవిర్భావానికి కారణమైంది. 'అభ్యుదయ' వాదులు 'శాంతియుత పరివర్తన'కు 'వర్గసామరస్యా నికి' రాజీపడిన కాలంలోనే అంటే మరీ ముఖ్యంగా 1956 - 66 దశాబ్దంలో ఏర్పడిన స్తబ్దతను, కృత్రిమ విలువలను బద్దలుకొట్టి ప్రశ్నిస్తూ 'దిగంబర కవిత్వం' ఆవిర్భవించింది.

ఒక తప్పుడు ధోరణిని సరిదిద్దడానికి తలయెత్తేవాదంలో పెడధోరణి అంతర్ గర్భితంగా వుండే అవకాశముంది. అందుకే సమాజంలో వున్న కృత్రిమ విలువలతో పాటు సకల విలువల్నీ విధ్వంసం చేసే విపరీత ధోరణికి దిగంబర కవులు పోయారు. దిగంబరకవులు రోగగ్రస్త శిశువులుకాదు. ఈ 'కుష్ఠు వ్యవస్థ'ను నిర్మూలించడానికి పూనుకున్న కమెండోలు, సంక్షోభం లేకుండా 'ధ్వంసరచన, హింసనచణ' లేకుండా నూతన వ్యవస్థను, విలువల్ని నిర్మించలేం. విప్లవ సాహిత్యోద్యమ ఉదయానికి పూర్వపు ఉషఃసంధ్య- దిగంబర కవిత. దిగంబర కవిత చెప్పింది నైరాశ్యంకాదు.

తిరుగుబాటు. ఆ తిరుగుబాటుకు సిద్ధాంతబలం లేని మాట నిజమేకానీ నిజాయితీతో కూడిన ఆగ్రహం (righteous anger) బహుశా 'మహాప్రస్థానం' గీతాల తర్వాత దిక్‌లలోనే వుంది. వికృతంగా వున్నది ఈ అసమవ్యవస్థ ఈ వ్యవస్థను కుష్ఠువ్యవస్థ అని అసహ్యించుకున్న దిగంబర కవిత కాదు; ఈ వ్యవస్థతో రాజీపడిన, ఈ దోపిడీ వ్యవస్థలో అభ్యుదయాన్ని చూస్తున్న అరసం ఇవాళ రోగగ్రస్త శిశువు- అందుకే నిజాంపాదుషాకు ఖబడ్దార్ చెప్పిన 'వజ్రాయుధం' మళ్ళీ సాహిత్య ఇందిరిత్వాన్ని పొగడుతున్న ఫ్యూడల్ విలువల్లోకి కూరుకపోయినా ఆ సంస్థ అధ్యక్ష స్థానానికి అర్హంగానే వున్నది.

మార్గకవిత జానపద కవిత కన్న ఉన్నతమైన దనడంలోనూ విశ్వనాథపై గురజాడ ప్రభావం వుందని చెప్పడంలోనూ, శ్రీశ్రీలో వున్నది కేవలం పదగుంఫన, భావవిన్యాసం అని చెప్పడంలోనూ సో.సు. ప్రజాసాహిత్యం పాలకవర్గ సంస్కృతిపై చేసే పోరాటంలో తాను ఏపక్షం తీసుకున్నాడో స్పష్టంగానే చెప్పుకోగలిగాడు.

'నైరాశ్యం విప్లవ కవితకు ప్రేరణ కాకూడదు-' 'నైరాశ్యం వల్ల విప్లవాలు రావు.' ఈ ఉపదేశంతో పేచీలేదు.

నైరాశ్యం కాదు నక్సల్బరీ - విప్లవ కవితకు ప్రేరణ, నైరాశ్యంవల్ల కాదు నక్సల్బరీ పంథావల్లనే విప్లవాలు వస్తాయని సో.సు. గ్రహించడానికి నిరాకరించినా విరసం ప్రణాళికలో గానీ, రచనల్లో గానీ వున్నది ఎక్కడా నైరాశ్యం కాదు. సైద్ధాంతిక ఆవేశం. అణచివేత తిరుగుబాటుకు దారి తీస్తుందని విరసం హెచ్చరిస్తున్నది. కానీ చివరకు శ్రీశ్రీ జట్కావాలా చెప్పింది కూడ నైరాశ్యం కాదు. 'జట్కావాలా'ది తెగింపు. ఈదేశంలో జట్కావాలాలు, రైతులు, కార్మికులు నైరాశ్యం నుంచి, బాధలు, దుఃఖంనుంచి విముక్తి చెందడానికి విప్లవంలోకి వెళ్లారు. ఆ నైరాశ్యాన్ని నిరాకరించడం ఈ సమాజం దోపిడీ స్వభావాన్ని నిరాకరించడమే. అందుకే అనివార్యంగా సో.సు. విప్లవ వ్యతిరేకి కూడ అయ్యాడు.

'జట్కావాలా'కు చైతన్యం పుస్తకాల నుంచి, చరిత్ర పరిశీలన నుంచి వచ్చింది కాదు. స్వంత అనుభవం నుంచి వచ్చింది. 1934లో శ్రీశ్రీ కుటుంబ జీవితంలో ఎదుర్కొన్న ఆర్థిక సంక్షోభం, ఇరవయ్యోశతాబ్దపు మూడో దశాబ్దంలో ప్రపంచం ఎదుర్కొన్న ఆర్థిక మాంద్యాన్ని అర్థం చేసుకోవడానికి బాగా దోహదం చేసింది. తన ఆకలిగానీ ప్రపంచ ఆకలిని ఆకళింపు చేసుకోవడానికి అద్దం పట్టదు. అందులో నైరాశ్యం లేదు. అనుభవం వుంది.

అయినా చారిత్రిక పరిశీలన చేసినప్పుడు శ్రీశ్రీ 'నిన్నటి జట్కావాలా'యే కాదు, ఆయన 'ఝంఝ' కూడ విరసం మానిఫెస్టోను మలచుకోవడానికి ఉత్తేజం కాదు. ఆ రెండు కవితల్లోనూ శ్రీశ్రీపై నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట ప్రభావాన్ని విరసమూ, విప్లవోద్యమమూ గర్వకారణంగా స్వీకరిస్తూనే వానిలోని లోపాలను కూడ విమర్శనాత్మకంగా ఎత్తి చూపాయి. ఆ వివరాల కోసం కాదీ వ్యాసం. అయితే ఆ రెండిట్లోనూ వున్నది నైరాశ్యం కాదని మాత్రమే సో.సు.కి జవాబు. అట్లాగే విరసం మానిఫెస్టో నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రభావంతో రూపొందింది కానీ 'జట్కావాలా'తో కాదని సో.సు.కి జవాబు.

విరసం మానిఫెస్టోలో మార్క్సిజాన్ని శాస్త్రంగానే కాకుండా శస్త్రంగా ఆమోదించి స్వీకరించడముంది. ప్రజల వర్గ పోరాటాలకు, వర్గ పోరాటాలకు దోహదం చేసే అన్నిరకాల పోరాటాలకు సంఘీభావముంది. అంతర్జాతీయ కార్మిక దృక్పథాన్ని, శ్రామిక ఐక్యతను బలపరచడముంది. సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యవస్థకూ, సంస్కృతికీ వ్యతిరేకంగా నూతన ప్రజాస్వామ్య వ్యవస్థా, సంస్కృతీ నిర్మాణాల కనుకూలంగా పోరాటం విరసం ధ్యేయం, కర్తవ్యంగా నిర్వచించుకోవడం వుంది. ఇందులో నైరాశ్యం ఎక్కడుందో సో.సు.కే తెలియాలి.

కనీసం తేదీలవారీ తెలివితో వేరీజువేసినా 1970 జులై 4న హైదరాబాదులో విరసం ఏర్పడి మానిఫెస్టో విడుదల చేసిన నాటికి శ్రీశ్రీ 'జట్కావాలా' గీతంగానీ 'ఝంఝ' గానీ రాయలేదు. సామాజిక నేపథ్యంలో నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలు, సాహిత్య నేపథ్యంలో దిగంబరకవుల మూడవ సంపుటం, తిరుగబడు కవులు, శ్రీశ్రీ షష్టిపూర్తి, విశాఖ విద్యార్థుల సవాల్‌లతో పాటు అభ్యుదయ సాహిత్యవేదిక తలపెట్టిన శ్రీశ్రీ సన్మానం నాటికి విరసం ఏర్పడడానికి యువశక్తి తెచ్చిన చారిత్రిక ఉత్తేజం - ప్రభంజనం, విద్యుల్లత పత్రికలు, వివిధ కరపత్రాలు, 'మార్చ్' కవితా సంకలనం విప్లవ రచయితల మనస్సుల్లో మసలిన ఉత్తేజం.

కనుక సో.సు.కు విరసం ఏర్పడడం - అది విప్లవయుగం డిమాండ్ చేసిన మానిఫెస్టో మలచుకోవడం 'దుఃఖభాజనమైన' విషయమై వుంటుంది. అందుకు విరసం చేయగలిగిందేమీలేదు. సో.సు.కు విరసం చెప్పగలిగిందల్లా విరసం మానిఫెస్టోను చూస్తూ దుఃఖభోజనం చేస్తూ ఆయన నైరాశ్యంలో ఇలాంటి రచనల్లో విరసంపై విషం కక్కుతున్నా ప్రజా పోరాటాలతో ప్రజా సాహిత్యం పదునెక్కక మానదు.

— సహదేవ్

విరసం ఏడవ మహాసభలు

సాహిత్య విమర్శ - ప్రసంగ వ్యాసాలు



తిరుపతిలో 1979 సెప్టెంబర్ 29, 30, అక్టోబర్ 1న జరిగిన
విరసం 7వ మహాసభల ప్రేక్షకుల దృశ్యం

విరసం విజయవాడ కార్యవర్గ సమావేశం నవంబర్ 10, 11, 1979 నిర్ణయం మేరకు తిరుపతిలో సెప్టెంబర్ 29, 30, అక్టోబర్ 1, 1979 తేదీలలో జరిగిన ఏడవ మహాసభల ప్రసంగవ్యాసాలలో సాహిత్యవిమర్శకు సంబంధించిన ప్రసంగవ్యాసాలు సృజనలో ప్రచురిస్తున్నాం—



సాహిత్య విమర్శపై మరికొన్ని ప్రసంగ వ్యాసాలు
రాగల సంచికలలో ప్రచురించ గలం.

ఇదే సంచికలో ఇతర రచనలు :



విపరీతంగా పెరిగిన కాగితం ఖర్చు, పోస్టల్ ఖర్చులు, తదితర నిర్వహణ వ్యయభారం వల్ల సృజన సాధారణ సంచికల ధర రెండు రూపాయలకు పెంచుతున్నాం. సంవత్సర చందా యిరవైరూపాయలు. ప్రత్యేక సంచికల వెల ఆయా సంచికల ఖర్చునుబట్టి నిర్ణయించబడుతుంది. చందాదారులకు మాత్రం సంవత్సర చందా యిరవైరూపాయల్లోనే ప్రత్యేక సంచికలు కూడా వస్తాయి.

అయితే మామూలు సంచికలు యికనుంచి 64-70 పేజీల మధ్యన కాకుండా 80 పేజీలుంటాయి. పాతచందాదారుల చందారేట్లు 1980 జనవరి నుంచి యీ మేరకు సవరించబడతాయి. అనివార్యమైన యీ నిర్ణయాన్ని చందాదార్లు, పాఠకులు సహృదయంతో అర్థం చేసుకొని ఎప్పటివలెనే సహకరిస్తారని ఆశిస్తున్నాం—

'సాహితీ మిత్రులు',

# కవిసేన మానిఫెస్టో

నమ్మ

ఆధునిక కావ్యశాస్త్రంగా తనకుతానే పరిచయం చేసుకొంటున్న ఈ 'కవిసేన మానిఫెస్టో' కవులపార్టీ అనబడే దాని ప్రణాళిక.

ప్రాచీన భారతీయసాహిత్యంలోనూ; ప్రాచీన, ఆధునిక పాశ్చాత్య సాహిత్యం లోనూ, మార్క్సిస్ట్ సాహిత్యంలోనూ ప్రఖ్యాతి గడించిన వాడుగా Indian Languages Forum చేత పరిచయం చేయబడిన 'శేషేంద్ర' ఈ 'కవిసేన మానిఫెస్టో' రచయిత. ఇది కవిసేన కార్యార్థం రాయబడిందని మానిఫెస్టోలో రాయబడింది.

కవి - కవితాశిల్పం, కవికీ - సమాజానికీ వుండే సంబంధాలు ఈ రెంటిపై ఈ సంస్థ రూపొందించబడింది.

'ఆశయాలు - నియమాలు' అనే శీర్షికలో ఇది కవులపార్టీగా చెప్పబడింది.

ఈ దేశంలో ఒక గొప్ప వైజ్ఞానిక ఉద్యమం (Intellectual Movement) నిర్మించడం కవిసేన యొక్క కర్తవ్యంగా చెప్పబడింది.

దేశంలో నాలుగు మూలలా ముక్కలు ముక్కలుగా పడివున్న వైజ్ఞానిక వర్గాన్ని సంఘటితం చేయడానికి ఉద్యమించడమే కవిసేన ప్రధానలక్ష్యంగా మానిఫెస్టోలో చెప్పబడింది.

మానవసమాజ క్షేమంకోసం కవి నాయకత్వం అగ్రిగణ్యం కావాలి. ఈ వైజ్ఞానిక నాయకత్వాన్ని నెలకొల్పటానికి కవిసేన ముఖ్యంగా ఉద్యమిస్తుందని మానిఫెస్టోలోవుంది.

ఈ మానిఫెస్టో ప్రకారం - సర్వవిధ వైజ్ఞానిక తరగతులకూ ఏకైక ప్రతినిధి కవి. దేశంలోని అవినీతికరమైన రాజకీయ నాయకత్వాన్ని తిరస్కరించి, ఆలోచనా కార్యవిషయంలో స్వేచ్ఛను హరించే ఏ రాజకీయ పార్టీకీ బద్ధుడుగాకుండా, వైజ్ఞానిక నాయకత్వాన్ని నెలకొల్పాలని పోరాడుతుంది.

ఈ నాయకత్వాన్ని నెలకొల్పుకోవడానికి కవికి కవిత్వమనేది ఆయుధం.

ఆ కవితాయుధ ప్రయోగ విద్యారహస్యాలు తెలుసుకోడానికనీ, కవితా చైతన్యం చేసుకోవడానికీ అధునిక యుగంలో దిక్కు దిక్కులో మొదటి జెండా ఎగరెయ్యడానికి కవిసేనలు ఉదయించాలని కోరుకుంటున్నది.

ఆర్థిక సామాజిక సమస్యలవరకు ఈశతాబ్దం అంగీకరించిన మార్క్సిస్ట్ సిద్ధాంతాన్ని కనీస పరిష్కారంగా స్వీకరించాలను కుంటున్నది మానిఫెస్టో.

మార్క్సిజమనేది ఒక సమగ్రమయిన రాజకీయ, సామాజిక సిద్ధాంతం. ఒక సమగ్రమైనతత్వం.

కవిసేన మాత్రం ఆర్థిక, సామాజిక విషయాలమేరకే ఈ సిద్ధాంతాన్ని ఒప్పు కుంటుందట కానీ రాజకీయాల విషయంలో మాత్రం ఒప్పుకోదట. ఆర్థిక, సామాజిక విషయాలు రాజకీయాల్నుంచి ఎట్లా విడిగా వుండగలుగుతవో; ఎపుడయినా, ఏ సమా జంలోనైనా అది సాధ్యమయ్యిందో శేషేంద్ర వివరించలేదు. రాజకీయాలే ఆ సమాజం లోని ఆర్థిక, సామాజిక, సంస్కృతులను నిర్ణయిస్తవి.

శేషేంద్రది అశాస్త్రీయ అవగాహన. మార్క్సిజానికి వ్యతిరేకమైన అవగాహన, ఈ అవగాహనే కవిసేన మానిఫెస్టోకు పునాది.

'కవిసేన' అనేది కవులపార్టీగాబట్టి ప్రతి కవీ అపార సాహితీ అధ్యయనం చెయ్యాలిట ఒకచోట శేషేంద్ర ఇట్లా రాస్తాడు (పేజి 190) 'మూర్ఖులమాట వినకండి. ఇంగ్లీషులో సమస్త ఆధునిక కాలమూవుంది. సంస్కృతంతో సమస్త ప్రాచీన కాలమూ వుంది. ఈ రెంటినీ కలిపి దేశకాలా విచ్ఛిన్న మానవ సర్వస్వాన్ని దర్శించుకోవాలి జ్ఞాని అయిన కవి.' ఇది చదవని కవికి శేషేంద్ర అర్థంకాడు. శేషేంద్రను అర్థంసుచేకోనని రచయితలంటే ముఖ్యంగా తెలుగు రచయితలంటే అతనికి మహాచిరాకు. అట్లాంటి వాళ్ళను ఆయన కవి బచ్చాలు లేక కవి లుచ్చాలంటాడు.

కవిత్వం (రూపము - విషయము) Form–Content విషయం గూర్చిరాస్తూ ఈ దరిద్రపు వస్తువుమీద దృష్టిసారించాలి– ఏది చెప్పాలి అనేవిషయం విసర్జించి ఎలా చెప్పాలి అనే విషయాన్ని గురించి చర్చించింది– యింతవరకు వచనకవిత పేరుతో వచ్చిన మురికి కాలువని మూసీలోతిప్పి మీరు గంగవైపు తిరగండి అంటాడు. అంటే వస్తువు కంటె రూపానికే ప్రాముఖ్యాన్నివ్వడం, పట్టించుకోవడం. ఇది యిప్పటి రచయితలు వదిలేసిన కాల్పనికత, వైయక్తిక, అనుభూతి వాదాలు మిస్టిసిజమ్‌కు మొదలైన వాటి వైపుకి పోవడానికే.

శేషేంద్ర సనాతన సాహిత్యాన్ని, ఫ్యూడల్ సంస్కృతిని బాగా జీర్ణించుకున్న కవి. ఈ మానిఫెస్టోలోనూ, అనేకసార్లు అసందర్భంగానే బోదిలేర్, రెంబో, ఎడ్గార్ అలన్‌పో, వర్డ్స్‌వర్త్, ష్పెర్పాన్, లెనిన్, మావోలాటి రచయితల రచనల నుండి ఉదహరించడం జరిగింది. సందర్భం లేకుండా కోట్ చెయ్యడం, తను రాసిన అభిప్రాయాలకు అతికేట్టుగా తప్పుడుగా ఉదహరించడం (మిస్‌కోట్ చెయ్యడం) కన్పిస్తుంది. చాలాచోట్ల తాను రాసిన గొరిల్లా, మండే సూర్యుడులాటి పుస్తకాల నుంచి 'ప్రామాణికత'కోసమన్నట్లు కొన్ని వాక్యాలు కోట్ చేయడం జరిగింది. ఇవన్నీ పాఠకుడికి శేషేంద్రకు అపారజ్ఞానమున్నట్లు అపోహ కలుగజేయడానికే పనికొస్తవి. ఇక సామాజిక చైతన్యం గూర్చి మాట్లాడితే – 'సామాజిక చైతన్యం' మనకవసరంలేదు. సామాజిక చైతన్యమనేది వుండదనీ రచయితకు కావాల్సింది సాహిత్య చైతన్యమనీ చెప్తాడు శేషేంద్ర.

ఇక కమిట్‌మెంట్ విషయంలో ప్రతికవికీ కమిట్‌మెంట్ మంచిదని సర్టిఫికెట్ యిస్తాడు. ఉత్తమ ప్రయోజనానికి కమిట్ కావాలంటాడు.

'విశ్వశ్రేయస్సే కావ్యానికి ఉత్తమ ప్రయోజనం కాబట్టి దానికే– విశ్వ శ్రేయస్సుకే– కమిట్' కావాలంటాడు. (పేజీ 197)

ఉన్నవాళ్ళు – లేనివాళ్ళుగా విశ్వం రెండుగా చీలివున్నపుడు, ఒకరి ప్రయోజనాలు మరొకరికి విరుద్ధమైనపుడు ఈ రెండు విశ్వాల్లో దేనికి కమిట్ కావాలో వివరించలేదు శేషేంద్ర. వర్గ సమాజంలో విశ్వశ్రేయస్సుకు కమిట్ కావడమంటే దోపిడీ వర్గాలకు కమిట్ కావడమే!

'కళ కళకోసం' అనే విషయాన్ని ప్రస్తావించేటపుడు, 'కళ కళకోసం' అనే వాదాన్ని వ్యతిరేకిస్తూనే, కళ కళకోసమే అని చెప్పే ప్రయత్నంచేస్తాడు. ఇట్లా శేషేంద్ర మానిఫెస్టోను చెప్పినా, కవిత్వంలో వస్తువు దృష్ట్యా చెప్పినా, కళ కళ కోసమేకాదు అని చెప్పినా ఇవన్నిటికీ శేషేంద్ర వివరణ దొంక తిరుగుడుగా వుంటుంది. రూపము–వస్తువు, రూపానికి ప్రాముఖ్యత కమిట్‌మెంట్‌లో విశ్వశ్రేయస్సు, కళ కళకోసమే అనేవాదాల్లో సృష్టించిన గందరగోళం మార్క్సిజాన్ని పట్టి ఆర్థిక, సామాజిక సిద్ధాంతంగా (సాధ్యమైతే) ఉపయోగించడమనేవి అభ్యుదయాంశాలు కావు. పైగా విప్లవానికి హానికలిగించేవి.

శేషేంద్రకు సనాతన సాహిత్యపఠనం, ఆంగ్ల సాహిత్యపఠనం, వేదాల దగ్గర్నించీ చేగువెరా దాకా కోట్ చెయ్యడానికి వున్న అనుకూలమయిన శక్తి ఆయన

అవగాహనా లోపాన్నీ, సిద్ధాంతానికి సంబంధించిన అజ్ఞానాన్నీ కప్పిపుచ్చుకోవడానికే పనికి వస్తుంది. తను ప్రబోధించే ఆచరణ రహితమైన పట్టి అపారపఠనం ప్రయోజన మంతే.

అయన అశాస్త్రీయ సూత్రీకరణలు ఉదాహరణకు కొన్ని వాక్యాలు

1. కవిత్వానికి పుట్టిన నానారూప సంతానంలో రాజకీయాలు ఒకటి. కవిత్వం లేక పోతే రాజకీయాలు లేవు
2. కవి చైతన్యమే సమాజంలో కార్యానికి నాంది. గనక, మానవ సమాజంలో మార్పునకు హేతువు గనక కవి ఒక్కడే మానవ సమాజానికి ఏకైక నాయకుడు.
3. సమాజంలో ఎక్కువ మంది అజ్ఞానులు, అల్పజ్ఞానులు; కవి మాత్రమే జ్ఞాని కనక ఎప్పుడూ కవిలోంచే చైతన్యం ప్రజల్లోకి వస్తుంది.

కవి చుట్టూ తిరిగే మానిఫెస్టోలో కన్పించే అంశాలు ఎక్కువ యిట్లాంటివే.

ఈ సమాజాన్ని మార్చాలనుకున్నవాడైతే, నూటికి 90 శాతంగావున్న వ్యవసాయదారుల, కార్మికుల, ఉద్యోగస్తుల ప్రస్తావన తీసుకురాడు మానిఫెస్టోలోకి. 90 శాతం ప్రజల ప్రస్తావనలేని మార్పు ఆయనొక్కడికే తెలువాలి.

ప్రపంచ విప్లవాల గూర్చి కూడా తప్పుడు అవగాహన– రష్యాలో విప్లవ విజయం గూర్చి చెబుతూ, "రష్యా అదృష్టమంతా ఎక్కడుందంటే, విప్లవానికిముందు మహాద్రష్టలైన రచయితలు పుట్టారు రష్యాలో. లెనిన్ ప్రభృతులు ఆ పుస్తకాలకు పుట్టిన నాయకులే" అంటాడు.

లెనిన్ ప్రభృతులపై ఆ రచయితల ప్రభావం వుండొచ్చేమో కాని, విప్లవం మొత్తమంతా కేవలం పుస్తకాలవల్ల వచ్చిందనేది- అపరిపక్వ జ్ఞానంతో, మూర్ఖత్వంతో కూడిన వాదన.

రష్యాలో విప్లవమొస్తే మరి మన ఖర్మ ఏమిటీ యింకా యిలా ఏడుస్తున్నాం అంటూ ఏడుస్తాడు 'శోకం కవికి ప్రధానం' అని సూత్రీకరించిన శేషేంద్ర. ఇవ్వాళ ఈ శేషేంద్ర యింతటి ఘోరమైన అవగాహనతో తన చాలా పుస్తకాలలో నెత్తుర్నూ, కొడవళ్ళను, సూర్యుళ్ళను అడవినీ ప్రతీకలుగా తీసుకొని, తనదంటూ ఒక కొత్త సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టి తపనలో కొత్త రచయితల్ని విప్లవకారుడి పోజుతో మోసం చేస్తూ సాహితీ రంగంలో విప్లవ ప్రతిఘాతకులకుపయోగపడే

గందరగోళాన్ని సృష్టిస్తున్నాడు. శేషేంద్రశర్మ హిపోక్రసీ ఎంతో జాలి కలిగించేలా వుంటుంది. ఒక చోట 'అరే అందరికీ తిండి బట్ట లేకపోతే యిక ఈ కవిత్వ మెందుకురా? ఈ నాగరికత ఎందుకురా? ఈ సంస్కృతి అర్థం ఏమిటిరా - అరే తగులబెట్టండిరా ఈ కాలేజీల్ని పుస్తకాల్ని' (పేజి 255) అంటూ విశృంఖలత్వం (అనార్కిజం) చెప్పే శేషేంద్రలో వున్న గందరగోళాలు వైరుధ్యాలు చెప్పలేనన్ని.

పుస్తకాల షాపుల్లోకి శేషేంద్ర కుప్పలుగా చేర్చుతున్న యిట్లాంటి సాహిత్యం పట్ల రచయితలు పాఠకులు జాగ్రత్తగా వుండాలి.

ఇట్లాంటి అశాస్త్రీయావగాహనతో, అసమగ్ర అవగాహనతో రాస్తున్న యితడు రెవల్యూషనరీ కాదు విప్లవ ప్రతిఘాతకులకు ఉపయోగపడే రచయిత, శేషేంద్ర కుహనా విప్లవముసుగును ప్రజాసాహిత్య పరులు చించెయ్యాలి.

ఇవ్వాళ వస్తున్న, యింకా ముందుముందు విశృంఖలంగా సోషలిజం పేరిట విప్లవం పేరిట రాబోయే సోషలిస్ట్ వ్యతిరేక, విప్లవ వ్యతిరేక సాహిత్యం పట్ల మనమంతా అప్రమత్తంగా వుండాలి.

సామ్రాజ్యవాద సంస్కృతి ప్రతిబింబించే డిటెక్టివ్ సాహిత్యం, సెక్స్ సాహిత్యం, అనుభూతి, వైయక్తిక, సర్వవిధ్వంసక వంటి రకరకాల వాదాలకన్నా విప్లవం పేరవచ్చే, విప్లవ వ్యతిరేక సాహిత్యమే అత్యంత ప్రమాదకరమైనది.

ఇట్లాంటి సాహిత్యసృష్టి నాయకత్వాన్ని శేషేంద్ర చేపడుతున్నాడు.

కాబట్టి యివ్వాళ్టినుంచీ సాహిత్యరంగంలో అత్యంత ప్రమాదకరమైన ధోరణి, తీవ్రంగా ప్రతిఘటించాల్సిన ధోరణి విప్లవం పేర గుప్పించే విప్లవ వ్యతిరేక సాహిత్యం. అందులో భాగంగా కవిసేన సాహిత్యం-

---

తాను గుంటూరు శేషేంద్రశర్మ లాంటి వారికి కితాబు లిస్తున్నానని వచ్చిన విమర్శలను ఖండిస్తూ "శేషేంద్రశర్మను నేను బురద మీద కోకిల అన్నాను. He is Steeped in bourgeois culture (ఆయన బూర్జువా సంస్కృతిలో కూరుకు పోయివున్నాడు)" అని అన్నారు మహా కవి శ్రీశ్రీ -

(విరసం ఏడవ మహాసభలలో, తిరుపతి, 79 సెప్టెంబర్ 29)

# ఇటీవలి 'అభ్యుదయ' విమర్శ - కొన్ని పెడధోరణులు

వి. చెంచయ్య

వ్యక్తిగత రాగద్వేషాలకతీతంగా వుండి, సామాజిక ప్రయోజన దృష్ట్యా రచనల్ని పరిశీలించేది అభ్యుదయ విమర్శ అవుతుంది. తన మనసులో ముందే యేర్పడివున్న కొన్ని అపసవ్యపు సిద్ధాంతాల వెలుగులో చేసేది అభ్యుదయ విమర్శ కాదు. ఇటీవలి కాలంలో అరసానికి చెందిన 'అభ్యుదయ' విమర్శకుల విమర్శలోని అనభ్యుదయ ధోరణుల్ని రేఖా మాత్రంగా చూపడమే ఈ వ్యాస లక్ష్యం.

అభ్యుదయ విమర్శకుల్లో శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డిగారు (రా.రా) ప్రముఖులు. వీరి విమర్శలోని పెడ ధోరణులివి:

వస్తువుకు మాత్రమే విలువ యిచ్చి శిల్పాన్ని నిర్లక్ష్యం చెయ్యరాదు. శిల్పం వల్ల అనుభూతి కలుగుతుంది. అనుభూతుల ద్వారానే సాహిత్యం మన సంస్కారంలో మార్పు తెస్తుంది. చదవడానికీ, వినడానికీ యీ మాటలు బాగానే వున్నాయి. సాహిత్యం అన్న తర్వాత శిల్పం వుండి తీరాలి, కనీసపు శిల్పం లేనిదాన్ని సాహిత్యంగా గుర్తించం. శిల్పం సాహిత్యానికి స్వభావ సిద్ధమైన గుణమేగాని, ప్రయోజనం కాదు. ఒక రచనలో సామాజిక ప్రయోజనం వుండాలా, అక్కర్లేదా అని చర్చించవచ్చుగానీ, శిల్పం లేక అనుభూతి వుండాలా, వద్దా అనే చర్చ అర్థ రహితం. సాహిత్యంలో అనుభూతి వుండాలని అదే పనిగా చెప్పడం అనవసరం. ఈ విషయంలో అనుభూతివాదాన్ని సాహిత్యరంగంలోకి బలవంతంగా ఈడ్చుకొచ్చిన ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, ఇస్మాయిల్ లాంటి వాళ్ళకూ, 'అభ్యుదయ' విమర్శకుడు రారాకూ తేడా యేమిటో నాకు తెలియడం లేదు. శిల్పం, అనుభూతుల వల్లనే సంస్కారం రాదు. రచయిత భావాల వల్లనే సంస్కారం వస్తుంది. ఆ సంస్కారం యెంత బలంగా వున్నదీ నిర్ణయించేది శిల్పం లేక అనుభూతి కావచ్చు.

విప్లవ సాహిత్యకారులు రాజకీయాలకు యిచ్చిన విలువ శిల్పానికి యివ్వక పోబట్టే వాళ్ళు చెప్పుకోదగిన సాహిత్యాన్ని సృష్టించలేక పోయారట! యీ విమర్శ చేస్తున్న రా.రా.గారు విప్లవ సాహిత్యాన్ని చూడకనైనా పోయుండాలి. లేదా కావాలని చేస్తున్న కువిమర్శ అయినా అయివుండాలి. విప్లవ రచనల్లో లోపాలులేవని నేను చెప్పడంలేదు. వారి రచనలకవసరమైన శిల్పం వారికుంది. విషయం దృష్ట్యా చూస్తే రాజకీయాలకు ప్రాధాన్యం యిచ్చిన మాట వాస్తవమే. ఏం? రాజకీయాలతో సంబంధం లేకుండా జీవితాలున్నాయా? మరి యీ జీవితాలతో సంబంధంవున్న

సాహిత్యంలో రాజకీయాలుండడం నేరమా? రాజకీయాల్నంటకుండా మడిగట్టుకొని "పవిత్ర"మైన సాహిత్యాన్ని సృష్టించాలా? శాస్త్రీయమైన దృక్పథంతో, ఆర్థిక సామాజిక విషయాలకన్వయించి రాజకీయాల్ని చెప్పి, ప్రజల్ని విద్యావంతుల్ని చెయ్యకపోతే ఆ సాహిత్యం ఎందుకు?

రా.రా.గారి దృష్టిలో గురజాడ తర్వాత ఆధునిక రచయితలు ఇద్దరే – కొడవటిగంటి కుటుంబరావు, చలంగార్లు. యీ నిర్ణయానికి పడికట్టు రాళ్ళేమిటో మరి! తెలుగు సాహిత్యాన్ని ఒక మలుపు తిప్పి, తరతరాల వారసత్వంగా వస్తున్న సంప్రదాయ చాదస్తపు తుప్పును వదలగొట్టిన శ్రీశ్రీ వీరి దృష్టిలో ఆధునికుడు కాడు! 'యజ్ఞం' లాంటి కథల ద్వారా అట్టడుగు జీవితాలకద్దం పట్టిన కాళీపట్నం రామారావు ఆధునికుడు కాడు! కవిత్వాన్ని జనంలోకి తీసుకెళ్ళి, జనం గుండెల చప్పుళ్ళనే కవిత్వంగా వినిపిస్తున్న చెరబండరాజు, వంగపండు, గద్దర్‌లు ఆధునికులు కారు! యెవరయ్యా మరి ఆధునికులు? వైవాహిక వ్యవస్థను తూలనాడి ఆచరణలో అర్థంగాని ప్రణయ స్వేచ్ఛను బోధించిన చలం, తనలోని తీవ్ర అసంతృప్తిని అరాచకంగా వ్యక్తం చేసిన చలం, మార్క్సిజం అవగాహన ఏ మాత్రంలేని చలం ఆధునికుడు! ఆధునికం అన్న పదానికే అర్థం మారిపోయిందా?

జీవితంలోగానీ, సాహిత్యంలోగానీ సౌందర్యాన్ని ఆస్వాదించగల శక్తి లేక పోవడం వల్లనే మార్క్సిస్టు విమర్శకులు భావకవిత్వం పట్లా, చలం పట్లా సానుభూతి చూపలేకపోయారని రారాగారు వాపోయారు. విరసాన్ని కేవలం రాజకీయ సంస్థగా చూసే రారాగారికి, విరసంపైన అనవసరంగా విరుచుకుపడే రారాగారికి భావకవిత్వం పైనా, చలంపైనా గాకపోతే యెంకెవరిపైన సానుభూతి వుంటుంది?

అగ్రవర్ణాలవారే మొదట యెక్కువగా ఆధునిక ప్రజాస్వామ్య భావాలకు గురైనారనీ, ఉత్తరాదిన రాజారామ్‌మోహన్‌రాయ్, దక్షిణాదిన కందుకూరి వీరేశలింగం జగమెరిగిన వుదాహరణలనీ అన్న రారాగారే మరొక చోట వీరేశలింగంగారికి ఆధునిక దృక్పథం లేనేలేదనడం పరస్పర విరుద్ధం. వితంతు వివాహాల్ని చెయ్యడానికి ధర్మశాస్త్రాల్ని వుటంకించాడు కాబట్టి వీరేశలింగం ఆధునికుడు కాడని వీరి వాదన. ధర్మశాస్త్రాల ప్రమాణం యెందుకు చూపవలసి వచ్చిందో ఆయనే స్వయంగా చెప్పు కున్నారు. అవి తన కోసంకాదు. ప్రాచీన శాస్త్రాల్ని గుడ్డిగా నమ్మేవాళ్ళకు వాళ్ళ శాస్త్రాలతోనే వాళ్ళ నోళ్ళు మూయించడానికి. ధర్మశాస్త్రాల ఆసరా వీరేశలింగంగారికున్న పరిమితి కూడా కాదు, ఒక యెత్తుగడ మాత్రమే.

సర్వ సాహిత్యానికి హృదయమే కేంద్రం. హృదయమే యితివృత్తం. హృదయమే హద్దు. యీ మాటలు చాలు రా.రా గారి 'హృదయం' తెలుసుకోడానికి. మన ఆలోచనలకూ, అనుభూతులకూ, ఆవేదనలకూ, సమస్త చైతన్యానికీ కేంద్రం యీ శరీరంలో ఒక్కటే - అదే మెదడు. రక్తప్రసారం చెయ్యడమే హృదయం పని. హృదయానికి ఆలోచన లేదు. ఆలోచనలేని హృదయం సాహిత్యానికి కేంద్రమా? ఆలోచనలేని హృదయాన్ని దాటి సాహిత్యం వుండజాలదా? యీ ధోరణి రారా పైనగల పాచీన ఆలంకారికుల ప్రభావాన్ని తెలియజేస్తుందేగాని, వారి అభ్యుదయ విమర్శ తీరును కాదు.

యీనాడు కొందరు రచయితలు చిత్తశుద్ధి లేకుండా 20 అంశాల సూత్రాలపై కవితలల్లుతున్నారని అరసం సభల్లో విమర్శకుని వేషంలో వున్న ఒకకవి ఉవాచ! యెవరీకవి? యెమర్జన్సీ పైశాచికపాలనలో యిందిరా గాంధీకి భజన చేసిన సి.పి.ఐ.కి అనుబంధంగా వున్న అరసంకవి గజ్జల మల్లారెడ్డిగారు! మరి కొంతమంది రచయితలు చంపు పొడు అంటూ యువకుల్ని అడవుల పాల్జేస్తున్నారట. యెవరోకాదు, విప్లవ రచయితలే. యువకుల్ని పోరాటంలోకి దించగలిగేట్టుగా విరసం రచనలు చేస్తున్న దంటే అందుకు విరసం గర్వపడాలి. విరసం తుప్పు పట్టిన తుపాకీ గొట్టం ద్వారానే సామాజిక పరిణామం కలుగుతుందని నమ్మిందని యేటుకూరి ప్రసాద్‌గారి విమర్శ. వీరి విమర్శను నేను అపార్థం చేసుకోవడం లేదు. తుప్పు పట్టినదాన్ని వద్దన్నారే గాని, తుప్పు పట్టని మంచి తుపాకీ గొట్టాన్ని వద్దనలేదుగా? యిందిరా గాంధీ ఫాసిస్టు ప్రభుత్వాన్ని ప్రజలు ఓటు ద్వారానే కూలదోశారు గదా, మరి విప్లవంగానీ, విప్లవ రచనలుగానీ యెందుకు? అని వీరి వుద్దేశం. ఓటుతో కూలిపోయిన ప్రభుత్వం మళ్ళీ ఓటుతోనే గద్దె నెక్కుతుందన్న సామాన్య పరిజ్ఞానం కూడా లేని యీ 'అభ్యుదయ' విమర్శకుణ్ణి చూసి జాలిపడుతున్నాను.

యిలా విప్లవ సాహిత్యాన్నీ, రాజకీయాల్నీ పనిగట్టుకుని విమర్శించడం 'అభ్యుదయ విమర్శ'లో ఒక ప్రధాన భాగమైంది.

ఫ్యూడల్ వ్యవస్థనూ, వర్ణాశ్రమ ధర్మాలనూ తిరిగి రావాలని కోరుకునే వారికి అరసంలో స్థానంలేదని అరసం సభల్లో అన్నారు డా॥ దాశరథిగారు. ఫ్యూడల్ వ్యవస్థనుప్రతిబింబించే ప్రభుత్వానికి కొమ్ముకాస్తూ, ఆస్థానకవి పదవిని చేబట్టిన వీరికి యీమాటనే నైతిక హక్కు లేదు.

వచనకవిగా పేరుపొందిన కుందుర్తి ఆంజనేయులుగారు వచన కవిత్వాన్ని యీసడించుకోనవసరం లేదనీ, మినీ కవిత్వాన్ని మాత్రం యీసడించుకోవాలనీ

## చరిత్ర పరిచయంలేని
## ఇంద్రగంటి శ్రీకాంతశర్మ 'సాహిత్య పరిచయం'

రాజేంద్రబాబు

ఇది సాహిత్య చరిత్రకు సంబంధించిన పుస్తకం. చరిత్రకారుడు ఇంద్రగంటి శ్రీకాంతశర్మ. 1875 నుండి 1975 వరకు గల వంద సంవత్సరాల తెలుగు సాహిత్యాన్ని పరిచయం చేయడం ఈ పుస్తకం ఉద్దేశ్యం. చరిత్ర చోదకులయిన ప్రజలను తెరమరుగున ఉంచి కొంతమంది వ్యక్తులే చరిత్రను సృష్టిస్తారన్న భావనను కలిగించే ప్రయత్నం చేస్తారు బూర్జువా చరిత్రకారులు. అలాగే సాహిత్య చరిత్రకారులు కొంతమంది సాహిత్యానికీ- సమాజానికి గల విస్తృత సంబంధాన్ని గుర్తించకుండా, సమాజంలో పురోగామిశక్తులను ప్రతిబింబించే రచనలకు ప్రాముఖ్యం ఇవ్వకుండా కళ - కళ కోసమే అన్న భావనకు దారి తీస్తారు. పిట్ట కథలు, కవుల రచయితల జనన మరణ తేదీలు, పుస్తకాలపట్టీలు, మినీ జీవిత చరిత్రలతో నిండిన ఈ పుస్తకం ద్వారా విమర్శకునిలో సాహిత్య - చారిత్రిక స్పృహను పెంచే ప్రయత్నం ఏమీచేయడు సరికదా సామాజిక చైతన్యాన్ని పక్కదారి పట్టించాలని తాపత్రయపడతాడు. ఇది పుస్తకంగా రూపాంతరం చెందకముందు ఆలిండియా రేడియో విజయవాడ ద్వారా నలభై వారాల పాటు సీరియల్‌గా ప్రసారమయి తర్వాత మార్కెట్లోకి వచ్చింది. రేడియోలు పత్రికలు బూర్జువా సాహిత్య విలువలను ఇలాంటి రచనలను పోషించడం ద్వారా కాపాడుతున్నాయి.

"ఆముఖం" పేరుతో ఈ విమర్శకునికి సర్టిఫికెట్ ఇచ్చిన వాడు సినారె. "రసదృష్టి", "సహృదయ విమర్శకులు" లాంటి పదాలు ఆయన చారిత్రిక దృష్టి

---

అంటున్నారు. తన కిష్టంలేని ఒక ప్రక్రియనే గుడ్డిగా కాదనడం,అందులో కవిత్వం వుండదనడం అభ్యుదయ దృక్పథం కాదు.

యేకాలంలో యేప్రయోజనాల్ని ఆధారం చేసుకొని యెలాంటి సాహిత్యం పుడుతుందో, అసలయిన విప్లవ సాహిత్యం ఒకవైపు వస్తూవుండగా, మరోవైపు నకిలీ విప్లవ సాహిత్యం యెందుకు పుడుతుందో, సమాజాన్ని గురించీ, సాహిత్యాన్ని గురించీ సరైన అవగాహన లేకుండా సాహిత్యవిమర్శకు దిగితే సాహిత్యానికీ, తద్వారా సమాజపురోగతికీ అపచారం చేసినట్లవుతుంది.

కవితల్లో మాత్రం సాయుధపోరాటాన్నీ, వర్గశత్రు నిర్మూలననూ తెలిసో, తెలియకో చెప్పి, విమర్శ వ్యాసాలలో నినాదరచయితలనీ, చంపు - పొడు అనడం కవిత్వం గాదనీ విప్లవ రచయితలపైన రాళ్ళు రువ్వుతూ ద్వంద్వ వైఖరిని ప్రదర్శించడం అరసంలోని 'అభ్యుదయ' విమర్శకులకే చెల్లింది!

లోపాన్ని కనబరుస్తాయి. ఈ పుస్తకంలో ఇవ్వబడిన సమాచారాన్ని ఎక్కడా విశ్లేషించడు, శాస్త్రీయదృక్పథంతో సంగతులను తడుమడు. పూర్తిగా హేతువాదానికి నిలువలేని వాక్యాలు సుందరంగా రాయాలని ఉబలాట పడతాడు. "సమకాలీనులను గురించి అంచనా కట్టవలసింది సమకాలీనులు కాదు; రానున్న తరాలవారు" అంటూ ఇందులో ఓ సిద్ధాంతాన్ని ప్రవేశపెట్టాడు ఆయన. ఇలా అభిప్రాయం వెలిబుచ్చి మళ్ళీ అందులోనే "శ్రీశ్రీ సంపూర్ణ సాహితీమూర్తి మహాప్రస్థానంలో కనిపించినంతగా తదితర సంపుటాలలో కనిపించదు" అని ఇంద్రగంటి శ్రీకాంతశర్మ తన సమకాలీనుడైన శ్రీశ్రీని గురించి అభిప్రాయం ప్రకటిస్తే దానికి కితాబు ఇచ్చాడు. నిజానికి ఈనాటి సాహిత్యం ఎలా ఉండాలో నిర్ణయించేది ఈనాటి ప్రజలే. సాహిత్య విలువలను అంచనా కట్టవలసింది సమకాలీన న్యాయమూర్తులే. సమకాలికులు మాత్రమే రచయిత కృషిని సజీవంగా అర్థం చేసుకోగలరు. సాహిత్య చరిత్రను - సాహిత్య విమర్శను విడదీయకుండా ఈ రెండింటి సంబంధంలోంచి ఈనాటి సాహిత్యం కోసం ఈనాటి విమర్శ పుట్టుక వస్తుంది. సాహిత్యంతోపాటు విమర్శలో కూడా మార్పులు వస్తుంటాయి.

టి.ఎస్. ఇలియట్ వాక్యాలు ఆసరాగా తీసుకుని ఓ అశాస్త్రీయమైన సిద్ధాంతాన్ని కూడ ఇందులో సినారె చేసారు. పేరున్నవాడు ప్రతిపాదించింది ప్రతీది కరెక్టే అనే భావదాస్యానికి ఇదీ చిహ్నం. కవులను, కళాకారులను పరిమితంగా అంచనాకట్ట వీలులేదని, గత కాలపు కవులు, కళాకారులతో బేరీజులేసి గాని వారికి విలువల నాపాదించ వద్దని టి.ఎస్. ఇలియట్ వాదం. దీన్ని సినారెగారు మెచ్చుకున్నారు. ఈ ఆలోచన ప్రకారం భూతకాలపు కవులే వర్తమానకాలపు విమర్శకు ప్రమాణం. చచ్చిపోయిన కళాకారులే వర్తమాన కవులకు, కళాకారులకు మార్గదర్శకత్వం వహించాలి. ఇంకాస్త లోతుగా ఆలోచిస్తే సమకాలీన సమాజాన్నుంచి కవులు పొందాల్సిన ఆవేశాన్ని, స్ఫూర్తిని మరుగున పడేస్తుందీ సిద్ధాంతం. ఇది పూర్తిగా తిరోగమన వాదం. ప్రాచీన కవుల కవిత్వానికి చారిత్రిక ప్రయోజనం మాత్రమే ఉంటుంది. వర్తమాన సమాజమే సజీవ శక్తి. అదే కళాకారులకు మార్గదర్శి. తమ చుట్టూ వున్న సమాజం నుంచే కవులు ప్రేరణ పొందుతారు. అందులో ఒక వర్గం కోసం రచన చేస్తారు. సమాజంలో జరుగుతున్న విషయాలపట్ల తన ఇష్టతనో, అయిష్టతనో వ్యక్తపరుస్తాడు రచయిత తన రచనలలో. కవులలో స్థలకాల అధీనంగా ఉండే అంశమే పరిశీలనాంశం. గత కాలానికి చెందిన కవులను ప్రామాణికంగా తీసుకోవడం అంటే పాత సాహితీ విలువలను సలక్షణంగా కాపాడుకోవడం అని అర్థం.

సమాజం మారుతూ వుంటుంది. ఆ మార్పుకు అనుగుణంగా సాహితీ సంప్రదాయాలు కూడా మారుతూ వుంటాయి. ఎల్లప్పటికీ శాశ్వతంగా నిలిచే రచనలు చేయాలనుకునే వారు గతించిన కవుల అడుగుజాడల్లోనే నడవాలని ప్రయత్నిస్తారు- ప్రపంచంలో జరుగుతున్న మార్పులను పట్టించుకోరు.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ పుస్తకం అంతా సాహిత్య అవకాశవాదం కొట్టొచ్చినట్టు కన్పిస్తుంది. తనకు తెలిసింది ఎంతో తనకు తెలియదు; తెలిసిన దానికంటె ఎక్కువే రాస్తున్నా నన్న స్పృహ లేదు; కవిత్వం, కథానిక, నవల, నాటకం, జానపద సాహిత్యం, విమర్శలాంటి విభాగాలుగా విభజించుకొనడం సూత్రబద్ధంగానూ, స్పష్టంగానూ ఉంటుంది. అట్లాకాకుండా కలగాపులగంగా వ్యక్తులను గురించి రాస్తూ పోయాడు.

"సాహిత్య హృదయం ఆవిష్కరించడం విమర్శకుడి పని" అంటూ విమర్శకుడికి ఒక పని నిర్దేశించాడు శ్రీకాంతశర్మ. దీని అర్థం ఏమైనా, సామాజిక సంఘటనలు కవులను రచయితలను ప్రభావితం చేస్తాయన్న సత్యాన్ని మాత్రం ఆయన అంతగా పట్టించుకోరన్నది ఈ పుస్తకం ద్వారా స్పష్టం. ప్రతి కవికీ నాలుగయిదు ప్రశంసా వాక్యాలు, ఒకటి రెండు అభిశంసనలు రాసి అయిపోయిందని పించాడు. సామాజిక సంఘటనలకు సాహిత్య ఉద్యమాలకు మధ్య సంబంధాన్ని శాస్త్రీయమైన దృష్టితో విశ్లేషించడం విమర్శకుడు చెయ్యాల్సిన పని. ఉదాహరణకు నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాలు అనే ప్రజారాజకీయ ఉద్యమాల తర్వాతనే విప్లవ కవిత్వం ఒక ఉద్యమంగా ముందుకు వచ్చింది. ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవం అనే మార్పు సందర్భంగా రొమాంటిక్ కవితా ఉద్యమం ఆవిర్భవించింది. రష్యా విప్లవం విజయవంతమయి రెండవ ప్రపంచయుద్ధంలో ఫాసిజం, నాజీయిజం చావుదెబ్బలు తింటున్నప్పుడే శ్రీశ్రీ "మహాప్రస్థానం" రాయగలిగాడు. అంటే సాహిత్యానికి - చుట్టూవున్న వాస్తవ ప్రపంచానికి మధ్య సంబంధాన్ని సరిగా అర్థం చేసికొన్నప్పుడే సాహిత్య చరిత్రను సరిగా అధ్యయనం చేసినట్టు. అప్పుడే సమకాలీన సామాజిక అవసరాలకు అనుగుణంగా సాహిత్య రంగాన్ని పటిష్ఠం చెయ్యడం వీలుపడుతుంది. ఆ దృక్కోణం నుంచి చూస్తే ఇంద్రగంటికి ఒక తరం సాహిత్యాన్ని పాఠకులకు పరిచయం చెయ్యడానికి ప్రాథమిక అర్హత కూడా ఉన్నట్టు కనిపించదు.

ఈయనకు 'ఆధునిక' 'సమకాలిక' తేడా తెలియదు. "ఆధునికులు" అన్నపదం కాలానికి సంబంధించిందిగా అర్థం చేసికొన్నాడు గాని, భావాలకు సంబంధించిందిగా

పట్టించుకోలేదు. సమకాలిక కవుల నందరినీ ఆధునికుల లిస్టులో చేరుస్తాడు. ఏ రకమైన సాహిత్య విలువలకూ దోహదం చెయ్యని కవుల్ని రచయితల్ని ఎక్కువగా ప్రశంసించి, ఆధునిక జీవిత వాస్తవికతను బలంగా చిత్రించిన రచయితల్ని గురించి మూడు నాలుగు మాటల్లో ముగిస్తాడు. సాహిత్యంలో కొన్ని ప్రధానమయిన మలుపులకు కారకులయిన కవులను, నూతన విలువలను ఉద్యమ రూపంలో ప్రవేశ పెట్టిన రచయితలను గురించి పెద్దగా పట్టించుకోక తక్కువగా రాసి వదిలేసాడు. ఉదాహరణకు ఈ పుస్తకంలో కాళోజి ప్రస్తావనే లేదు. ఈయన ఆధునికుల లిస్టులో చేర్చిన కొంత మంది కవులు నిజంగా ఈనాడు ఆధునిక కవులుగా మిగిలిలేరు. వారి కవితావిలువలు చరిత్రలో కలిసిపోయాయి. రాయప్రోలు, రాళ్ళపల్లి, మొదలగు వారు చరిత్రలో కవులే_ వీరు ఈనాటి కవితా విలువలతో సంబంధం కోల్పోయారు. "ఆధునిక కవుల యుగకర్తృత్వ విషయంలో ఆయనకు ప్రథమ స్థానం లభించింది" అని రాయప్రోలునో ఆచార్యుణ్ణి చేశాడు. యుగకర్తృత్వానికి రాయప్రోలుకున్న యోగ్యత "నవలలు, కథలు లాంటి వాటి జోలికి పోకుండా నేరుగా కవితారంగంలోకి వచ్చేయడమే" అని తేల్చేసారు. గురజాడను గొప్ప కవిత్వం రాసినందుకు మహాకవి అంటున్నారనీ కాని ఒక మహానాటకం సృష్టించినందుకు గురజాడను మహాకవి అనాలనీ శ్రీకాంతశర్మ అభిప్రాయపడ్డాడు. ఆధునిక విమర్శనా సూత్రాలు తెలియకపోవడం వల్ల ఇలాంటి తప్పుడు అభిప్రాయాలు చెప్పడం జరుగుతుంటుంది. ఇప్పుడు 'రచయిత' అన్న పదాన్ని రచన చేసేవాడు అన్న అర్థంతో కాకుండా, ఒక ప్రాపంచిక దృక్పథంతో ఒక దానికంటే మించిన ప్రక్రియల్లో రచన చేసేవాడు అన్న అర్థంతో వాడతాం. గురజాడను తెలుగులో తొలి రచయితగా చెప్పవచ్చు. రచయితలు ప్రాచీన కాలంలో లేరు.

సాహిత్య ఉద్యమాల్లో విమర్శకుడికి కమిట్‌మెంట్ ఉంటుంది- ఉండడం సహజం. ఈవిషయంలో ఇంద్రగంటి శ్రీకాంతశర్మ గోడమీది పిల్లివాటంగా తన కమిట్‌మెంట్‌ను దాచిపెట్టుకోవాలని చూస్తాడు. వ్యతిరేక ప్రయోజనాలుగల ఉద్యమాలను గురించి రాస్తున్నప్పుడు పాఠకునిక ఏదిమంచి ఏదిచెడు అన్నస్పృహ కలిగించే ప్రయత్నం చేయడు. గ్రాంధిక, వ్యావహారిక భాషా ఉద్యమాలను గురించి ప్రస్తావించినపుడు ఆరెండు ఉద్యమాలకోసం కృషిచేసిన వ్యక్తులను గురించీ గౌరవ భావంతోనే రాస్తాడు. "పానుగంటివారు తీవ్ర గ్రాంధికవాది" అనిరాస్తూ "సమాజాన్ని సాహిత్య గంగాజలంతో క్షాళన చెయ్యడానికి ఉద్యమించిన అభినవ భగీరధుడు" అని కీర్తిస్తాడు. విశ్వనాథ సత్యనారాయణను ఒక మహాజలపాతంతోపోల్చి ఆయన్ని

ఒక వ్యవస్థగా గౌరవించి "శ్రీ అంటే ఒకవ్యక్తికి గౌరవవాచకం అయితే శ్రీశ్రీ అంటే తెలుగుజాతికే గౌరవవాచకం" అని శ్రీశ్రీని ఎత్తేస్తాడు. ఇలా ఈయన సాహిత్య అవకాశవాద తత్వానికి చిహ్నాలు పుస్తకంనిండా సమృద్ధిగా వున్నాయి.

ఈ పుస్తకంలో విమర్శకుడు కొన్ని జనరలైజేషన్సు కూడా చేసాడు. మచ్చుకు కొన్ని. "కవులకు సాధారణంగా స్త్రీ ఆరాధ్యమూర్తి"- ఈయన సాహిత్యపరిజ్ఞానమెంతో తెలుసుకోవటానికి ఈఒక్కవాక్యంచాలు. "శైలి అనేదే సాహిత్యంలో ఒక్కొక్క యుగధర్మంగాకూడా చెలామణీ అవుతుంది"- శైలిని సాహిత్యధర్మంగా కీర్తించినప్పుడు సాహిత్యవస్తువు అప్రధానమయి పోతుంది- వస్తువును శైలికీ, రూపానికీ దాసోహం చెయ్యడమే అవుతుంది. "పురుషుల్లో పుణ్యపురుషుల్లాగే, కథకుల్లో గొప్పకథకులు అరుదుగా ఉంటారు."- Writers are born అన్న సిద్ధాంతం వాసన ఈవాక్యంలో ఉంది. తెలుగులో విమర్శ అనేశాఖ వికసించవలసినంతగా వికసించలేదేమో అని ఇంద్రగంటి ఈపుస్తకంలో బాధపడ్డాడు. ఈలాంటి అషామాషి సూత్రీకరణలుచేసే విమర్శకులుమాత్రం తెలుగుసాహిత్య విమర్శ వికాసానికిఅవరోధకులే.

కొన్నివిషయాలను గురించి తనకు తెలిసిందెంతో తెలుసుకోకుండానే వ్యాఖ్యలు చెయ్యబోతాడు- మరీముఖ్యంగా మార్క్సిజం గురించి. విప్లవాలయుగంలో సాహిత్యాన్ని పరిచయం చెయ్యపూనుకున్న విమర్శకునికి మార్క్సిజంపట్ల, అస్సలు అవగాహన లేకపోవడం సాహిత్యనేరం. శ్రీశ్రీని గురించి రాస్తూ "అంతర్జాతీయ మార్క్సియ సిద్ధాంతానికి శ్రీశ్రీ జాతీయత కల్పించారు."- ఇక్కడ జాతీయమైన "హరోంహర" వంటి కొన్ని పత్రికలు వాడి మార్క్సిజాన్ని ఈ దేశప్రజలకు అర్థమయ్యేలా చెప్పాడని ఇంద్రగంటి భావం. రాజకీయ సాంకేతిక పదజాలంతో పరిచయం లేకుండా రాస్తే ఇలాంటి అస్పష్టత ఉంటుంది. తనకు ఖచ్చితమైన అవగాహన ఉన్నట్లు రాచనల్లు రామచంద్రారెడ్డికి మార్క్సియ సిద్ధాంతం పట్ల ఖచ్చితమైన అవగాహన ఉందని గట్టిగా చెప్తాడు. "రాజకీయంగా వామపక్ష సిద్ధాంతాలవైపు - ముఖ్యంగా కమ్యూనిజం వైపు"- మొగ్గు చూపించే రచయితల్లో ఈయనా ఒకరు" అని ప్రేమకథలు రావడంలేదని వాపోయిన పురాణం సుబ్రమణ్యశర్మను గురించి అంటాడు. రామచంద్రారెడ్డి పురాణం సుబ్రమణ్యశర్మ ఈయన దృష్టిలో అసలైన మార్క్సిస్టులు. దిగంబర కవుల వైఖరిలో మార్పును గురించి రాస్తూ మొదటి సంపుటిలో ప్రచలితాలయిన అభిప్రాయాలకీ, ఆ తర్వాతి సంపుటాలలో అభిప్రాయాలకి మార్పు వచ్చిందని చెపుతూ "ఆ మార్పు కూడా తాము అసహ్యమని భావించి, తీవ్రంగా ద్వేషించిన రాజకీయాలకు అనుకూలంగా ఉంద"ని గమనించమంటాడు. దిగంబర కవులు తీవ్రంగా అసహ్యించుకున్నది వ్యవస్థలోని కుళ్ళును, బూర్జువా రాజకీయ మోసాల్ని - పరిణామ క్రమంలో వారిలో కొందరు విప్లవంతో ఆ కుళ్ళును కడిగేయ వచ్చని గ్రహించి ప్రజారాజకీయాలతో ప్రత్యక్ష సంబంధం గలిగిన విప్లవ సాహిత్య సాంస్కృతిక ఉద్యమంలో

భాగమయిపోయారు. ఇలా ఈ విమర్శ గ్రంథం తప్పుడు రిమార్కులతో, అబద్ధపు లేబిళ్ళతో, అసంగతమైన జనరలైజేషన్సుతో సాగుతుంది.

సాహిత్యలోకంలో ఏనాడో అడ్రసు పోగొట్టుకున్న ఎంతోమంది కవుల కోసం అనవసరంగా కాగితాలు ఖర్చు చేశాడీ పుస్తకంలో. వీళ్ళంతా ఈ పుస్తకంలో చోట్ల నాక్రమించారు. వీళ్ళు ఆధునికులూకాదు, మహారచయితలూ కారు.

స్కూలు పిల్లలకు ఈనాడు వస్తున్న పాఠ్యగ్రంథాల్లో వ్రాసే పాఠాల్లాగా సాగిన ఈ సాహిత్య పరిచయ వ్యాస పరంపర ద్వారా ఇంద్రగంటి శ్రీకాంతశర్మ తనకు 'సాహిత్యపరిచయం' లేదని రుజువు చేసుకున్నాడు.

నవల - సీరియల్

చౌ లి-పో

ఇంగ్లీషు నుంచి తెలుగు

నళిని




రెండవ భాగం

(గత సంచిక తరువాయి)

## 9

యువాన్ మావో ఊళ్ళో చాలా మంది పోరాటంలో చేరి ఆక్టివిస్టులయేరు. కామందులలో హృదయ పరివర్తనరాదనీ వీలైతే మళ్ళా పంజా ఎత్తుతారనీ 'తు' తయారుచేసిన నల్లలిస్టులే చెప్తున్నాయి. కామందుల మీద పగ మరోసారి రగులుకుంది.

"మన రక్షణకోసం వాళ్ళ ఆయుధాలు మనం గుంజుకోవాలి. వాళ్ళ దగ్గర ఆయుధాలున్నంతకాలం మన్ని బతకనీర"ను కున్నారు జనం. మళ్ళీ రాత్రితెల్లవార్లూ చిన్న, పెద్ద మీటింగులు జరగసాగేయి. మరోసారి భూస్వామ్య విధానంపై పోరాటం ఉప్పెనలా లేచింది.

'తు' రాసిన నల్లలిస్టులు పైకితీసిన మూడు రోజులకి అంతా రైతుసంఘం ఆఫీసులో కూడేరు. ఆ గదిలో పెద్ద కిరొసిన్ దీపం వేలాడుతోంది. ఆ దీపం వెలుగులో అందరికళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి. వాళ్ళు 'తు' కోసం ఎదురుచూస్తున్నారు.

"అడుగాని తుపాకు లివ్వకపోతే జిల్లాజైలుకి పంపేద్దాం. ఇక ఆడి వూసు మనకక్కర్నేదు" అన్నాడు 'చూ'

కువో ఏఁవీ మాట్లాడలేదు. మరి కొంతమంది ఆక్టివిస్టులతో మాట్లాడి, పాయి భార్యని, లీకీ-లాన్ని 'తు' ఇంటికి పంపేడు. 'తు' పెద్దకోడలి చేత ఆయుధాలు దాచినచోటు చెప్పించాలని వాళ్ళని పంపేడు. ఇంతలో "అల్లదిగో వచ్చేసినాడు" అన్నారెవరో. కిటికీ అద్దాలమీదవెలుగు పడింది. తలుపు తెరుచుకుంది. ఇద్దరు సైనికులు 'తు'ని ముందుకు తోసేరు. అతని ముఖం పాలిపోయింది. తన ఒంటి భారం తనే మోయలేక పోతున్నాడు. జనం తన తుపాకుల సంగతి మర్చిపోయేందుకు గాను యీ రెండ్రోజుల్లోను అతను మరో మూడు గాదెలు బైటపెట్టేడు. కాని ప్రస్తుతం జనానికి కావల్సినవి తుపాకులు. అక్కడున్న దీపంలాగే 'తు' గుండె కూడా రెపరెప లాడింది.

"తేనె పూసినకత్తి! మేకవన్నె పులి!"

"ఎన్ని లుచ్చాపనులు జేసినావురా!

"ఒంతెనలు, రోడ్లు ఏస్తానని కంటాక్టు తీసుకోని పేదోల్ల కడుపుకొట్టేవురా. అల్లజీతాలు ఎగదొచ్చి నీబొజ్జపెంచుకున్నావురా. మాకష్టం దోచుకోని తినమరిగినావురా. పెదోల్ల సేత జీడిగింజలు నిప్పులో ఏయించి, పప్పులు నువ్ కొట్టుకు తిన్నావురా."

"నీ తుపాకీ యిచ్చేసినావంటే నీ పాపాలన్నీ కడిగేసినట్టే" నన్నాడు కువో.

'తు' ఏదో చెప్పాల్ననుకుంటూ ఓమారు తలెత్తి అందరినీ చూసేడు. మళ్ళీ ఏఁవనుకున్నాడో తల దించేసుకున్నాడు. కువో ఓల్డ్‌సన్‌కి ఏదో చెప్పేడు. ఓల్డ్‌సన్ ముందుకొచ్చి

" 'తు' బాబూ, నువ్ శానా దయామయుడివి కదా!" అన్నాడు.

'తు' యీ బండివాణ్ణి కళ్ళు చికిలించి చూసేడు. ఈ ఓల్డ్‌సన్ తన కింద పనిచేసినవాడే. అదేపనిగా చెప్పుకుపోతున్నాడు.

"నీకాడ అన్నేల్లు పన్జేసినోన్ని నాకుతెల్దేటి. నీకాడ తుపాకులుండీవి. జపానోల్లు లొంగిపోనాక నీకాడ మరో తుపాకి సేరిపోనాది. మరి బేగిసెప్పు, అటినెక్కడ దాసేవో బేగిసెప్పు"

"నాదగ్గర తుపాకుల్లేవు. ఇంకేంచెప్పాలి?"

"మరైతే నీయింటిమీద బురుజులెందుకు కట్టించేవట?

'తు' కొంచెం ఒణికేడు. "చిన్న తుపాకి మాత్రిం వుండేది" అన్నాడు.

"అదేదీ?"

"గవర్నమెంటు కిచ్చేసేను"

"ఏ పెభుత్వం?"

"పాతచైనా రిపబ్లిక్"

"ఎనిమిదోదలాన్ని మాత్రమే పెబుత్వం అనాలాగ్రి దొంగనాయాలా. తెలిసిందా?"

ఓల్డ్‌సన్ దారి తప్పుతున్నాడనిపించి చాంగ్ చింగ్-షి మాట్లాడ బోయేడు. కాని అప్పటికే 'తు' యిదే సందని అందుకున్నాడు.

"అవును, నేను దొంగనాయాలనే. నాకేఁవీ తెలీదు. చేసిన తప్పుకు కుఁవిఁలిపోతున్నా. నాపద్ధతులన్నీ మార్చుకుంటా. నా బంగారం ఇచ్చేసేనుకదా, ఇకనేను రైతుసంఘంలోనే వుంటాను. నేనూ పేదప్రజలవైపే నిలబడి, వాళ్ళసేవ చేయదల్చుకున్నాను".

అతని ఆ నంగి మాటలకి అందరూ నవ్వేరు.

"నవ్వకండి. 'తు'! నీకు మారాలనిగాని వుంటే తుపాకు లేదున్నాయో సెప్పు" అన్నాడు చాంగ్ చింగ్-షి.

"మాలాంటి రైతులకు తుపాకులెలా వుంటాయి!"

"తుపాకుల్లేకపోతే పిస్తోళ్ళ మాటేమిటి?"

"అవీలేవు".

'చూ' అందర్నీ తోసుకుంటూ ముందుకొచ్చి గొంతుపెంచి "ఏటంతావ్, నీకాడ పిస్తోళ్ళు నేవంతావా? కాని నీ సిన్నకొడుకు బూట్లో పిస్తోలుతో తిరగడం అందరికెరికే" నన్నాడు.

"నిజంగానే నాకు పిస్టల్స్ లేవు. అబద్ధంవాడితే నా నోరు పడిపోతుంది"

"ఇంకా నేదంతావా? ఈన్ని తీసుకుపోండి" అని ముఖం కందగడ్డలా కాగా, గర్జించేడు 'చూ'.

చాంగ్ చింగ్-షి తుపాకి మీద చెయ్యేసేడు- ట్రిగ్గర్ శబ్దం అయేలాగా అటూ యిటూ ఆడించేడు. 'తు' భయంతో గజగజ వణికేడు. ముఖంతెల్లగా పాలిపోయింది.

"ఆడికాడ పిస్తోల్లు, తుపాకులు వున్నాయని మన కెరికే. కాని ఈడు ఆటిని మన మీదే పేల్సాలని సూత్తన్నాడు. అందుకే వల్లకున్నాడు. ఈన్నేటిసేద్దాంవంటారు?" అన్నాడు 'చూ'.

కాల్లూసేతులు కట్టిపడేయండి."

"బొక్కలో తొయ్యండి"

పందులకాపరి 'వూ' బుగతని ఒక్కతోపు తోసేడు. దాంతో 'తు' మొర్రోమన్నాడు.

"అయ్యోతల్లీ, నన్ను జడిపించకండి, నాకసలే ఉబ్బసం. అయ్యో, నాకళ్ళు తిరుగుతున్నాయి. తల్లో! నన్నుకాపాడు!"

'తు' కిందకు జారిపోతుంటే ఎవరో లేపి నిల్చోబెట్టేరు. మరెవరో మంచినీళ్ళిచ్చేరు. అప్పటికి తేరుకున్నట్టు నిటారుగా నిల్చుని పైకీ కిందకీ చూసేడు.

"ముసిలోడివి, ఇంకా మీతల్లిని పిలుత్తుండావా?" అన్నాడు 'వూ'.

"ఈడి ఏసాలు మానకుంటే వుప్పుడే తీసుకుపోతాం" అంటూ కోపంతో తుపాకి నేలకేసి కొట్టేడు.

"నిన్ను మాంవొగ్గం. బేగిసెప్పు తుపాకు లెక్కడెట్టేవ్?" అన్నాడప్పటి వరకు ఏంవీ మాట్లాడని కువో, పైపుకాలుస్తూ.

"ఇంకేం చెప్పమంటారు? నా వెండీ బంగారం ఇచ్చేనుకదా?"

"నీ వెండీ బంగారంకాదు. ఉప్పుడు నీ తుపాకులు కావాల" అన్నాడు చాంగ్ చింగ్-షీ కోపంగా.

'తు' కొంగు మీద కూర్చుని, గోడకానుకుని, మరోసారి మంచినీళ్ళుతాగి తాపీగా మొదలెట్టేడు:

"కిందటి మే నెలలో హార్బిన్ నుంచి నా చిన్నకొడుకు ఆరోనంబరు హాన్ పెద్దకొడుకుతో వచ్చేడు. హాన్ కొడుకు పిస్టల్ తెచ్చిన మాట నిజ(మే. అతను దాన్ని బూట్లో పెట్టుకు తిరిగిన మాటనిజ(మే. వీళ్ళిద్దరూ ఒక్కబండిలోనే వచ్చేరు. ఆ బండిలో యింకొకరు కూడా వున్నారు. హాన్ కొడుకు ఓ ముండని తెచ్చుకున్నాడు. పెళ్ళానికి జడిసి దాన్ని మా దక్షిణపు గదిలో పెట్టేడు. పొద్దస్తమానం దాంతోనే ఒకటే ఇకఇకలు, పకపకలు! ఓరోజు ఆగదిలో తుపాకి పేలిన చప్పుడయింది. నా మన(వడు జడుసుకున్నాడుకూడా. హాన్ కొడుకు ఆముండని చంపేడనుకున్నాను. తర్వాత వూరి దక్షిణపుగేటు దగ్గిర పిట్టల్ని కొడుతుంటే బందిపోట్లు చూసేరు. ఓ అర్ధ రాత్రి వాడిని లాక్కుపోయేరు. వాడు తుపాకితోసహా బందిపోట్లతో కల్సిపోయేడు."

"అంతా బూటకం" అన్నాడు చాంగ్ చింగ్-షీ.

"ఎవుడికయ్యా సెప్తావ్ కతలు ?"

"ఆకు తప్పించుకోను ఎంత కతల్లేడోసూస్తూ! అన్నాడు ఓల్డ్‌సన్ కువోతో.

'తు' తలెత్తి "నేచెప్పిందంతా నిజ(మే. కావాలంటే హాన్ యింట్లో ఆడవాళ్ళ నడగండి. నేచెప్పిందాంట్లో అబద్ధముంటే నాతల వెయ్యి వక్కలు చేయండి" అన్నాడు.

ఓల్డ్‌సన్ అడ్డమొచ్చి "ఎవుర్నీ అడగక్కర్లేదు. నీకాడ మూడేల్లు పన్జేసినోన్ని నాకుతెల్దా ? నీ సిన్నకొడుకు పొద్దత్తమానం తుపాకితో ఆడుకునేవోడు, మరో పని నేకుండా. హాన్ కొడుక్కి తుపాకీ వుండేది నిజ(మే, కాని నీ కొడుక్కీ వుండేది. అ(అ( నన్నే పట్టీకొట్టిస్తావేటి ?" అన్నాడు ఎకసక్కెంగా.

చాంగ్ చింగ్-షీ 'తు'ని గదుముతూ

"నీ కొడుకు మూడో బందిపోటు ముటాలో వుండేవోడు. ఆడు హాన్‌కొడుకుతో పాటు సేరేడు. ఓనాడు బండెడు దొంగసొమ్ముతోవచ్చేడు హార్బిన్‌నుంచి. ఆరోజుల్లో పక్క వూరు పోవాలన్నా బయ(మే. అలాంటప్పుడు ఆడు ఆ సొమ్మంతా తుపాకీ నేకండానే తెచ్చేడంతావా ?" అనడిగేడు.

"ఆ బండి, సొమ్ముకూడా హాన్ కొడుకువే" అని 'తు' బుకాయించేడు.

చాంగ్‌చింగ్–షీ కోపం తారస్థాయినందుకుంది: "సచ్చినోడిమీద పడేడుత్తావేం? హాన్‌కొడుకు నీయింట్లో ఎప్పుడున్నాడురా? నీకొడుకే వంటింట్లో గురిసూసి పేల్సడం నేర్పుకునీవోడు. సుట్టుపక్కలందరూ ఇన్నారు" అన్నాడు.

"మాకన్నీ ఎరికే" నన్నాడు ఓల్డ్‌సన్.

'చూ' కండలు కనబడేలా చొక్కా చేతులు మడుస్తూ అడుసెప్పేదేంటెహె! తీసుకుపొండి" అన్నాడు.

'తు' ఉలక్కుండా పలక్కుండా విగ్రహంలా గదిమధ్యలో కూర్చున్నాడు.

'వూ' ముందుకొచ్చి 'తు'ని తిడుతూ,

"నువ్వసలు మంచోడివికాదు. మమ్మల్నేటి సేద్దాంవని తుపాకులు దాత్తన్నావ్? ఎవ్వరిమీద పేలుత్తావ్? నల్లలిట్టలు రాసి బతుకుదాంవనే?" అన్నాడు.

'తు' మళ్ళీ పాతపాటే! "తుపాకుల్లేవు.... తల్లో, ఏ పాపం ఎరగనోణ్ణి పుట్టి పుణ్యానికి తిడుతున్నారు"

"ముసల్సచ్చినోడా! ఇంకా తల్లిని పిల్డానికి సిగ్గునేదూ?" అని నవ్వేడు 'వూ'

కువో పాయి భార్యతో మాట్లాడి అప్పుడే తిరిగొచ్చేడు. చాలామందితో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. 'తు' చటుక్కున ఏడుపుమానేసి ఏంవన్నా వినబడుతుందేమోనని చెవులు రిక్కించేడు. కువో ఛటాలున 'తు' వేపు తిరిగి,

"తాటిదుంగనాగ నువ్ నోరిప్పనేదుగాని, నీ పెద్దకోడలు అంతా సెప్పేసినాది" అన్నాడు.

'తు' ఒక్కక్షణం నివ్వెరపోయి తేరుకున్నాడు.

"నేనుదైతుని. "నాదగ్గర తుపాకు లెందుకుంటాయ్?" కువో 'తు'ని జైలుకి తీసుకుపొమ్మన్నాడు. ఓ సైనికుడు 'తు' కాలరు పట్టుకుంటే, మరోసైనికుడు అతన్ని కట్టెయ్యబోయేడు.

"ఎందుకు కట్టెయ్యడం? ఆడెక్కడికీ పోడులే" అన్నాడు కువో.

'తు' పైకి నడిచేడు. వాళ్ళని గేటువరకు సాగనంపేడు ఓల్డ్‌సన్.

"ఆడు సెట్టకాసి పోకండా సూస్కోండి" అన్నాడు సైనికులతో. వాళ్ళు కను మరుగయ్యే వరకు, 'తు' ఏచెట్టువేపన్నా పోతాడేమోనని భయపడుతూనే అన్నాడు ఓల్డ్‌సన్. మంచులో ముగ్గురి అడుగుజాడలు కనిపిస్తున్నాయి. నెమ్మదిగా గదిలోకి నడిచేడు ఓల్డ్‌సన్.

(ఇంకా వున్నది)

కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్ సంస్మరణ :

# మరణశిక్ష - న్యాయ, రాజకీయ, మానవతా దృక్పథాలు

సుమంతా బెనర్జీ

భూమయ్య కిష్టాగౌడ్‌ల జ్ఞాపకార్థంగా ఉపన్యాసం ఇవ్వమని కార్యనిర్వాహకుల వద్దనుంచి ఉత్తరం వచ్చినపుడు నా మనస్సులో జ్ఞాపకాల వెల్లువ పెల్లుబికింది. అది సెప్టెంబరు 1975, నేను హైదరాబాదులో అరెస్టయ్యాను. నన్ను సికందరాబాదు జైల్లో రెండు వారాలపాటు ఉంచారు. పశ్చిమ బెంగాల్ జైలుకు నన్ను తరలించే ముందు చివరి రోజుల్లో ఆజైలు ఆవరణలో ఒకమూలగావున్న చిన్నచిన్న కొట్లవరుసలో మధ్యన ఉన్న కొట్లో నన్నుంచారు. మొదటిరోజు రాత్రి నిద్రపోబోయేముందు పక్క కొట్టులోంచి పాటలు విన్పించాయి. పాట తెలుగులో ఉన్నా 'శ్రీకాకుళం', 'నక్సల్‌బరీ' అన్న మాటలు నాకర్థమయ్యాయి. వెంటనే నా మురికి కొట్టులోని అసంతోషకరమైన వాతావరణంలో మార్పు వచ్చింది. వాళ్ళను నేను చూడకపోయినా, వారే గ్రూపుకు చెందిన వారో తెలియకపోయినా, నాకు నా కామ్రేడ్ల మధ్య ఉన్నట్టు అనిపించింది.

ఉదయం లేవగానే, నేనున్న కొట్టుముందు ఇనుప చువ్వల్ని పట్టుకొని చెదరిన నల్లని జుట్టుతో ఒక మధ్య వయస్కుడు నిలుచుని ఉండటం చూశాను. ఆయన వచ్చీరాని హిందీలో నేనెందుకు జైల్లో ఉన్నానని అడిగాడు. తనకుతాను పరిచయం చేసుకుంటూ 'నేను కిష్టాగౌడ్‌ను' అన్నాడు. నాలో ఒక ఉద్వేగాల అల లేచింది. కిష్టాగౌడ్ భూమయ్యల గురించి తెలియని వాళ్ళెవరు? మరణశిక్ష విధింపబడ్డ వాళ్ళ పేర్లు జనవరి 1972 నుండి మాకు దాదాపు ఇంటిల్లపాదీ చెప్పుకొనే మాటలయ్యాయి. మరణశిక్ష రద్దు చేయమని కోరుతూ దేశవ్యాప్తంగా జరిగిన ప్రదర్శనలు, సమావేశాలు జ్ఞాపకానికి వొచ్చినయి. ఇంతకు ముందు కనీసం రెండుసార్లు పౌరహక్కుల సంఘాల కార్యకర్తల, లాయర్ల వత్తిడివల్ల వారి ఉరితీత వాయిదాపడ్డది.

ఆ ఉదయం మాకు దొరికిన సమయం చాలా కొద్ది, జైలు వార్డర్లు స్నానం చేయడానికి ఒక్కొక్కరినే బయటికి పంపిస్తున్నారు. కాని తొందరలోనే భూమయ్య వంతు వచ్చింది. ఆయన కూడా నాకొట్టు ముందు నిలబడి పరిచయం చేసుకున్నాడు. కిష్టాగౌడ్ నుండి తమ పక్కకొట్టులోనే బెంగాల్‌కు చెందిన కామ్రేడ్ ఉన్నాడని ఆయన తెల్సుకున్నాడు. వీడ్కోలు బహుమతిగా ఎలాగో చార్మినార్ సిగరెట్‌పాకెట్ సంపాదించితెచ్చి యిచ్చారు.

అదిలాబాద్ వీరులైన వారిద్దర్నీ చివరిసారి చూడటం అదే. డిసెంబరు 1వ తేదీ రు పశ్చిమ బెంగాల్‌లోని బర్ద్వాన్ జైలులోని కొట్టులో కూర్చుని వారి ఉరితీత గురించి వార్తాపత్రికలో చదివాను. ఇన్ని సంవత్సరాలుగా దాన్ని ఆపడానికి చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి. ఆ సాయంకాలం మృతవీరుల జ్ఞాపకార్థం మా కొట్లలో జరిపిన సభలో మేమిచ్చిన నినాదం : 'కిష్టాగౌడ్ భూమయ్యా, మిమ్మల్ని మేమెప్పుడూ మరవలేము. మీ హత్యకు ప్రతీకారం తీర్చుకుంటాము'.

ఇప్పటికి నాలుగు సంవత్సరాలైంది. ఆరోజు చేసిన ప్రతిజ్ఞను నేరవేర్చుకోలేక పోయాము. వారి హత్యకు పగ తీర్చుకుంటామని అంటే ప్రతీకారమనే తాత్కాలిక ఉద్దేశం కాదు. వడ్డీల రూపంలో కొల్లగొట్టే భూస్వామికి వ్యతిరేకంగా తన కామ్రేడ్లు విప్లవించేందుకు ఇద్దరు రైతులు నాయకత్వం వహించేటట్లు చేసిన అమానుషమయిన వ్యవస్థను, దోషులైన భూస్వాములను స్వేచ్ఛగా వదిలి అతని కోరల్లో నలిగిపోయిన వ్యక్తుల్ని హత్యానేరాలపై అరెస్టు చేసే వ్యవస్థను, కాలదోషంపట్టిన క్రిమినల్ చట్టాల్లో భద్రపరచబడిన న్యాయాల తంతులో పీడితుల్ని బలియిచ్చే క్రూర వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయడమే.

కిష్టాగౌడ్ భూమయ్యల హత్య భారతీయ న్యాయ వ్యవస్థలోని క్రూరత్వాన్ని నయవంచనను బట్టబయలు చేస్తుంది. ఇతరుల బాధలోనే సంతోషాన్ని పొందే కిరాతకుడైనా (Sadist)నా ఒక మనిషిని ఒకసారి ఉరితీసే తేదీ ప్రకటించి, వాయిదావేసి తిరిగి ప్రకటించి, వాయిదావేసి అతణ్ణి విపరీతమైన మనోవ్యథకు గురి చేసి నెమ్మది నెమ్మదిగా ఇన్‌స్టాల్‌మెంట్సులో చంపే విధానం కనుక్కోలేదు. కానీ, భూమయ్య కిష్టాగౌడ్‌ల విషయంలో అదే జరిగింది.

ఇక నయవంచన విషయానికొస్తే, భూమయ్య కిష్టాగౌడ్‌ల కేసు సుప్రీంకోర్టుకు పోయినప్పుడు ఉరిశిక్షను ఖాయపరచిన పెద్దపెద్ద జడ్జీలలో ఒకరు కృష్ణఅయ్యర్, ఇవ్వాళ ఉరిశిక్షలు అమానుషమనీ, ఉరిశిక్షలు వద్దనీ అరుస్తున్నాడు. కాని ఆరోజుల్లో భూమయ్య కిష్టాగౌడ్‌లకు మరణశిక్ష విధించిన ప్రభుత్వానికి నాయకురాలైన ఇందిరా గాంధిని సర్వవిధాలా సమర్థించిన వాడే, మరణశిక్షను ఖాయపరుస్తూనే, సుప్రీమ్‌కోర్టు జడ్జీలు వెలిబుచ్చిన అభిప్రాయ మేమిటంటే రాజకీయ నేరాలు సాధారణ హత్యల వంటివి కావు, కాని భారతీయ శిక్షాస్మృతిలో ఈ భేదం వివరింపబడలేదు అని. 'అత్యవసరమైన మార్పుల విషయంలో మా దృక్పథం ఏమైనప్పటికీ, మేము చట్టాన్ని తిరిగిరాయలేము' అంటూ వారు యంత్రిప్రాయంగా చట్టాన్ని అమలుపరిచారు.

ఇవ్వాళ కృష్ణఅయ్యర్ తనను తాను ఏ విధంగా సమర్థించుకున్నప్పటికీ తన చేతులకు అంటిన ఆ ఇద్దరి వృతవీరుల రక్తాన్ని కడిగేసుకోలేడు. ఇద్దరు విప్లవకారులను ఒక జడ్జి 'న్యాయసమ్మతంగా' వధించేటట్టు చేసిన ఈ వ్యవస్థలో ఆయన తాము మారాలని అంటున్న చట్టాలకే కట్టుబడి అమాయకపు పోజుకొడుతున్న ఉదారవాది.

ఇక్కడొక ముఖ్యమైన ప్రశ్న : భారతీయ శిక్షా స్మృతి మామూలు హత్యనూ, రాజకీయ పరంగా జరిగిన హత్యనూ వేరు వేరుగా ఎందుకు చూడదు? భూమయ్య కిష్టాగౌడ్‌ల విషయం పక్కకు పెడదాం ప్రస్తుతానికి. ఖుదీరాం, భగత్‌సింగులు కూడ స్వార్థంకోసం హత్యలు చేసినవాళ్ళేనా? స్వాతంత్ర్యం కోసం పాలకవర్గ ప్రతినిధి ఒకరి మీద బాంబు వేసినవాడూ, పగతోనో, స్వార్థంతోనో హత్యచేసినవాడూ, ఒక్కటేనా?

న్యాయానికి పక్షపాతం లేదని మన నాయకులు ఎన్ని కబుర్లు చెప్పినా చట్టాలు కొన్ని వర్గాలు తమ స్వార్థం కోసం చేసినవే ననేది నిజం. ఇంగ్లీషువాన్ని ఎదిరించ ఆయుధం అందుకున్న భారతీయుల్ని యితర నేరస్థుల పక్కన నిలబెట్టారు. బ్రిటిష్ ప్రభుత్వం నుండి స్వేచ్ఛకోరడమే నేరమనేది చట్టం. సాధారణ నేరానికీ రాజకీయ నేరానికీ తేడా చూపని బ్రిటిష్ చట్టం యీ దేశంలో యింకా అట్లాగే కొనసాగుతున్నది. దిగజారిన గ్రామీణ సాంఘిక ఆర్థిక పరిస్థితులను మార్చేందుకు ఎక్కడో ఓ మూలన దొరలు, భూస్వాములకు వ్యతిరేకంగా పోరాటం చేసిన వాళ్ళను దోపిడీ దొంగలుగా, హంతకులుగా చిత్రించి మిగతా దేశానికి చూపిస్తున్నారు. ఇట్లా చూపించి చట్టం పేరున వాళ్ళను ఉరితీయవచ్చు. ఈ చట్టాలన్నీ కాతుకుని వున్న ఈ వ్యవస్థకే భూమయ్య కిష్టాగౌడ్‌లు తమ ఆయుధాన్ని గురిపెట్టినప్పుడు, స్వార్థంతో నిమిత్తం లేని వాళ్ళ రాజకీయ ఆశయాన్ని కప్పిపెట్టడానికి వాళ్ళను సాధారణ హంతకుల్లో చేర్చారు.

ఈ న్యాయవ్యవస్థలో పాలకులకొక న్యాయం, ప్రజలకొక న్యాయం. తమ అసమ్మతిని తెలియజేస్తూ ప్రదర్శన నిర్వహిస్తే గుంపును చెదరగొట్టడానికి పాలక వర్గాలు బలప్రయోగం చేయవచ్చు. ప్రజలు హింసకు దిగుతున్నారని ఆరోపించవచ్చు. లాఠీఛార్జి, కాల్పులు - మొదలైన పదాలన్నింటికి చట్టప్రకారం పవిత్రత వుంది. కాని ప్రజల హింస మాత్రం చట్టవ్యతిరేకమైంది. నక్సలైట్ల కార్యకలాపాలను క్రూరంగా అణిచేందుకు పోలీసులు బలప్రయోగం చేయాలని పత్రికలు రాస్తే దానికి ఏ శిక్షా వుండదు.

ప్రజలను కాల్పుల్లోను, పోలీసు కస్టడీల్లోనూ చంపిన పోలీసులపై పోలీసు అధికారులపై కూడా విచారణ జరగాలి. కేరళలో రాజన్‌ను హత్యచేసిన పోలీసు బలగానికి స్వేచ్ఛగా తిరగడానికి బెయిలూ దొరుకుతుంది, తర్వాత ఏ శిక్షపడదు, కాని భూమయ్యా కిష్టాగౌడ్‌లు మాత్రం వురికంబం ఎక్కాలి.

చట్టబద్ధమైన హింసను ప్రజలపై అమలుచేసే అధికారం ప్రభుత్వానికి వున్నపుడు, తమను తాము రక్షించుకునేందుకు విప్లవ హింసను చేబూనే అధికారం రైతులకు వుండాలని భూమయ్యా కిష్టాగౌడ్‌లు భావించారు.

మరణశిక్ష వుండాలా ? వద్దా ? వద్దయితే ఎందుకు వద్దు ?- అనే విషయాన్ని పై నిజానిజాల వెలుగులో చూడవలసి వున్నది. ఈ విషయంలో యిమిడివున్న చట్ట సంబంధమైన, రాజకీయపరమైన, మానవీయమైన అన్ని అంశాలను పరిశీలించేపుడు యివాళ యిట్లాకనిపిస్తున్న మరణశిక్ష యొక్క వర్గ మూలాల్ని మనం మరిచిపోవద్దు.

సుప్రీం కోర్టులో మరణశిక్ష గురించి చర్చ నడుస్తున్న యీ తరుణంలో ముందు మనం చట్ట సంబంధమైన అంశాలను పరిశీలిద్దాం: 1974లో సవరించబడి ప్రస్తుతం అమలులోనున్న చట్టం ప్రకారం యావజ్జీవ కారాగార శిక్ష విధించవచ్చు, మరణశిక్ష కూడా. రెండింటిలో ఏది- అనేది న్యాయమూర్తి నిర్ణయించాలి. ఒక న్యాయమూర్తికీ మరో న్యాయమూర్తికీ మధ్య తేడా వుండగా న్యాయమూర్తులు రెండింటిలో దేన్ని అయినా ఎట్లా ఎన్నుకుంటారు? నేరానికి కారణం పరిస్థితులా? వ్యక్తి గతమా ? ఈ తేడాను చూపించే విషయమేదీ- చట్టంలో ? ఒక పౌరుని ఉరితీస్తే అతని ప్రాథమిక హక్కులకు భంగం కలిగినట్టవుతుంది. యిది భారత రాజ్యాంగం పునాదినే ప్రశ్నిస్తుంది. ఈ శిక్ష అమలు జరిగిన తర్వాత వెనక్కు తీసుకోవడమంటూ వుండదు.

మరణశిక్ష ఎందుకు ?- అంటే ముఖ్యంగా మూడు కారణాలు చూపిస్తారు: 1) నేరస్థుని తగిన రీతిగా శిక్షించాలి గనుక, నేరస్థుడు ఎంత ప్రమాదకారీ, ఎంత దుర్మార్గుడూ అంటే- వాణ్ణి వెంటనే చంపేయాలి, సంఘాన్ని కాపాడాలి- 2) తమకు హాని కలిగించిన నేరస్థుని అట్ల శిక్షిస్తేనే గాని న్యాయం కోరుకునే అనేక మంది ప్రజలు శాంతించరు. 3) బతకాలనేది మనిషికి వుండే సహజమైన కోరిక కాబట్టి చనిపోవడమంటే విపరీతంగా భయపడతారు, ఉరిశిక్షను తలచుకుని జనం నేరాలుచేయరు.

ఏ సంఘంలో నయితే, ఏ పాలక వర్గాల కింద నయితే- ఉరిశిక్ష అమలు చేయబడుతున్నదో ఆ సంఘం, ఆ పాలక వర్గాల నుంచి వేరుచేసి ఉరిశిక్షకు అనుకూలంగా కాని వ్యతిరేకంగా కాని చూపే కారణాలను పరిశీలించలేం.

స్వార్థంకోసమో, సంఘం కోసమో- ఎట్లా అయితేనేం నేరస్థుడైన వాణ్ణి ఎవరినీ ఉరితీయవద్దు, ఉరిశిక్షను మొత్తానికే రద్దు చేయాలనే వాదం దేశంలోని పాలక వర్గాల వర్గ స్వభావంవల్లనే మరింత సమర్థమవుతుంది. రాజకీయ ప్రత్యర్థులను ఏరి వేసేందుకు అధికారంలో వున్న వాళ్ళకు చట్టబద్ధమైన పనిముట్టుగా ఈ శిక్ష వుపయోగ పడుతున్నది. రాజకీయేతరమైన హత్యలు చేసిన వాళ్ళను శిక్షించడానికి కూడా యిది తగదు. నేరం చేయని అమాయకుణ్ణి కూడా పట్టుకొని, హింసించి, చేయని నేరాన్ని చేసినట్టు ఒప్పించే అవకాశం ఈ దేశంలో ఈ రోజుల్లో ఎంతైనా వున్నది. ఉరిశిక్ష అమలు అయినతర్వాత ఉరిశిక్ష వేయడంలో జరిగిన ఏదైనా పొరపాటును సవరించుకునే వీలే లేదు. ఉరిశిక్షను సవాలు చేస్తూ పైకోర్టుకుపోయే వీలున్నప్పటికీ యిది ముఖ్యంగా డబ్బుతో కూడుకున్నపని. ముద్దాయి తరఫున వాదించేందుకు అనుభవజ్ఞులైన వకీళ్ళు కూడా కావాలి. యిదంతా మన దేశపు పేదవాని అందుబాటులో వుండే వ్యవహారం కాదు. మొదటి నుంచి చివరి దాకా చట్ట సంబంధమైన పద్ధతంతా పేదలకు అందు బాటులో లేనిదే. చట్టప్రకారంగా ఈ శిక్ష నుంచి మనల్ని మనం పూర్తిగా రక్షించు కునే అవకాశాలు లేని సంఘంలో వుంటున్నాం కనుక ఈ పరిస్థితిని మార్చేందుకు ఉరిశిక్షను రద్దు చేయడం తప్ప మరో మార్గం లేదు.

ఇది మళ్ళా ఒక ప్రాథమికమైన ప్రశ్నను లేవనెత్తుతుంది. మన ప్రస్తుత సమా జంలో ఏ సాంఘిక ఆర్థిక శక్తులు ఒక మనిషిని నేరం చేసేందుకు పురికొల్పుతున్నాయి? "ఈ సాంఘిక ఆర్థికశక్తులు యిట్లా వుండడానికి పాలకవర్గాల బాధ్యత ఎంత? ఒక పేద రైతుకూలి గాని ఒక మిల్లు కార్మికుడు గాని రోజంతా కష్టపడినా తిండికి నోచుకోక పోతే, ఆ నిరాశ, ఆ కోపాన్ని భార్యమీద ప్రయోగిస్తే, అతణ్ణి అలవాటుగా హత్యలు చేసే మనిషితో జత చేద్దామా? పేదరికంలో నలిగి విరక్తి చెందిన మనిషి తిండిపెట్ట లేని స్థితిలో భార్యా బిడ్డలను చంపితే, హంతకుడని అతణ్ణి ఉరి తీయాల్సిందేనా? ఒక మనిషి కొద్దికాలం కోసం మతి చలించినపుడు చేసిన నేరానికిగాను అతని ప్రాణం తీసేయవలసిందేనా?" (అర్కెగార్గ్) ప్రస్తుత పరిస్థితుల్లో మన మనస్సులను మనం అదుపులో పెట్టుకోవడం ఎంత కష్టమో అందరికీ తెలిసిన విషయమే.

కాబట్టి నేరానికి మరణశిక్ష వేయడం సరియైంది కాదు. నేరస్థునికి హత్యలు చేయడం అలవాటయి పోయింది కాబట్టి ఉరి తీయాల్సిందే అంటే- కాదు, యిక ప్రజాభీష్టం ప్రకారం నేరస్థుని ఉరితీయాల్సిందే అంటే ఈ దేశంలో పోలీసును మించిన హంతకుడు ఎవడూ లేడు కాబట్టి పోలీసును ముందు ఉరితీయాలి. ఖాకీ బట్టలు

తొడుక్కొని చంపుతున్న పోలీసులను ఉరితీసి తృప్తిపడే వీలు చట్టంలో లేనప్పుడు పోలీసుకంటె తక్కువ నేరం చేసినవాడూ, పోలీసుకంటె తక్కువ ప్రమాదకారీ అయిన సాధారణ హంతకుని ఉరిశిక్ష నుంచి తప్పించడం ఎంతైనా అవసరం. ఇక ఉరిశిక్ష వుంటేనేగాని హత్యలు తక్కువ కావు అనేది తప్పు.. అమెరికాలో ఉరిశిక్ష అమలులో వున్న రాష్ట్రాల్లో, ఉరిశిక్ష అమలులో లేని రాష్ట్రాల్లోకంటె ఎక్కువ హత్యలు అవుతున్నాయి. మన దేశంలో కూడా ఉరిశిక్ష భయానికి హత్యలు తక్కువవుతాయనేది ఉరిశిక్ష రద్దయితే కాని తేలేవిషయం కాదు.

ఇక ఉరిశిక్షతో ముడిపడివున్న రాజకీయపరమైన అంశంతీసుకుంటే– ఇందులో ఒకవైపు ప్రభుత్వం చేతిలో చట్టబద్ధంగా అమలు అవుతున్న హింసా విధానం, మరోవైపు ప్రజలు చేపట్టక తప్పని విప్లవహింస– కనిపిస్తాయి. ఉరిశిక్ష రద్దయినా కూడా, పాలకవర్గాలు తమ ప్రత్యర్థుల్ని చంపించే అధికారం కలిగేవుంటాయి. రాజకీయ ప్రత్యర్థుల్ని ఉరి తీయించేందుకైతే భారత ప్రభుత్వం యిప్పటిదాకా ఏ కోర్టు ముందుకూ వెళ్ళలేదు. వేలాది మంది నక్సలైట్లను అడవిలో చెట్లకు కట్టి కాల్చిచంపి, పోలీసు కస్టడీలో చిత్రహింసలు పెట్టి హత్యచేసి, వాళ్ళంతా ఎదురు కాల్పుల్లో చంపబడ్డారని తప్పుడు ప్రకటనలిచ్చింది ప్రభుత్వం. అధికారంలో ఉన్నవాళ్ళకు కావలిసింది ప్రత్యర్థులు లేకపోవడమే; వాళ్ళను చట్టబద్ధంగా ఉరితీసినా, అడవుల్లో, వీధుల్లో, పొలాల్లో కాల్చి చంపినా– ఒక్కటే. ఉరిశిక్షను రద్దుచేసిన దేశాల్లో కొన్నింటిలో మళ్ళీ ఉరిశిక్షను చట్టబద్ధం చేసారు లేదా చేస్తున్నారనే విషయం యిక్కడ గమనించదగ్గది. ఫలానా నేరం చేస్తే కూడా ఉరిశిక్ష వేయాలని ఉరిశిక్ష పరిధిని విస్తృతం చేస్తున్న దేశాలు కొన్ని. ఉదాహరణకు– అమెరికాలో గూఢచారులుగా పనిచేస్తున్నారనే రోజెన్‌బర్గ్ దంపతులకు మరణశిక్ష వేసారు, విదేశాల్లో మిలిటరీ ట్రెయినింగ్ అయి ఆయుధాలతో వస్తున్నాడనే నేరంమీద యిరవై నాలుగేళ్ళ యువకుణ్ణి దక్షిణ ఆఫ్రికాలో ఉరితీసారు. హత్యలతో సంబంధం లేకున్నా రాజకీయ ప్రత్యర్థులు మరణశిక్షకు గురయ్యారు. రాజకీయ ప్రత్యర్థుల్ని ఏరివేసేందుకు పోలీసులు, మిలిటరీ వుండగా కూడా ఉరిశిక్షను మళ్ళీ చట్టబద్ధం ఎందుకు చేస్తున్నారంటే– న్యాయశాస్త్ర రీత్యానే ముద్దాయిలను విచారించి ఉరితీస్తున్నారనేది ప్రపంచం ముందు వుండాలని. యిందువల్ల తృప్తిపడే ప్రజలు చాలామంది.

తిరుగుబాటు, విప్లవం తర్వాత సంఘంలో ఉరిశిక్ష స్థానమేమిటి? ఇదీ రాజకీయమైన అంశమే. ఇరాన్‌లో షా గూఢచారి ముఠా మనుషులను, క్రూరులూ దుర్మా

ర్గులు అయిన పోలీసు అధికారులను నిర్దాక్షిణ్యంగా చంపివేసారు. ఇట్లా చంపబడ్డ వాళ్ళంతా ఏళ్ళతరబడిగా ప్రజలను చిత్రహింసలు పెట్టి హత్యచేస్తున్నవాళ్ళే– వీళ్ళను యిట్లా శిక్షిస్తేనే గాని ప్రజలు తృప్తిచెందరు. వీళ్ళను క్షమించండని ఆ ప్రజలను కోరడంలో నిజాయితీ వుండదేమో। రష్యాలో, చైనాలో కూడా, విప్లవానంతరం ప్రజా పీడకులను ఉరితీస్తేనేగాని ప్రజలు శాంతించలేదు. చాలా నిదానంగా ఆలోచిస్తే యిక్కడ– దెబ్బకు దెబ్బతీయాలనే పశుప్రవృత్తి మనిషిలో కనిపిస్తుంది.

కొద్ది సంఖ్యలో వున్న పాలకవర్గాలున్న మన దేశంలాంటి చోట అస్తవ్యస్త సాంఘిక, ఆర్థిక వ్యవస్థ తయారుచేసిన నేరస్థులను శిక్షించేందుకు ఉరిశిక్ష అమలుచేస్తున్నారు. ఈ నేరస్థులు స్వార్థం కోసమూ, దేశం కోసమూ హత్యలు చేసినవాళ్ళు కావచ్చు. విప్లవానంతరం ఏర్పడే కొత్తసమాజంలో మొదట్లో ఉరిశిక్ష అమలయ్యేది– ప్రజల్ని తరతరాలుగాపీడించి దోపిడీచేసి, ప్రజల కోపానికి, పగకు, గురి అయినవాళ్ళే. వీళ్ళను చంపవద్దని కోరే అధికారం మనకెక్కడిది? అయితే విప్లవం తర్వాత యిరవై ఏళ్ళకు, సుస్థిరమైన సోవియట్ సమాజంలో, బుఖారిన్, రాడెక్ లాంటి కమ్యూనిస్టు విప్లవకారులను విదేశీ ఏజంట్లుగా చిత్రించి ఉరి తీయడం ఆలోచింపదగ్గ విషయం, చేయని నేరాలను చేసినట్టుగా వాళ్ళతో ఒప్పించినట్టు తర్వాత వెల్లడైంది. బుఖారిన్, రాడెక్‌లు చేసిన నేరాల వివరాల్లోకి పోకుండా ఒక్క విషయం చూద్దాం: వీళ్ళను ఉరితీయాలని ప్రజావుద్యమం ఏదైనా లేచిందా? వీళ్ళు నిజంగా నేరస్థులే అయితే జైల్లో బంధించి వుంచవచ్చు కదా। ఒక వర్గం, లేదా ఒక ముఠా, లేదా ఒక వ్యక్తి అభీష్టానికి అనుగుణంగా ఈ శిక్షలు అమలుచేయబడ్డాయా। కృశ్చేవ్ తదితరులు చెప్పినట్టు అధికార దాహం గల ఒక వ్యక్తి (స్టాలిన్) చేసిన పొరపాట్లుగా వీటిని అనుకోవచ్చు. కాని సరియైన సమాధానం కాదు. విప్లవానంతరం ఏర్పడ్డ సోవియట్ సమాజపరిణామ క్రమాన్ని పరిశీలిస్తే గాని జవాబు దొరకదు: యిది ఈ వ్యాసానికి సంబంధించని విషయం.

అయితే, రానున్న సోషలిస్టు సమాజంలో మరణశిక్ష స్థానం ఏమిటనేది కొట్టివేయదగ్గ ప్రశ్న కాదు. యిక్కడ మనం మరణశిక్షతో ముడిపడివున్న మానవత్వపు అంశాన్ని పరిశీలించాలి. అన్ని వాదాలూ మానవ జీవితానికి ఉన్న విలువ గురించే చెప్తాయి. సోషలిస్టు సమాజంలో మనిషిస్థానం ఎంతో వున్నతమైంది కాబట్టి సోషలిస్టు మనిషైనా ఒక ప్రశ్నను ఎదుర్కోక తప్పదు: శత్రువును చంపడమా? మానడమా?

చట్టబద్ధంగా కాని, చట్టం పరిధి అవల గాని, ఎట్లాగైతేనేం– మనిషిని చంపడమనేది పశువు నుంచి మనిషిగా మారే పరిణామ క్రమంలో మనిషిని యింకా వదలని

పశుప్రవృత్తికి సంబంధించింది. పశుదశలో బతుకు పోరులో బలహీన జీవులు ప్రాణాలు పోగొట్టుకోవలసి వచ్చేది. ఆదిమ మానవ సమాజంలో కొత్త వాళ్ళను, పరాయి వాళ్ళను బలహీనులను నమ్మేవాళ్ళు కాదు. మాయమంత్రాలు చేస్తారని, దేవుని సొమ్ము దొంగిలిస్తారని, వ్యభిచరిస్తారని, అనుమానంవున్న వాళ్ళను దూరంగా వుంచడం, ఉరితీయడం వుండేది. తర్వాత, స్వంత ఆస్తి వచ్చిన సమాజంలో దొంగతనం చేస్తే ఎత్తుకుపోతే కూడా ఉరిశిక్ష వేయడం మొదలయింది. హత్యను మించిన నేరముండదని, చంపినవాణ్ణి చంపడమే సరియైన పద్ధతనే భావం బలపడిపోయింది.

మరణశిక్ష వేసినారంటే యిక ఆ మనిషిని మనిషిగా చూడరు. ఒక వస్తువుగా చూస్తారు. దయాదాక్షిణ్యం లేకుండా చంపేస్తారు. చంపుతున్నపుడు, ఉరి తీస్తున్నపుడు ఆ మనిషికి గాయమైతున్నదా అని గాని, గాయం పెద్దదా చిన్నదా అని గాని, తప్పు చేసిన భావం ఆయనలో కనిపిస్తున్నదా అని గాని, ఏమీ చూడరు. సోక్రటీస్‌కు యిచ్చినట్టు యింత విషం తాగించి హాయిగా ప్రాణం వదులుకోనివ్వరు. ఉరితీసినా, తుపాకులతో కాల్చినా, కరెంటు కుర్చీ మీద కూచోబెట్టినా, శిక్షా విధానం మాత్రం చాలా బాధాకరమైనదీ, అవమానపరిచేదీ.

నేరానికి తగ్గట్టు శిక్ష వుండాలనీ, హత్యకు హత్యే సరియైందనీ చెప్పి మరణ శిక్షను సమర్థించే వాళ్ళు మరిచిపోతున్న విషయ మొకటి వుంది: మరణశిక్ష అనేది నేరస్తునికి అసలు శిక్షే కాదు. చనిపోయే ముందు కొన్ని నిమిషాలు తప్పితే నేరస్థుడు తనకు వేసిన శిక్ష ఎంత తీవ్రమయినదో తెలుసుకునే అవకాశంలేదు. శిక్షా ఫలితం నిలిచివుండేదేమీ లేదు. చనిపోతాడు కాబట్టి నేరస్థుని భావాలూ, ఆలోచనలూ ఆగిపోతాయి. అయ్యో - తప్పు చేసాను - అనే పశ్చాత్తాపమే నేరస్థునిలో కలిగే అవకాశమే లేనపుడు శిక్షయొక్క ఉద్దేశ్యమే దెబ్బతింటున్నది.

మరణశిక్ష అమలు కావడం చూసినవాళ్ళూ, అమలైందని విన్నవాళ్ళూ నేరాలు చేయరనీ లేదు, సరియైన శిక్షే వేసారు అనే వాళ్ళూ వుండరు. ఆధునిక సమాజంలో నేరాలు సాంఘిక ఆర్థిక కారణాలతో ముడిపడి వున్నంతగా ఫలానా శిక్ష వుంటుందనే భయంతో ముడిపడి వుండవు. నేరాలు సంఘ స్వరూపంలో సరిగా యిమడని అంశాలను చూపిస్తాయి. కాబట్టి చట్టాన్ని అతిక్రమించిన వాళ్ళను చట్టరీత్యా శిక్షిస్తూపోతూ మాత్రమే నేరాలు తగ్గించవచ్చుననేది వృథా ప్రయాస - చిన్నచిన్న సాంఘిక నేరాల మాటే ఎందుకు? యుద్ధ నేరస్థులను న్యూరెన్‌బర్గ్ ట్రిబ్యునల్ శిక్షించాక యుద్ధాలు ఆగిపోయాయా? రెండో ప్రపంచ యుద్ధం కంటె క్రూరమైన,

ఘోరమైన యుద్ధాలు జరిగాయి. నేరాలు ఎందుకు చేస్తున్నారు, యుద్ధాలు ఎందుకు వస్తున్నాయి – అనే మౌలిక విషయాల జోలికి పోనంతకాలం ఎంతటి శిక్ష భయం కూడా మనిషిని నేరాల నుంచి, యుద్ధాల నుంచి దూరం చేయలేదు.

పశు ప్రవృత్తికి ఎంత దూరంగా వచ్చింది అనే విషయాన్ని బట్టి మానవ నాగరికతలో అభివృద్ధిని నిర్ణయించాలి. పశు దశలో వున్నప్పుడు, లేదా ఆదిమ మానవ సమాజంలో వున్నట్టి - విలువలూ, పద్ధతులే యింకా నేటికి చట్టంలో కొనసాగుతూ మరణశిక్ష అమలులో వుంటున్నది. ఒక మనిషిని చంపిన వారికి చంపడం తప్పని చెప్పడంకోసం వాణ్ణి చంపడం ఎందుకు ? - అని మరణశిక్షను వ్యతిరేకించే ఒక అమెరికన్ ఈ మధ్య ప్రశ్నించాడు.

అన్ని దేశాల్లో మరణశిక్షను రద్దు చేయాలనీ, మరణశిక్ష పరిధిని యితర నేరాలకు కూడా విస్తృతం చేయొద్దనీ, ఈ పరిధిని తగ్గించాలని, ఎంతో తీవ్రమైన నేరమైతే తప్ప మరణశిక్ష విధించనే వద్దని కూడా ఐక్యరాజ్య సమితి సాధారణ సభ అభిప్రాయపడింది. కాని ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వమున్న చాలా దేశాలు యీ మాటను పెడచెవిన పెట్టాయి. చాలా కొద్ది దేశాలు మాత్రమే మరణశిక్ష పరిధిని తగ్గించి, మరణశిక్షను విధించడం కూడా తగ్గించగా, యితర దేశాలు ఫలానా ఫలానా నేరాలకు కూడా మరణశిక్ష విధించాలని కొత్త నిర్ణయాలు తీసుకుంటున్నాయి.

ఐక్యరాజ్య సమితి ద్వారాను, వేరుగాను, మరణశిక్షలకు వ్యతిరేకంగా అంతర్జాతీయ క్షమాభిక్ష (సంస్థ) ఎంతో కృషిచేస్తున్నది. ప్రపంచంలోని స్వేచ్ఛాప్రియులంతా, అన్ని తెగల వామపక్షాల వాళ్ళూ, విప్లవకారులూ ఈ సంస్థకు తమ మద్దతునివ్వాల్సి వున్నది. అయితే ఈ సంస్థ సాధించింది చాలా తక్కువ. మన దేశంలోనూ, మిగతా ప్రపంచంలోనూ పాలకవర్గాలు ప్రత్యర్థుల్ని ఎంత క్రూరంగా అణిచివేస్తున్నాయనేది దీన్ని బట్టే తెలుస్తున్నది-

నేరం యొక్క మరియు రాజకీయ (అధికార) ధిక్కారం యొక్క మూలాలు ఈ దేశపు సాంఘిక ఆర్థిక విధానంలో వున్నాయని మరోసారి చెప్పుకుందాం. ఈ దేశంలోని దుష్కృతలన్నింటిని తొలగించేందుకు మనం ధైర్యంగా ఉద్యమించవలసి వుంది. మానవ శక్తులన్నింటి మానవీయ గుణాలను ఏకం చేయాల్సిన గురుతర బాధ్యత యిది. భూమయ్యా కిష్టాగౌడ్‌లను ఉరికంబం ఎక్కించిన ఈ సాంఘిక వ్యవస్థ స్థానంలో మనిషి జీవితపు అత్యున్నత విలువను గుర్తించి, గౌరవించి, ప్రేమించే కొత్త వ్యవస్థను ఏర్పరచాల్సి వున్నది. తోటి మనిషి ఏ పరిస్థితుల్లో

## మార్క్సిజం - సాహిత్యం - చర్చ:

త్రిపురనేని మధుసూదనరావుగారి వ్యాసం "మార్క్సిజం - సాహిత్యం" చదివాను.

(ఇందులో మిగిలిన విషయాల గురించి నేను చర్చించబోవటంలేదు.)

అక్టోబర్ సంచికలో "ఉత్పాదకశ్రమ - అనుత్పాదకశ్రమ" అనే హెడ్డింగు కింద రాసిన దానిలో ఆయన ఇలా అన్నారు- "భూస్వామ్య సమాజంలో ఉత్పత్తి ఉపయోగ విలువగా (Use - Value) వుంటుంది. బూర్జువా సమాజంలో ఉత్పత్తికి మారక విలువ (Exchange - Value) వుంటుంది." - ఈ విషయాలు చాలాపొరపాటు.

ఆయన చెప్తున్న దాని ప్రకారం, భూస్వామ్య సమాజంలో ఉత్పత్తి ఉపయోగపు విలువగా మాత్రమే వుంటుందిగాని మారకపు విలువగా వుండదనీ, బూర్జువా సమాజంలో మాత్రమే ఉత్పత్తికి మారకం విలువ ఏర్పడుతుందనీ అనుకోవలసి వస్తుంది. కానీ ఇది తప్పు.

భూస్వామ్య సమాజానికి ఎంతో ముందుదైన ఆదిమ సమాజంలో 'ఒక వస్తువు ఇచ్చి ఇంకో వస్తువు తీసుకొనే' వస్తుమార్పిడి విధానంలోనే (బార్టర్ సిస్టమ్‌లోనే) ఉత్పత్తికి మారకం విలువ ఏర్పడిపోయింది, ఈ మారకం విలువ మొట్టమొదట్లో ప్రాథమిక రూపంలో వుంది. దానినే 'ప్రాథమిక విలువ రూపం' (ఎలిమెంటరీ ఫామ్ అఫ్ వాల్యూ) అని అన్నాడు మార్క్స్. అది తరువాత విస్తృత విలువ రూపంగా మారింది; తరువాత డబ్బు రూపంగా మారింది. మారకం విలువ ఇన్ని రూపాలుగా మారడం అనేది భూస్వామ్య సమాజానికి ముందే జరిగిపోయింది.

వస్తువుల్ని మార్చుకోవటం అంటే సమానమైన శ్రమలున్న ఉత్పత్తుల్ని మార్చుకోవటం అన్నమాట. ఎప్పుడో, ఆదిమ సమాజంలోనే, వస్తువుకి ఉపయోగపు విలువతోపాటు మారకం విలువ కూడా ఎర్పడింది. అటువంటప్పుడు "బూర్జువా సమాజంలో ఉత్పత్తికి మారక విలువ (Exchange - Value) వుంటుంది" అని

---

నేరం చేయవలసి వస్తున్నదో అర్థం చేసుకునే ఓపిక మనకున్ననాడు మరణశిక్ష రద్దు గురించి మనిషి మంచికి సంబంధించిన యితర విషయాల గురించి ఆలోచించ గలుగుతాం. ఈ ఆశయం వైపు అడుగువేయడమే భూమయ్యా కిష్టాగౌడ్‌ల హత్యకు మనం పగతీసుకోవడం.

[భూమయ్య కిష్టాగౌడ్ సంస్మరణ సంఘం 1979 డిసెంబర్ 1న హనుమకొండలో ఏర్పాటుచేసిన సంస్మరణ సభలో సుమంతా బెనర్జీ చదివిన ఇంగ్లీషు ప్రసంగ వ్యాసానికి సంక్షిప్తానువాదం: జి.డి.]

అనడం (అంతకు ముందు సమాజాల్లో ఉత్పత్తికి మారకం విలువ లేదనే అర్థం వచ్చేటట్టు అనడం) పొరపాటు.

ఉత్పత్తికి మారకంవిలువ ఎప్పుడూవుంది. మారకాలు ప్రారంభమైన కాలం నించీవుంది. ఉత్పత్తికి మారకం విలువ ఆదిమ సమాజంలోనూవుంది; భూస్వామ్య సమాజంలోనూవుంది; పెట్టుబడిదారీ సమాజంలోనూవుంది. అది కేవలం "ఉన్నత" కమ్యూనిస్టు సమాజంలో మాత్రమే లేకుండా పోతుంది.

ఈ విషయంలో మధుసూదనరావుగారు తన పొరపాటుని సవరించుకొంటారని ఆశిస్తాను.

— సానీ
హైదరాబాద్

ఆరెస్ సుదర్శనం వక్రీకరణకు మధుసూధనరావు సమాధానం చూశాము. చర్చ ఆసక్తికరంగా ఉన్నది. ఆరెస్ లేవనెత్తిన ప్రశ్నల కన్నింటికీ మధుసూదనరావు సమాధానం చెప్పకుండా దాటవెయ్యడం, లేకపోతే ఆరెస్ చెప్పని వాటిని చెప్పినట్లు చూపి ఖండించడం, అదీ కాకపోతే ఆరెస్‌ది మూర్ఖత్వం, అవివేకం, తలరాత అంటూ తిట్టడం, అనే మూడు విధాలైన దోషాలు మధుసూదనరావు వ్యాసంలో కనిపిస్తున్నాయి. క్రింది అంశాలు పరిశీలించి పాఠకులు ఈ చర్చలో పాల్గొంటే మరింత అవగాహన పెరిగే అవకాశం ఉంటుందని అస్మదాదుల అభిప్రాయం—

1. 'మార్క్స్ దృష్టిలో సాహిత్యం' కాదు, 'మార్క్సిజమ్ దృక్పథంలో సాహిత్యం' అంటూ పరిశీలన పద్ధతి ఉండాలి అంటాడు మధుసూదనరావు. మార్క్సిజమ్ అంటే మార్క్స్-ఏంగెల్స్ చెప్పినదానికి లెనిన్, స్టాలిన్, మావోల ఆచరణాత్మక వ్యాఖ్య అని అభిప్రాయం కాబోలు. మార్క్స్‌ని మనదేశపు పరిస్థితులకు అన్వయించుకోవడంలో, లెనిన్ స్టాలిన్ వగైరాల ద్వారానే తప్ప, మార్క్స్‌ని మనం అన్వయించుకోవడానికి వీల్లేదా? ఇది భావదాస్యం తప్ప శాస్త్రీయ పద్ధతి ఎలా అవుతుంది? ఆరెస్ వ్యాసం ఉద్దేశమే :— మార్క్స్-ఏంగెల్స్ దర్శనాన్ని మౌలికంగా అర్థంచేసుకుని మన పరిస్థితులకి అన్వయించుకొమ్మని. ఆరెస్ మేధావిగా, రచయితగా మార్క్స్‌ని అప్రోచ్ చేస్తే మధుసూదనరావు లెనిన్-స్టాలిన్-మావోల ద్వారా అప్రోచ్ చేస్తానంటాడు. అందువల్ల ఆరెస్ లేవనెత్తిన ప్రధాన ప్రశ్న — 'మార్క్స్‌కి రాజకీయవాది చేసే వ్యాఖ్యానం, రచయితా మేధావీ చేసే వ్యాఖ్యానం కంటె ఎట్లా సుపీరియర్?' అనే దానికి సమాధానం రాలేదు. మార్క్స్ అలా రాజకీయవాది సుపీరియర్ అని

చెప్పలేదు। స్టాలిన్ వగైరాలు సుపీరియారిటీని ఆచరణలో అవలంబించారు। ఇక్కడ 'పవర్' కీలకం. హేతువాదమూ ఔచిత్యమూ కావు. పవర్ వుందని అవతలి వాళ్ల నోళ్లు మూయించడం సమస్యకాదు. అందువల్ల ఆరెస్ లేవదీసిన మార్క్స్ మూల సూత్రాల అవగాహన గూర్చిన ప్రశ్న ప్రశ్నగానే వుండిపోతున్నది. తుపాకి నుంచీ పవర్ వస్తుంది, పవర్ నుంచీ సరియైన మార్క్సిజమ్ వస్తుంది అంటే ఈ చర్చలు అనవసరంకదా।

2. 'రాజకీయాలకీ శ్రమకీ మధ్య సంబంధంలో రాజకీయాలకి మొదటి స్థానం యివ్వటం రాజకీయ ఆధిపత్యం.' అంటూ 'రాజకీయవాదికి ఒక బుర్రా, సాహిత్య వేత్తకి ఒక బుర్రా వుండవు, అన్నాడు మధుసూదనరావు. ఉండకపోతే యిద్దరికీ వైరుధ్యం రాదుకదా। వైరుధ్యం రాకపోతే ఆధిపత్యం, లొంగుబాటు ప్రశ్నేలేదు. రచయితకి 'ఆచరణ' అంటే రాయడమే 'ఆచరణ', తుపాకి డ్రిల్ కాదు. డాక్టరుకీ, మిల్లు కూలీకీ, వ్యవసాయ కూలీకి 'ఆచరణ' వాళ్ళ పని వాళ్ళు చెయ్యటమే. వీళ్ళం దరికీ ఆధిపత్యం వహిస్తాను అనే దగాకోరు రాజకీయవాది బండారం ఈనాడు మన దేశంలో బట్టబయలై నగ్నంగా అందరికీ కనిపిస్తోంది. 'పవరు' సంపాయించి ప్రజల మీద ఆధిపత్యం చెయ్యడమే రాజకీయవాది ఆచరణా? అటువంటి వాడికి మధుసూదన రావు ఎందుకు వత్తాసు పలుకుతున్నట్టు? తనూ ఒక స్టాలిన్ అవుదామని కలలు కంటున్నాడా? విప్లవం అంటే కేవలం రాజకీయాలే విప్లవమా? సైన్సు, సాహిత్యము, కళలు, సామాజిక సంబంధాలూ అన్నీ మారవద్దా? ఆ రంగాల్లో రాజకీయవాదికి లొంగేదిలేదు, దీనికి మార్క్స్ సమర్థన వున్నదీ అని ఆరెస్ రాస్తే మధుసూదనరావు గింజుకోవడం దేనికి? "క్షేత్ర పరిమితులు జ్ఞానాన్ని పరిమితం చెయ్యకుండా చూసు కోవాలి" అన్న మధుసూదనరావు వాక్యం అంగీకరించదగిందే. అందుకే రాజకీయ వాది పరిమితి ఏమిటో ఎరిగివర్తించమని చెప్పడం.

3. ఎంగెల్స్ నిరసించిన తొత్తు రచనల్ని గురించి మధుసూదనరావు పూర్తి పాఠం ఇవ్వడం బాగున్నది. "గాలివాటు రచనలంటే పరమ పిరికితనంతో ప్రభుత్వ వ్యతిరేకతని ప్రదర్శించి జనాన్ని ఆకర్షించటానికి ప్రయత్నించే రచనలు.... యంగ్ జర్మనీ, మాడరన్ స్కూలు అని పేరు పెట్టుకుని ఊరేగారు.... వీళ్ళు కుర్రచేష్టల వల్ల చేసిన తప్పులకి పశ్చాత్తాపం పొందినా తమ రచనారీతుల్ని అభివృద్ధి చేసుకోలేక పోయారు." ఈ ఎంగెల్స్ పూర్తి కొటేషన్‌లోని వాక్యాలు మరింత అద్దంపడుతున్నాయి మన తెలుగు రచయితలకు. 'ఇలాంటి రచయితలు తెలుగులో మనకూ ఉన్నారంటే_

ఆశ్చర్యపడ నక్కరలేదు' అన్న ఆరెస్ రిమార్కు అక్షరాల సమర్థించబడింది పూర్తి కొటేషన్ వల్ల. ఇది ఆరెస్ అసంపూర్తి కొటేషన్ వల్ల వక్రీకరణ ఎలా అయింది? ఈ ఎంగెల్స్ వాక్యాలు ఆరెస్ వంటి రచయితలకు అన్వయిస్తాయో, అరసం వారికో, విరసం వారికో, మధుసూదనరావుకో ఎవరికి వారు భుజాలు తడుముకోవల్సిందే! ఈ సంగతి సమాజమే కాలగతిలో తేల్చివేస్తుంది. ఇందులో ఆరెస్ చేసిన వంచనా, దొంగతనమూ ఏమి కనిపించడంలేదు! ఇక్కడ గమనించవలసింది ఒక్కటే – చిత్తశుద్ధీ, ప్రతిభాలేకుండా పాలకవర్గాన్ని సమర్థిస్తూ రాసినా పార్టీని సమర్థిస్తూ రాసినా ఒక్కటే. కావలసింది రచయితకు సొంత బుర్రా, చిత్తశుద్ధీ. రచయితనని చెప్పుకుంటూ రాజకీయాధిపత్యానికి అర్రులు జాచే రాతగాడే గాలివాటు రాతగాడు. దీనికీ చారిత్రిక భౌతికవాదానికీ సంబంధంలేదు.

4. Man and Society పుస్తకం సోవియట్ రచయితలు వ్రాసిన సంకలనం మాస్కో పబ్లికేషన్ విశాలాంధ్ర ప్రచురణాలయం ద్వారా అందరికీ అందుబాటులో వున్నదే. దాన్ని గూర్చి అనవసరంగా ఆరెస్ ఏదో వంచన చెయ్యబోయాడంటూ తిట్టడం అప్రస్తుతంగా ఉన్నది. ఆరెస్ మీద వ్యక్తిగతమైన కసి ప్రదర్శించటం మధుసూదనరావుకి హుందాగా లేదు. ఒక మార్క్సిస్ట్ తన సంస్కారాన్ని యింతకంటె మెరుగ్గా చూపించుకోవాలి.

5. గతితార్కిక భౌతికవాదంలోని ప్రధాన అంశం: 'విషయి' విషయం' అనే ద్వంద్వాన్ని అధిగమించడం అన్నా – 'ఆచరణ' అన్నా (భౌతికవాద దృక్పథం రీత్యా) ఒకటే. "విషయం పొందే అభివృద్ధిలోనే ఆ అభివృద్ధిని సాధించే విషయి రూపొందుతుంది" అన్న మధుసూదనరావు వ్యాఖ్యానంలో ఆచరణ, వ్యవహారం (ఆరెస్ వాడిన పదం), విషయము విషయి అనే వాటిని 'అధిగమించడం' యిమిడి వున్నాయి. ఆరెస్ దీన్ని భావవాద అద్వైతం చేశాడన్న ఆరోపణ నిజంకాదు. ఆరెస్ వ్యాసంలో అలాలేదు. లేనిదాన్ని గొప్పగా ఖండించడం శుష్కప్రయాస. 'తాత్త్విక వివరణ' అనే పదబంధాన్ని అదేదో భావవాదం తాలూకు అస్పృశ్య విషయం అనుకోవడం మధుసూదనరావు చాదస్తం తప్ప మరేంకాదు.

6. అలాగే భాషకీ చైతన్యానికీ గల మౌలిక సంబంధం 'స్థిర' సంబంధం కాదనే చెబుతున్నాడు ఆరెస్. భావవాద భ్రమల ప్రసక్తి అనవసరం యిక్కడ. 'భాషని సృజనాత్మకంగా వ్యక్తి ప్రయోగించడం' అంటే ఆరెస్ స్పష్టంగా – 'వ్యవహారంలో శబ్దాన్ని విలక్షణంగా, సృజనాత్మకంగా' అనీ, 'వ్యవహారంలో సిద్ధించేది'

అనీ 'వ్యవహారం' అంటూ ఆచరణనీ, భౌతికసత్యాన్నీ గూర్చి చెబుతూవుంటే, దాన్ని 'భావవాద పరంగా వ్యాఖ్యానించా'డని ఖండించి 'సోమరి తలకాయలని' మేధావుల్ని తిట్టడం వగైరా మధుసూదనరావు సోమరితనాన్నే సూచిస్తుంది. ఈ సోమరితనం వల్లే 'వ్యక్తి చైతన్యం' అంటే ఆరెస్ భావవాద స్వాతంత్ర్యం ద్వారా శూన్యాన్నీ సృజననీ సాధిస్తున్నాడని ఆరోపించడం. సామాజిక చైతన్యం వ్యక్తి చైతన్యం ద్వారానే అభివ్యక్తిపొంది, "భౌతిక జీవితంలోని కొత్తశక్తులు" తద్వారానే వెలికి వస్తాయనేది స్పష్టం. సైంటిస్టు, ఇంజనీరు, కళాకారుడు, రచయిత యిలా సామాజికమైన సృజనకి కేంద్రాలు. వీళ్ల రాజకీయవాదికంటె లొచ్చుకాదనే ఆరెస్ వాదం.

7. మార్క్స్ మానవతావాది కాడు, భౌతికవాది అని మధుసూదనరావు ఉవాచ. అంటే ఏమిటి? మార్క్స్ మనుష్యుల్ని దోపిడీ నుంచీ, బానిసత్వం నుంచీ, దైన్యం నుంచీ విముక్తుల్ని చేసే ప్రయత్నం కాదా ఆయన దర్శనం? 'బ్రహ్మపదార్థం' లాగ ఏదో 'భౌతిక పదార్థం'గా మానవజాతిని నుసీ, మసీ చేసి రాజకీయవాదికి పట్టం కట్టాలనడమే మార్క్స్ ఉద్దేశమా? మార్క్స్ మానవతావాది అనే అందరం అనుకుంటూ జోహర్లు అర్పిస్తున్నాము. మధుసూదనరావు మనిషిని ప్రాణంలేని, చైతన్యంలేని పదార్థంగా భావించే భౌతికవాదాన్ని— అది గతితార్కికం కానివ్వండి మతి తార్కికం కానివ్వండి— ఎంత తొందరగా వదులుకుంటే అంత మంచిది. Man must not be reduced to a thing, please!

8. "గ్రీకు పురాణాలకి గ్రీకుల జీవితం పునాదిగా వుంటుంది కానీ భారతీయ లేదా ఈజిప్షియన్ జీవితం పునాదిగా వుండదు, సుదర్శనం చెప్పే విశ్వజనీనత ఇక్కడే ఎగిరిపోయింది." మధుసూదనరావు వక్రీకరణ మరీ ఎబ్బెట్టుగా వుంది. విశ్వజనీనత అంటే చదవడానికి ఏ కాలంలోనైనా ఆసక్తి పుట్టించి ఆనందింపజేసేదీ, చదివితే ఆలోచింపజేసేదీ, మళ్ళీ చదవాలనిపించేదీ అయిన సాహిత్యం. షేక్స్పియర్ని చదవడం అందులో రాముడు సీత వుంటారని కాదు; పసిపిల్లల్లో వుండే శాశ్వత ఆకర్షణ పురాణాలకి వుంటుంది" అంటూ మధుసూదనరావు మార్క్సుకి వ్యాఖ్యానం చేశాడు. కాని మార్క్స్ చెప్పిన కారణాలు వేరు— "బూర్జువా ఆర్థిక వ్యవస్థలో.... మనిషి తాను వస్తువుగా మారి.... ఆత్మశుద్ధి కోల్పోయి తన స్వాతంత్ర్యాన్ని తనకు గాని లక్ష్యానికి బలిపెట్టడమూ, అందుచేత పాత ప్రపంచపు పసితనమే మనకంటె ఉన్నతంగా భాసిస్తోంది.... ఆనాటి సృజన ఒక నిర్దిష్ట పరిధిలో, పరిణతి పొందిన ఆకృతిగా, స్వరూపంగా అన్నింటిలో వ్యక్తం అవుతూ వుండడంవల్ల, అది నిజంగానే

మనకంటె ఉన్నతస్థితి అవుతున్నది" అనడంలో మార్క్స్ మానవతావాదిగానూ, సాహిత్యంలో కళకూ దాని పరిపూర్ణతకు విలువ యిచ్చే సాహిత్యపరుడుగానూ గోచరిస్తున్నాడు. మధుసూదనరావు ఈ కొటేషన్ జోలికి పోలేదు!

9. "సామాజిక మానవుడికి మాత్రమే స్వేచ్ఛ వుంటుంది" మధుసూదనరావు ఉవాచ. సామాజిక మానవుడు కానివాడెవడని ఈయన అభిప్రాయం? మార్క్స్ దర్శనం ప్రకారం సామాజికుడు కాని మనిషికి అస్తిత్వమే లేదు! బహుశా మధుసూదనరావు లేక రాజకీయవాదీ నిర్ణయించే సామాజిక పరిధులకు, పార్టీ పరిధులకు లొంగని మానవునికి స్వేచ్ఛ వుండదు! అని భావం కాబోలు! ఇది మార్క్స్ దృష్టి కాదు బాబో! అని చెప్పడమే ఆరెస్ వ్రాసిన వ్యాసం ఉద్దేశం కదా! ఆరెస్ స్వేచ్ఛని గూర్చి వ్యాసంలో సొంతంగా ఏమీ చెప్పలేదు. మార్క్స్ కొటేషన్సు యిచ్చి 'సృజన'తూ భౌతికమైన అవశ్యకతకూ గల సంబంధాన్ని మాత్రమే సూచించాడు. దాన్ని తికమకచేసి పారేశాడు మధుసూదనరావు.

10. ఆరెస్ అస్తిత్వవాది అనే ప్రిజుడిస్‌తో ఆయన వ్యాసాన్ని పరిశీలించడం వల్ల మధుసూదనరావు మార్క్స్ దృక్పథానికి కానీ, మార్క్సిజమ్‌లో రచయితకూ, రాజకీయవాదికీ గల సంబంధాన్ని స్పష్టంచేసే ప్రయత్నానికి గాని న్యాయం చేకూర్చలేదు. ఈ విషయాన్ని గూర్చి శ్రీ వరవరరావు, శ్రీ కె.వి. రమణారెడ్డి వంటి వాళ్ళు చర్చించి విపులీకరిస్తారని ఆశిస్తున్నాము –

ఆర్. రవీంద్ర & మిత్రులు
హైదరాబాద్ – 47

లేఖ

నవంబర్ "సృజన" స్త్రీల ప్రత్యేక సంచిక చాలా పేలవంగా వుంది. స్త్రీల ప్రత్యేక సంచికగా ప్రకటించే ముందు సాహితీ అభ్యుదయానికి, సమాజ పురోగమనానికి నూతన ప్రజాతంత్ర విప్లవం విజయ వంతం కావడానికి ఏరకపు స్త్రీలు అత్యంత పురోగాములో వాళ్ళనే మీరు గుర్తించ లేదని ఆరోపణ. "సృజన"కు కూడ ఢిల్లీలో వున్న స్త్రీల విషయమే కావాల్సి వచ్చింది, మూఢాచారాలు, దురాచారాల మీద కన్పడ్డ ఆసక్తి గ్రామీణ ప్రాంతాల్లోగల కోటానుకోట్ల స్త్రీల బాధలు, కన్నీళ్లు, పోరాటాలు మీకు ప్రధానంగా కన్పించలేదు. కొన్ని మినహా అన్ని వ్యాసాలు డజన్ల కొద్దీ వచ్చే వారపత్రికల స్థాయిలోనే వున్నాయి. నూతన ప్రజాతంత్ర విప్లవంలో

భాగంగా భారతదేశ వ్యాప్తంగా జరుగుతున్న రైతాంగ పోరాటాల్లో స్త్రీల పాత్రం గురించి, కర్తవ్యాలగూర్చి కనీసావగాహన కల్గించే విధంగా "సృజన" లేదు.

నేడు జరుగుతున్న పోరాట ప్రాంతాల్లో భూస్వాముల దౌర్జన్యానికి వ్యతిరేకంగా, పోలీసుల పాశవిక చర్యలకు వ్యతిరేకంగా పోరాడుతూ బలియౌతున్న స్త్రీలు కావల్సినంత సాహిత్యాన్ని, జీవితాన్ని మీకు ప్రేరణగా ఇవ్వడానికి వున్నారు. పొలాల్లో, కార్ఖానాల్లో, చితికిన శరీరాలతో, శ్రమభారంతో వంగిన నడుముల్తో బ్రతుకులు భారంగా వెళ్ళదీస్తున్న రైతాంగ కార్మిక స్త్రీల ఉద్యమ సంచికగా సృజన వెలువడాల్సిందని ఆకాంక్ష.

నేడు స్త్రీలు పోరాడుతున్నారు. పట్టణ మధ్యతరగతి మహిళల్లాగా సంస్కరణల నినాదాలు కాకుండా, భూమి, భుక్తి, విముక్తి గురించి జరిగే పోరాటాల్లోనూ తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నారు. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో జరుగుతున్న రైతాంగపోరాటాల్లో చదువు సంధ్యలు లేక మాసిన తల, చింకి పేలికల్తో వున్న సిరిమల్లె సెట్టు కింద లచ్చుమమ్మ లెందరో అగ్రగామిగా వున్న సంఘటనలు వున్నాయి. జగిత్యాల పోరాటంతో ఉత్తేజం పొందిన మెట్‌పెల్లి తాలూకా గుమ్మలాపూర్‌లో పోలీసులు "సంఘం"లో కొందర్ని అరెస్టు చేయడానికి వస్తే జీపుతాళాలు లాక్కొని పోలీసుల ఆటలు సాగనియ్యకుండా అరెస్టయిన వారిని తీసుకుపోకుండా అడ్డుకున్నది గుమ్మలాపూర్ గ్రామీణ స్త్రీలే. పెద్దపెల్లి తాలూకాలో రాఘనేడు ఘటన జరిగిన తర్వాత మగవారినందర్ని అరెస్టులు, చిత్రహింసలకు గురిచేయగా గ్రామంలోని పురుషులందరు తప్పుకున్నపుడు పెద్దపెల్లిలో ఊరేగింపు జరిపింది పోలీసుల నెదిరించింది మహిళలే. ఇట్లా చెప్పుకుంటాపోతే ఈ రెండు జిల్లాల్లో స్త్రీలు కూడ ప్రతిరోజు ఏదో ఒక పల్లెలో భూస్వామ్య విధానానికి, పోలీసుల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న ఘటనలు మనకగుపడ్తాయి.

రైతాంగ పోరాటంలో, కార్యకర్తలకు రక్షణనిస్తూ సద్దులు మోస్తూ, వార్తలు మోస్తూ కంటికిరెప్పల్లా, కన్నతల్లుల్లా సాదుకునే మహిళల గాథ లెన్నెన్నో. గ్రామాలపై విచ్చల విడిగా పోలీసులు దాడులు చేస్తున్నపుడు పోలీసుల చేతికి చిక్కకుండా తప్పించుకొని చంటిపాపలతో చెట్లల్లోకి గుట్టల్లోకి వెళ్ళిన స్త్రీలు లెక్కకు మించిన మంది. పండితాపురం, లొత్తునూరు కుదురుపాక మొదలైన గ్రామాల్లో మానభంగాలకు గురియౌతూ కూడ నిబ్బరంగా నిలబడ్తున్నారు. శివసాగర్ మాటల్లో చెప్పాలంటే గంగ దాటెలిపోతూ కంట నీరెట్టే చెల్లెమ్మలు పార్టీ అండతో గంగ

దాపెల్లకుండ కంటి నీరును కసిగా మార్చుకొని నిలబడ్డం సంవత్సరం తర్వాత కూడ మనకు కన్పడ్తుంది. ఇట్లాంటివి ఎన్నెన్నో. ఇవి నూతన ప్రజాతంత్ర విప్లవంలో భాగంగా వర్గ పోరాటంలో తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహించుటకు కరీంనగర్ ఆదిలాబాద్ స్త్రీల సృష్టి. కూలీ రేట్ల పోరాటాల్లో ప్రత్యేకించి స్త్రీలు సమరశీలంగా ముందుండి పోరాడుతారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇవ్వాళ్ళ ఉద్యమమున్న గ్రామాలన్నింటిలో కూడా స్త్రీల కూలీ రేట్ల పెంపుదల పోరాటం తీసుకోబడ్డది. ముందుగా తీసుకున్న సమస్యల్లో ఇది ఒకటి. ఇవి స్త్రీ ఉద్యమాలు కావా? ఇవన్నీ మీకు గమనంలోకే రాలేదు. ఇవి ప్రజా ఉద్యమాల సాహిత్యాన్నందించే "సృజన"కు కూడ పనికిరాలేదు.

దశాబ్ది కాలంగా భారత రైతాంగ విప్లవంలో అసువులర్పించి అమరులైన వీర నారీమణులెందరో వున్నారు. కామ్రేడ్ నిర్మల, అంకమ్మ, సరస్వతి, స్నేహలత మొదలగువారు. స్త్రీల ప్రత్యేక సంచికలో కనీసం మీకెవరికీ జ్ఞాపకం రాలేదు. వాళ్ళ ఊసేలేదు. ఇది శోచనీయం।

కవరు పేజీ గురించి ఒక నిమిషం. మీరు చైనా మహిళల ఫోటోలు వేశారే కాని, ఆ అర్థమిచ్చే ఫోటోలు కొంచెం కష్టపడితే అంతకంటే మంచిగా దొరికేవి. భారతదేశం స్త్రీల పరిస్థితికి అద్దంపట్టే విధంగా కవరు ఫోటో వుండాల్సి వుండె.

ఇవన్నింటికి సమాధానంగా చిన్న చిట్కా చెప్పొచ్చు- "మాకు సాహిత్యం, వార్తలు అందడంలేదు" మేమేం చెయ్యాలి అని. పట్టణాల్లో వుంటూ ఉద్యమ సాహిత్యాన్ని వెదుకుతున్నారే తప్ప, ఉద్యమ ప్రాంతాల్లోకి వెళ్తే బండ్ల కొద్దీ సాహిత్యం సృష్టించే జీవిత గాథలు దొరుకుతాయి. కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాల రైతాంగం మిమ్మల్ని ఆహ్వానిస్తున్నారు- రండి. ఢిల్లీ, బొంబాయి లాంటి మహా నగరాల నుండి, సుదూర ప్రాంతాల నుండి పౌరహక్కుల కమిటీలు, బూర్జువా పత్రికల విలేఖరులు సైతం స్వంత ఖర్చులతో వ్యయ ప్రయాసలతో పోరాటాన్ని వెతుక్కుంటూ వచ్చారు. కాని బెత్తెడు దూరంలో వున్న 'సాహితీ మిత్రులు' జానెడు దూరంలో వున్న విరసం రచయితలు "ఆహా ఓహో" అంటూ అడపా దడపా అనోటా ఈనోటా, 'క్రాంతి' ద్వారా వినడం తప్ప ప్రజా సంఘాలు ఆహ్వానించినా రావడం లేదు. చివరకు బహిరంగ సభలకు కూడా.

లూసన్ మాటల్లో చెప్పాలంటే పోరాటంలో వున్న వారు పోరాటాల గూర్చి ఆలోచిస్తూ, పోరాడుతుంటారే తప్ప సాహిత్య రచన చేసే తీరిక ఉండదు అని

అంటారు. అందుకే రాయడానికి ప్రయత్నించినా మాకు రాయడం వీలుగావడం లేదు. వీలైన మేరకు రాస్తూనే వున్నాము.

ప్రజా రచయితలారా!

రాయగల్గే సత్తావుండి, చెప్పగల్గే నేర్పువుండి "నన్ను ముట్టుకోకు నామాలకాకి" అన్నట్టు మీ బట్టలకు మట్టి తగలకుండా బడా బాబుల్లాగా దూరంగా వుంటూ ఆలోచిస్తున్నారనేది బాధగా వుంది. విప్లవం గురించి "ఆహా ఓహో" అనకండి. మీరు సాహితీ సైనికులుగానైనా పోరాట సాహిత్యాన్ని సృష్టించాలనుకుంటే, పోరాట సాహిత్యం రావాలనుకుంటే మీరూ రండి! కరీంనగర్ ఆదిలాబాద్ జిల్లాల్లోకి. మీ జీవితకాలమంతా సృష్టించే తరగని సాహిత్యం దొరుకుతుంది. ఇక్కడి ప్రజలు మీ స్నేహ హస్తాలనాహ్వానిస్తున్నారు. ఇక్కడి జీవితాలు సాహితీ ఉన్నత ప్రమాణాల ఘటనా ఘటనలు సృష్టించే వేగవంతమైన మార్పును అందుకొంటున్నాయి.

మహోన్నత పోరాటాలను, మౌలికమైన మార్పు కొరకు జరుగుతున్న ఉద్యమాలను రికార్డు చేయండి. బయటి ప్రపంచానికి విన్పించండి. చారిత్రిక పరిస్థితిలో సాంస్కృతిక సైనికులుగా మీ వంతు కర్తవ్యాన్ని నిర్వహించుటకు ప్రజల వద్దకు వస్తారని చరిత్రలో మీ బాధ్యత నిర్వహిస్తారని అనుకొంటూ.... — ఎ.ఎన్.

ఢిల్లీ బొంబాయి లాంటి మహనగరాల నుండి, సుదూర ప్రాంతాల నుండి పౌర హక్కుల కమిటీలు, బూర్జువా పత్రికల విలేఖరులు పోరాటాన్ని వెతుక్కుంటూ రావడానికి 'సాహితీ మిత్రులు', విరసం సభ్యులు, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం చేసిన కృషి ఎ.ఎన్. గారికి తెలియదేమో. ఢిల్లీ, బొంబాయి పౌరహక్కుల కమిటీల వెంట, బూర్జువా పత్రికల విలేఖరుల వెంట 'సాహితీ మిత్రులు', విరసం సభ్యులు, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం సభ్యులు పోరాట ప్రాంతాలు తిరిగారని కూడ ఎ.ఎన్. గారికి తెలియకపోవచ్చు.

.... 'సాహితీ మిత్రులు'

---

తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల్లో కూడా సృజన 100వ సంచికను దాదాపు రెండువందల పేజీలతో విలువైన సంచికగా తేవడానికి ప్రయత్నిస్తున్నాం. ఈ సంచిక బకాయిఉన్న ఏజెంట్లకు, డబ్బు చెల్లించని చందాదారులకు పంపడం సాధ్యపడదు. కనుక 100వ సంచిక వెలువడే లోగా మీమీబకాయిలు చెల్లించవలసిందిగా కోరుతున్నాం.

— సృజన

సాహిత్య లేఖలు :

# బూతు మాటలు వాడడంలో తప్పులేదా ?

[సృజన నవంబర్ సంచిక సంపాదకీయంలోని 'ఆత్మవిమర్శ'పై విశాఖ పాఠకుని లేఖ సృజన పాఠకుల్లో చాల సంచలనాన్ని కలిగించింది. 'స్త్రీలను అవమానించే మాటలు వాడడం ప్రజాపంథాయా?' అనే శీర్షికతో రంగనాయకమ్మగారు రాసిన సుదీర్ఘమైన సమాధానం జనవరి సంచికకు రచనలన్నీ ఎన్నిక అయ్యాక మాకు చేరినందున ఈ సంచికలో వేయలేక పోతున్నాం. రాగలసంచికలలో ప్రచురించగలమని, పాఠకులీ చర్చలో పాల్గొంటారని ఆశిస్తున్నాం. — సాహితీ మిత్రులు]

నవంబరు నెల సంపాదకీయం వాస్తవానికి చిత్తశుద్ధితోటి, నిజాయితీతోటి చేసుకున్న ఆత్మవిమర్శ. ఈనాడు చాలా మంది విప్లవ రచయితలు, విప్లవ సాహితీ పాఠకులు చాలా సీరియస్‌గా తీసుకొని ఆలోచించాల్సిన విషయం.

తామునమ్ముకొని వున్న భావాలకంటే కూడా సమాజంలో వినూత్న భావాలు ఉద్భవించినపుడు, కొత్త భావాలధాటికి తట్టుకోలేక, వాటిని చాలా చాదస్తపు భావాలుగా సంప్రదాయ (అది ఏ సంప్రదాయమైనా కావచ్చు.) వాదులు తేలగొడ్తారు.

విశాఖ మిత్రులు తన వాదాన్ని సమర్థించుకొనేందుకు శ్రీశ్రీ పాదాన్ని పేర్కొంటున్నారు. ఒకవేళ శ్రీశ్రీ రాసినంత మాత్రాన గొప్ప విషయమవుతుందా? ఆయన రాసినది శిలా శాసనమవుతుందా? దానినే మనం అనుసరించాలా?

ఇంకా మనది 'మాస్‌లైన్' గాబట్టి వ్యక్తిగత ఆదర్శవాదం కూడదంటున్నారు. సమాజంలో చలామణి అవుతున్న భావాల కంటే కొంత ఉన్నతంగా జీవించటమే ఆదర్శవాదం అవుతుంది. ఆహారపుటలవాట్లలో, జీవన పరిస్థితులలో కట్టు, బట్టవిషయంలో నలుగురిలో ఒకడుగావున్నా భావాలలో మాత్రం వాళ్ళకంటే చాలా ఉన్నతంగా, చైతన్యవంతంగా ఆదర్శవాదిగా వుంటే అదితప్పా?

కొజ్జాలు, మాచకమ్మలు వీళ్ళుకూడా సమాజంలో ఒక భాగమేకదా। వీళ్ళు కూడా దోపిడీ చేయబడుతున్న వర్గమే। కొన్ని శారీరకమైన అవలక్షణాలతో పుట్టిన నేరానికి వాళ్ళను హేళనచేయటం ఎంత వరకు సమంజసం? ఇలాంటి అంగవికలుర మీద సహజంగా సానుభూతిని చూపించాల్సింది పోయి అవమానం చేయటం ఏం భావ్యం? (వీళ్ళు సిపిఐ, సిపియం కంటే నీతిలేని వాళ్ళా?)

ఈ సందర్భంలో మనం బూతుల్ని కూడా ఖచ్చితంగా పేర్కొనాలి. విప్లవ సాహిత్యంలో రచయితలకు తెలియకుండానే, అప్రయత్నంగా కొన్ని బూతుల్ని

వాడటం జరిగింది. బూతులంటే సహజంగా 'అమ్మ.... అక్క....' లాంటివి వస్తుంటాయి. ఈ బూతులు పురుష దురహంకారాన్ని వ్యక్తపరుస్తూ, స్త్రీలను అవమాన పరిచేవిగా వుంటాయి.

సేటు సాబులతో అమ్మ - బేటీ అంటది అమ్మ
పెద్ద దొరలకు అమ్మ - ముద్దులిస్తది అమ్మ
బడా సాములతో అమ్మ - పండుకుంటది అమ్మ
(ఇందిరా జాలం - వీధి భాగోతం - కానూరి)

ఇవి నిర్ద్వంద్వంగా ఫ్యూడల్ భావాలే. ఇందిరా గాంధీని సైద్ధాంతికంగా విమర్శించ వలసిందే తప్ప ఆవిడ స్త్రీత్వాన్ని ఆధారంగా చేసుకొని చేసిన జుగుప్సాకరమైనటువంటి, చాలా చౌకబారు విమర్శలు ఇవి, ఇలాంటి విమర్శల్ని మనం తీవ్రంగా నిరసించాలి.

మా పల్లె దొరగాడు
నీ సెల్లి మొగుడుకొడకో
టాటాలు బిర్లగాల్లు
నీ తల్లికి మిండేలు
(అమీనోడ పాటలో గద్దర్)

ఇది అమీన్‌ను విమర్శించినట్లేనా ? ఇదెలాంటి విమర్శ ? అమీను దురాగతాలతో సంబంధంలేని అతని చెల్లెల్ని, తల్లిని అనటం ఏమిన్యాయం ? అమీనుకు తల్లి, చెల్లెలు కావటమేనా ఆ స్త్రీలు చేసుకున్న దుర్మార్గం ? ఇవి చాలా అన్యాయమైన విమర్శలు. ఇలాంటి వాటిని తక్షణం ఉపసంహరించుకోవాలి.

సమాజంలో సగంగావుండి, సామాజిక పోరాటంలో భాగస్వామియై, ఆకాశంలో అర్ధభాగమైన స్త్రీని కించపరిచి, నీచపరిచే బూతుల్ని వాడటం మానుకోవాలి.

చాలా మంది ఉన్నత భావాలు కలిగినవ్యక్తులు కూడా యాంత్రికంగా, అలవాటు చొప్పున తిట్లను ప్రయోగిస్తుంటారు. వాళ్ళు స్త్రీలను అవమానం చేయాలనే లక్ష్యంతోటి తిట్టకపోవచ్చు. అలానే విప్లవ సాహిత్యంలో ఇవి చోటు చేసుకున్నాయి. ఈ తిట్లలో స్త్రీలని అవమాన పరిచి, అగౌరవపరిచే లక్షణం వుండిగాబట్టి- ఆ రాసేవాళ్ళు, మాట్లాడేవాళ్ళు కొంత సాధనచేసి, క్రమశిక్షణతో ఈ లక్షణాన్ని విడిచిపెట్టాలి.

పమిడిపాడు
25-12-79

మొలకలపల్లి కోటేశ్వరరావు

సృజన స్త్రీల ప్రత్యేక సంచికలోని సంపాదకీయంలోని అంశంపై విశాఖ సాహితీ మిత్రులు మాచకమ్మ, రంకు ఇత్యాది పదాలు వాడడంలో తప్పేమిటి? అని సవాలుచేస్తున్నారు. ఈ మాటలు నిస్సందేహంగా స్త్రీజాతిని అవమాన పరచేవే.

తమ వాదానికి బలంగా "…. సరదాపడి మాచకమ్మ సమర్తాడినపుడు" అనే శ్రీశ్రీ కవితా భాగాన్ని ఎత్తి చూపుతున్నారు. ఐతే తప్పు పెద్దవారు చేసినంత మాత్రాన అది ఒప్పుగా మారుతుందా? పెద్దవారు చేసినా, చిన్నవారు చేసినా, వంద సార్లు చేసినా, బహుకాలంగా చేసినా తప్పు ఒప్పుగా మారదని ఈమిత్రులు గ్రహించాలి.

పొట్టిబావ, బట్టతల, పిలకరాయుళ్లు మొ॥ మాటలు పురుషుల విషయంలో వాడుతున్నాముగదా అని తమ వాదాన్ని సమర్థించు కుంటున్నారు. ఐతే పైమాటలు పరిహాస సూచకాలే తప్ప మొత్తంగా పురుషజాతిని అవమానించేవికావు.

"సంపాదకీయంలో చాదస్తం, ఆదర్శవాదం కనిపించాయి" అనేది ఈ మిత్రుల ఆరోపణ. సమాజంలో సగభాగమైన స్త్రీలను అవమానించరాదనడం చాదస్తమెలా ఔతుందో ఈ మిత్రులకే బోధపడాలి. ఒక స్త్రీకి పుత్రుడై, మరోస్త్రీకి భర్తయై, మరోస్త్రీకి తండ్రియైన పురుషుడు ఆస్త్రీని అవమానించడమంటే ఏమిటి? తననుతాను అవమానించుకోవడమే. తర్వాత, స్త్రీలను అవమానించే మాటల వాడుక మానేయాలనేదానికి 'ఆదర్శవాదం' అనే లేబిల్ తగిలిస్తున్నారు. లేబిల్స్ వద్దు. అది కేవలం మన నాగరికత, సంస్కారాల్లో భాగం మాత్రమే. పైగా ఆదర్శవాదం తప్పుకాదు. సాంస్కృతిక మార్గం ద్వారా ప్రజలను విప్లవోన్ముఖులను చేయవలసినవారు ఆదర్శంగా ఉండగలిగితే మంచిదే అందుకు మనందేన్నీ బలిచేయనక్కరలేదు కుసంస్కారాన్ని తప్ప.

కాబట్టి విశాఖ సాహితీమిత్రులు ఇలాంటి విపరీతవాదాలు చేయక సహృదయతతో స్వీకరించవలసిందిగా కోరుతున్నాను.

కరీంనగర్
27-12-79

— వి. వి.

**'అఫ్ - కబళిస్తాన్!'**

అక్టోబర్ విప్లవాన్ని మరిచి
ఆక్టోపస్‌లా విస్తరిస్తున్నది రష్యా — దామెర రాములు

# శ్రీశ్రీ - ఆధునిక విమర్శకుడు

త్రిపురనేని మధుసూదనరావు

శ్రీశ్రీ కవిత్వం నుంచి శ్రీశ్రీ సాహిత్య విమర్శని వేరుచేసి పరిశీలించటం సాధ్యం కాదు. శ్రీశ్రీ కవిత్వంలో కనిపించే వైవిధ్యం, వైరుధ్యం శ్రీశ్రీ సాహిత్య విమర్శలో కూడా స్పష్టంగా కనిపిస్తుంది. ఆధునిక భారతీయ సమాజంలో సంభవించిన సంకీర్ణమైన మార్పుల నుంచి అన్వయించి చూస్తే శ్రీశ్రీ కవిత్వ దశలలో వచ్చిన మార్పులు అన్నీ శ్రీశ్రీ సాహిత్య విమర్శలో కూడా కనిపెట్ట వచ్చును. సాహిత్యంలో కంటె సాహిత్య విమర్శలో సామాజిక దృష్టి ప్రబలంగా కనిపిస్తుంది. సమకాలిక సాహిత్యంతో సంబంధం లేకుండా సాహిత్య విమర్శ వుండదు. సాహిత్య పరిశోధన, సాహిత్య చరిత్ర, సాహిత్య శాస్త్రం సాహిత్య విమర్శలు పరస్పరం కలిసివుండినప్పటికీ వాటి ప్రయోజనాల్లో భిన్నత్వం కూడా వుంది. సాహిత్య విమర్శ ప్రధానంగా వర్తమాన సాహిత్య విలువల మీద విమర్శగా వుంటుంది. అందుకనే సామాజికమైన విమర్శ లేకుండా, విప్లవాత్మకమైన ఆశయం లేకుండా సజీవ సాహిత్య విమర్శ వుండదు.

సాహిత్యంలో కంటే సాహిత్య విమర్శలో వర్గస్వభావం స్పష్టంగా కనిపిస్తుంది. వర్గ పోరాటంలో సాహిత్య విమర్శకుని స్థానాన్నిబట్టి సాహిత్య విమర్శ స్వరూపం వుంటుంది. వర్తమాన సాహిత్య రంగంలోని వివిధ ధోరణుల్ని పరిశీలిస్తూ ఆ ధోరణుల్లో ఏది వాంఛనీయం అని సాహిత్య విమర్శకుడు భావిస్తాడో దాన్ని సహేతుకంగా వివరిస్తూ రచయితల్ని ఆ ధోరణి వైపు సంఘటితం చెయ్యటానికి ప్రయత్నం చేస్తాడు. సాహిత్యం సమాజానికి సంబంధించింది అయినప్పుడు సాహిత్య విమర్శ సమాజ విమర్శకి కూడా సంబంధించిందిగా వుంటుంది. అందుకనే సాహిత్య విమర్శలో వాదోపవాదాలూ, ఆవేశం, పోరాట స్వభావం అనివార్యంగా వుంటాయి. నిశితమైన పరిశీలనా, నిర్దిష్టమైన ఆదర్శం లేకుండా సాహిత్య విమర్శ వుండదు. ఒక సమకాలిక రచయితలోని అభ్యుదయ వ్యతిరేక అంశాల్ని విశ్లేషించి చూపి, ఆ రచయితను సవరించటానికి ప్రయత్నం చేసే క్రమంలో, ఆ రచయిత ప్రభావం నుంచీ ఇతర రచయితల్ని తప్పించటానికి చేసే ప్రయత్న క్రమంలోనూ సాహిత్య విమర్శ పోరాట సాధనం అవుతుంది.

రచయిత విమర్శ రాసినప్పుడు సాధారణంగా తన రచనలకు అనుకూలమైన అనుగుణ్యమైన విమర్శనా విధానాన్నే అనుసరిస్తాడు. రచయిత రచనల్లో వ్యక్తం చేసిన ఆశయాలకి వ్యతిరేకంగా ఆ రచయిత విమర్శనా పద్ధతి వుండదు. రచయిత

ఏ ప్రక్రియ (Form) లో ప్రధానంగా రచన చేశాడో అతని విమర్శ కూడా స్థూలంగా ఆ ప్రక్రియకే పరిమితంగా వుంటుంది. ఇతర రచయితల్నీ, రచనల్నీ విమర్శించే సందర్భంలో కూడా తన సాహిత్యాన్నీ, దానికి అనుగుణ్యంగా రూపొందిన తన విమర్శనా పద్ధతి వెలుగులోనే చేస్తాడు. సాహిత్య చరిత్రలో భాగమయిపోయిన రచయితల్ని గురించి ప్రస్తావిస్తున్నప్పుడు కూడా రచయితలయిన విమర్శకులు ఈ సూత్రాన్నే పాటిస్తారు. సాహిత్య విమర్శకీ సాహిత్యానికీ పరస్పర సంబంధం వుంటుంది. అసలే రచయితకాని సాహిత్య విమర్శకులూ, అసలే విమర్శకులుకాని రచయితలూ వుండరు. సాహిత్యం నుంచీ సాహిత్య విమర్శ సాహిత్య విమర్శ నుంచీ సాహిత్యం అభివృద్ధి పొందుతూ వుంటాయి. వ్యక్తులు తమ చుట్టూ వున్న సమాజాన్ని ఆచరణ నుంచీ అవగాహన చేసుకోవటం, ఆ సమాజంలో తమ స్థానాన్ని సాధించుకోవటానికి ప్రయత్నం చేయటంతోనే విమర్శ ప్రారంభమవుతుంది. విమర్శ అనేది లేకుండా వ్యక్తులు సమాజంలో జీవించలేరు. విమర్శ నుంచీ సాహిత్యం పుట్టి విమర్శతో తన పాత్రని నిర్దేశించుకొని సాహిత్య విమర్శకు కారణం అవుతుంది. పలాయన వాదులూ, సంఘ వ్యతిరేకులూ మాత్రమే విమర్శను సహించలేరు. సాహిత్యం తనంతతానే పాఠకుల్ని చేరుతుందనీ, సాహిత్య విమర్శ సాహిత్యానికి నష్టం కలిగిస్తుందని వాదించే వాళ్ళు రచయితల ముసుగులో బతికే లోకవంచకులు.

"కవిత్వం గురించి అప్రియవచనాలు నాకు వ్రాయటం ఇష్టంలేదు. ఏమూల ఒక్క కావ్యనిశ్వాసం వినిపించినా నేను దానికి సానుభూతితో స్పందిస్తాను. అతీగాత సున్నితమైన హృదయాలను అప్రియవాక్కులు ఎంత బాధిస్తాయో నాకు తెలుసును. కాని కొన్ని కొన్ని విమర్శ ప్రమాణాలు ఎదుటపెట్టుకొని ఋజువృత్తితో చేసే చర్యలకు తుర్రిపడి లాభం వుండదనీ అటువంటి విమర్శకుల దృక్పథాన్ని అర్థం చేసుకొని మన్నించాలనీ నాఉద్దేశం" (శ్రీశ్రీ సాహిత్యం. ఒకటి. పే 222 – 1938)

"నా ఆగ్రహం వ్యక్తుల మీదకి కాక వాళ్ళుపాల్పడే అనాచారాల మీదకి ప్రసరించునుగాక. వాటిని తీక్షంగా విమర్శించగల శక్తి నావాక్కుకు ప్రసాదించబడును గాక" (శ్రీశ్రీ సాహిత్యం. వచన విభాగం రెండు. 367 – 1947)

"విమర్శవల్లనే ప్రజాస్వామ్యానికి పరిపుష్టి" – (372)

"మంచిని చూపించి, అది ఎందువల్ల మంచిదో చెప్పటం, చెడ్డను బయట పెట్టి అది ఎందుకు చెడ్డదో సహేతుకంగా నిరూపించడం" – (372)

"వ్యక్తిగత విమర్శలు కూడదని కూడా నేనను" – (372)

"మనం ఎవరినైనా విమర్శించటానికి ముందు విమర్శించగల అర్హత సంపాదించుకోవాలి. సాహిత్య విమర్శ అంటే సినీమాలకూటాన్నీ, రాజకీయాల మందల్నీ విమర్శించటం కాదు" – (373)

"తెలుగు విమర్శకుడికి తిట్టడంలోఉన్నప్రజ్ఞ మెప్పుకోవటంలోలేదు" – (410)

"తెలుగు వాడికి సరియైన విమర్శ ప్రామాణ్యాలు లేకపోవడమే ఇందుకు కారణమనుకుంటాను." – (410)

"పూర్వం కాని, ఇప్పుడు కాని, ఎప్పుడు కాని, విమర్శకుడు మహాపండితుడైన ప్రజ్ఞాశీలి అని ఒప్పుకొనక తప్పదు" – (428)

" Generalisations జీవితంలో వలెనే కవిత్వంలోనూ Mislead చేస్తాయి. అందువల్లనే Objective criticismలో నాకు నమ్మకం లేదు." – (455)

"యే ఆదర్శమూ లేకుండా విమర్శించటం శ్రేయస్కరం కాదు" ( శ్రీశ్రీ సాహిత్యం మూడు వచన విభాగం. – 207 – 1946)

"సంఘాన్ని ముందుకు నడిపించడమే విప్లవపంథా, అభ్యుదయరీతి. ఇది కావ్యవిమర్శకు గీటురాయి" – (209)

"విమర్శ, ప్రతివిమర్శ అంటూలేనిదే సమన్వయం అంటూఉండదు" – (215)

"క్రొత్త రీతులను శాస్త్రీయమైన గతితార్కిక దృష్టితో పరిశీలన చేయవలసిందిగా నేను అనేక సార్లు మనవి చేసి ఉన్నాను" (215)

"సాహిత్యం - సామ్యవాదం అనే విమర్శనా గ్రంథం వ్రాయాలని వుంది. తెలుగు సాహిత్యాన్ని సామ్యవాదిగా పరిశీలించాలి" (284. – 1969.)

"కొత్త సృష్టికి కొత్త విమర్శన కూడా కావాలి" (294.)

"రసం, ధ్వని, వ్యంగ్యం మొదలైన పడికట్లు వాడటానికి అసలే వీలులేదు (326)

"రసనలేనిదే సృజన లేదు. సృజన కానిది రచన కాదు" (332 - 1962)

"సాహిత్య పరిణామాలను సామాజిక పరిస్థితులతో సమన్వయించి చారిత్రిక దృక్పథంతో సమీక్షించగలిగినవాడే సద్విమర్శకుడు. అతడే మార్క్సిస్టు విమర్శకుడు. (తి. 71)

శ్రీశ్రీ సాహిత్య విమర్శకు వ్యతిరేకంకాదు సరికదా సాహిత్య విమర్శ ఎలా వుండాలో, దాని ప్రయోజనం ఏమిటో కూడా స్పష్టంగా చెప్పినట్టు పైన వుల్లేఖించిన

విషయాలు నిరూపిస్తున్నాయి. కవిగా శ్రీశ్రీలో ఎన్ని దశలు వున్నాయో విమర్శకుడుగా కూడా అన్ని దశలూ వున్నాయి. ఈ దశల్లో వున్నది పురోగమనమే కాని అది సరళ రేఖలో సాగిన పురోగమనం కాదు. అంతిమంగా అభ్యుదయ శక్తులదే విజయం అయినప్పటికీ ఆ అభ్యుదయం సరళరేఖలో వుండదనీ, అంటే అది మెట్టుమెట్టుగా సాగదనీ నత్తగుల్ల ఆకారంలో (spiral) సాగుతుందనీ అందరికీ తెలిసిన విషయమే. శ్రీశ్రీలో సంప్రదాయిక దృక్పథం ఒక దశగా ఎన్నడూ లేదు. సామాజికంగా వర్ణాశ్రమధర్మాలు, తాత్త్వికంగా వేదాంతం, సాహిత్యపరంగా అలంకార శాస్త్రాలూ పురాణేతిహాసప్రబంధ కావ్యప్రక్రియలూ శ్రీశ్రీ వ్యక్తిత్వం మీద ప్రగాఢమైన ప్రభావం ఎన్నడూ చేయలేదు. అంటే శ్రీశ్రీ కవిత్వంలో సంప్రదాయక దశలేదు. అభ్యాస దశలో గణబద్ధ ఛందస్సులో నాలుగు పద్యాలు రాయటం తప్ప సంప్రదాయం అని స్థాపించదగిన దశలేదు. అది శ్రీశ్రీ విమర్శనలో కూడా లేదు. భావకవిత్వ, అభ్యుదయ కవిత్వ, ప్రయోజనపర ప్రయోగవాద కవిత్వ, విప్లవకవిత్వ దశలే శ్రీశ్రీలో ప్రధానదశలు. ఈ దశలు కొంతవరకు మెట్టుమెట్టుగా సాగినా అన్నిదశల్లోనూ, ఇప్పటికీ అన్నిదశలూ కలిసేవున్నాయి. శ్రీశ్రీ ఆధునిక కవి, అభ్యుదయ, విప్లవ కవి. శ్రీశ్రీ అభ్యుదయ. విప్లవకవిత్వం ఆధునికత నుంచి ప్రక్రియాపరంగా, శిల్పపరంగా బయటపడలేదు. వస్తువులో భావకవిత్వం నుంచి అభ్యుదయ కవిత్వానికీ, అక్కడ నుంచి విప్లవ కవిత్వానికి పురోగమించినా శిల్పంలో ఆధునిక పరిధిలోనే వుండిపోయాడు. శ్రీశ్రీ విప్లవ కవిత్వంలో కూడా కాల్పనిక అంశంవుంది. జీవిత దృష్టి నుంచి కవిత్వాన్ని గాక కవిత్వ దృష్టి నుంచి జీవితాన్ని చూడటం శ్రీశ్రీ వ్యక్తిత్వంలో మౌలిక లక్షణం. ఇదే శ్రీశ్రీ సాహిత్య విమర్శలో కూడా ప్రధాన లక్షణంగా వుంది. హృదయవాదం, సౌందర్యవాదం, స్పందనవాదం, శిల్పవాదం— ఏ పేరుతో పిలిచినా శ్రీశ్రీ భావకవిత్వం రాసే రోజుల్లో ఆత్మాశ్రయ, కాల్పనిక విమర్శ చేశాడు. ఫ్రెంచి సౌందర్యవాద విమర్శల, టాల్‌స్టాయ్ సంవేదనావాద విమర్శల ప్రభావం శ్రీశ్రీ రాసిన తొలి విమర్శనలమీద వుంది. ఒక పక్క మానవతావాద పునాదిగల వ్యక్తి స్వేచ్ఛ మరొకపక్క సామాజికంగా పలాయనవాదం ఈ దశలో శ్రీశ్రీ సాహిత్య విమర్శలో కనిపిస్తాయి. తన కవిత్వం కోసం వెదుక్కుంటున్న శ్రీశ్రీలో కళకళకోసమే అనే భావం నవ్వులుచిందే పసిపిల్లలా ప్రవేశించింది. ఆ బిడ్డకి తన సంతోష చంద్రికాలలో సంకెళ్ళులేని అమరత్వాన్ని ఇచ్చాడు. అగ్ని కిరీటపు ధగధగల్నీ, చండ్రనిప్పుల్నీ, మాటల మంటల్నీ, పొటాషియం సైనైడుల్నీ తట్టుకొని ఇప్పటికీ ఆ నెలబాల శ్రీశ్రీలో చిరునవ్వులు చిందిస్తూనే

వుంది. ఆ మోహన రూపాన్నీ, నూతన తేజాన్నీ శ్రీశ్రీ ఆవాహన చేస్తూనేవుంటాడు. "కళకళకోసమే అని విశ్వసించేవాళ్ళు కావ్యానికి రసాస్వాదనమే పరమావధిగా నిర్ణయిస్తారు. ఈ ఆనందమెట్టిది?" (శ్రీశ్రీ. ఒంటి. కావ్య, వచన విభాగాలు 188 - 1934)

"ఉత్కృష్ట రసానందం పద్యం చదవగానే కలిగే ఆశ్చర్యంలోవుంది........ రసానందం భావార్థాలు రెంటికీ అతీతమయింది కనుక" (189) ఇక్కడ రసం, ఆనందం వంటి వాటికి శ్రీశ్రీ అలంకారశాస్త్ర అర్థం వుద్దేశించటంలేదు. కాల్పనిక సౌందర్య శాస్త్రంలో (Romantic Easthetics) సౌందర్యార్థాన్ని చెపుతున్నాడు. "చిత్తశుద్ధి వుంటేనే నీవుచేసిన రచన శిల్పం అవుతుంది. శిల్పం అంటే సత్యం. సత్యానికి చావులేదు" (215) ఇందులో శిల్పం, సత్యం Beauty, truth అనే కాల్పనికార్థంలోనివే. "భావకవిత్వం ఒక అనుభవం. దీన్ని ఒకడు మరిఒకడికి బోధపరచటానికి వీల్లేదు." (216) "భావకవిత్వంలో ప్రధానంగా ప్రేమ కనిపించుతున్న దంటే అది నేటి కవిత్వపు పరిణామంలో ఒక మెట్టు.... రసంగా శృంగారానికి మనవారు ఉన్నత స్థానం ఇచ్చారు.... ఇదివరకు కవులు ప్రేమను వర్ణించారు. ఇక ముందు కూడా వర్ణించితీరుతారు.... మానవుని వయఃపరిమితిలో యౌవనమే ఉత్కృష్ట కాలం" (218 - 219) కవిత్వపు పరిణామాన్ని గురించి ప్రస్తావిస్తూ కూడా శ్రీశ్రీ భావకవుల ప్రేమ చిత్రణకి సమర్థనగా శృంగార రసాన్నీ, కవుల వయస్సునీ వుటంకించాడు. ప్రేమని కావ్య వస్తువుగా తీసుకునే విభిన్న యుగాల్లోని కవులు విభిన్న ప్రయోజనాల్ని దృష్టిలో పెట్టుకొని చిత్రిస్తారనేది విస్మరించాడు. పూర్వ కవుల శృంగార వర్ణనలో స్త్రీ భోగ్యవస్తువుగా, భావకవుల స్త్రీ ఆరాధనీయమైన వ్యక్తిత్వంగల ప్రేమమయి అని శ్రీశ్రీ గుర్తించకపోవటానికి కాల్పనిక దృష్టే కారణం. "పతనావస్థలో ఉన్న జమీందారీ కవిత్వం మీద వచ్చిన తిరుగుబాటే భావకవిత్వం అని ఇవాళ మనం సులువుగా గుర్తించగలం" (లే. పీఠిక. 1971) అంటూ శ్రీశ్రీ చారిత్రిక దృష్టితో పరిశీలించిన సందర్భంలో విశ్లేషించగలిగాడు.

"మానవుడు మహాకవి అయినప్పుడు అతీంద్రియ జ్ఞానంతో పనిచేస్తాడు. అప్పుడతని వాక్కు ఆదిమధ్యాంత రహితం అవుతుంది" (1946. రెండు. వచన భాగం 339) కన్యాశుల్కం విశ్వతోముఖత్వాన్ని గురించి చెప్పేటప్పుడు కూడా కవిని గురించి కాల్పనిక వుద్రేకంతోనే శ్రీశ్రీ చెప్పాడు.

"మొత్తంమీద Pure కావ్యరచనలన్నింటిలోనూ ఒక అతీత మహస్సున్నది...." "దాన్నందుకోదగిన ఇంద్రియాలున్న వారికి అందులోని గంధర్వ సంగీతం అను

క్షణానుభూతం" (426. 1935) "రచయిత మతం ఏదైనా నాకు పనిలేదు" (456) "యోగుల బ్రహ్మజ్ఞానం వంటిదే కవుల రసాన్వేషణం" (455) "నాకు ప్రత్యేక వ్యక్తులపట్లనే గౌరవం వున్నది" (456) "స్వసత్వద్యోతకమైన ప్రత్యేకత వాఙ్మయంలో అన్నిటికన్నా మిన్నగా ఉపాదేయం అనీ అందువల్లనే కవికి ఉన్నత శిఖరాలమీద స్థానం దొరుకుతుందనీ విస్మరించ కూడదు." (458. 1934)

"ఛందస్సుకీ, వ్యాకరణానికీ, అలంకారాలకీ- అన్నింటికీ అవతల స్వచ్ఛమూ, స్వచ్ఛందమూ, నీరవమూ, నిరూపమూ అయిన కవిత్వపదార్థం ఒకటి వుంది" (501. 1947) "కవిత్వం ఉంది. దీనిలో Pure Poetry శుద్ధకవిత్వం, కేవలకవిత్వం, అకల్మష కవిత్వం, కవిత్వం తప్ప మరేదీకాని, మరి దేనితోనూ కలుషితం కాని కవిత్వం ఒకటి" (511. 1947) "ఒక రచన ఉత్తమ సాహిత్యంగా స్థిరంగా నిలిచి పోవాలంటే దానిరీతి ఏదైనా, స్వరూపమేమైనా ఆత్మీయమైన హృదయపరివేదన అందులో ప్రస్ఫుటమై యుండాలి" (వచన విభాగం - మూడు - 216 - 1954) "ఏక కాలంలోనే పండిత పామరులుభయులనీ రంజించేదే గొప్ప కవిత్వం" (1954) "ఏక కాలంలో అనేక రసాలను ఉప్పొంగింపచేసే కళాఖండాలను మాత్రమే నేను ఉత్కృష్ట రచనలుగా అంగీకరిస్తాను. కథలలో, కవిత్వంలో, శిల్పంలో నేను ఇటువంటి రసానుభూతినే అన్వేషిస్తాను.... ఈ విధమైన రసానుభూతికి.... నేను రసన అని నామకరణం చేస్తాను. రసన లేనిదే సృజనలేదు" (332 - 1962) "మల్లారెడ్డి కావ్యమాధుర్యాన్ని ఆస్వాదించు" (1968)

శ్రీశ్రీ రసాస్వాదనం, రసానందం, ఆశ్చర్యం, శిల్పం, అనుభవం, హృదయం, ఆవిష్కరణ, అతీంద్రియజ్ఞానం, అతీతమహస్సు, అనుక్షణానుభూతం, రసాన్వేషణం, స్వసత్వద్యోతకం, స్వచ్ఛం, శుద్ధకవిత్వం, ఆత్మీయమైన హృదయ పరివేదన, రంజన, రసన వంటి ప్రత్యయాల్ని (Concepts) సంప్రదాయిక అర్థంలో వాడలేదు. ఇవన్నీ జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లండులలోని కాల్పనిక వుద్యమ ఆత్మాశ్రయ విమర్శనకు సంబంధించిన పారిభాషిక పదాలే. Beauty, Expression, Emotion, Pleases, Feeling, Pure Art, Communication, Revelation, Imagination, Vision, Genius and Sincerity of the artist, Intuition వంటి కాల్పనిక సౌందర్యవాద ప్రత్యయాలనే శ్రీశ్రీ ఆత్మాశ్రయ విమర్శదశలో వుపయోగించాడు. "Poetry always expresses inward states"[1] (Henri Bergson) (కవిత్వం ఆత్మగత అనుభవాల్ని ఆవిష్కరిస్తుంది)। "The Poet arranging his Verses, the musician composing his airs and harmonies, are well

aware that their real object lies beyond words and notes"2 (Eugene Veron) (తన గీతానికి ఆకారం ఇచ్చే కవికీ, తన రాగాన్నీ, శ్రావ్యతనీ కూర్చే సంగీత కళాకారుడికీ తన వాస్తవ లక్ష్యం శబ్దాలకీ స్వరాలకీ అతీతమయిందని తెలుసు)2

"The artist is the creator of beautiful things" (Oscar Wilde)3 (కళాకారుడు సౌందర్య వస్తువుల సృష్టికర్త)3 ఇలా శ్రీశ్రీ భావకవిత్వ దశలోని విమర్శలో సౌందర్యవాద (Eastheticism) ప్రభావం స్పష్టంగా నిరూపించవచ్చు. వాస్తవానికి శ్రీశ్రీ రాసిన భావకవిత్వం కంటే శ్రీశ్రీ రాసిన భావకవిత్వ విమర్శ విశిష్టమైనది. ఈ ధోరణి శ్రీశ్రీలో ఇప్పటికీ వుంది. వుద్యమానికి దూరం అయినప్పుడూ, ఏొంటరితనంలో పడినప్పుడూ శ్రీశ్రీ విమర్శలో ఈ సౌందర్యవాద దరహాసం కనిపిస్తుంది. విప్లవ సాహిత్య వుద్యమంలో భాగస్వామ్యం వహించిన తర్వాత ఈ సౌందర్యవాద విమర్శ, కవిత్వం కవిత్వం కోసమే అనే ధోరణి శ్రీశ్రీలో చాలా వరకు తగ్గిపోయింది. శ్రీశ్రీ సాహిత్య జీవితాన్ని కాలవిభాగంచేసి భావ కవిత్వ దశ, అభ్యుదయ కవిత్వ దశ అనే పరస్పర సంబంధంలేని పద్ధతిలో విభజించి పరిశీలించటం శాస్త్రీయ పద్ధతికాదు. అన్నీ శ్రీశ్రీ సాహిత్య వ్యక్తిత్వంలో అంశాలు. సామాజిక, సాంస్కృతిక కారణాలవల్ల ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క ధోరణి ప్రబలంగా కనిపించవచ్చును. అన్నీ శ్రీశ్రీ సాహిత్యవ్యక్తిలో విభజించటానికి వీల్లేని గుణాలు- కానీ భాగాలూ, దశలూకావు. శ్రీశ్రీ ఆధునిక విమర్శకుడు. కాల్పనికవాద విమర్శ అందులో ఒక అంశం. సంప్రదాయిక విమర్శ మీద తిరుగుబాటుగా వచ్చిందే కాల్పనికవాద విమర్శ. రాజుల మీదా, జమీందారుల మీదా, భూస్వాముల మీదా మధ్య తరగతి విద్యావంతుల భావనాత్మక తిరుగుబాటు కాల్పనిక కవిత్వానికీ, కాల్పనికవాద విమర్శకీ పునాది. రాజకీయ రంగంలో తిలక్ ఈ వాదానికి ప్రతినిధిగా వున్నాడు.

శ్రీశ్రీ అభ్యుదయ విమర్శను పరిశీలించటానికి ముందు కొన్ని సామాజిక పరిస్థితుల్ని అవగాహన చేసుకోవాలి. బ్రిటిషు వాళ్ళ అధికారంలో దేశ రాజకీయ, ఆర్థిక పరిస్థితుల్లో మార్పులు వచ్చాయి. గ్రామీణ ప్రాంతాల్లో భూస్వామ్య వర్గానికీ పేద, భూమిలేని రైతులకీ వైరుధ్యం వచ్చింది. బ్రిటిషువాళ్ళ ఆర్థిక విధానం నుంచీ దేశంలో జాతీయ బూర్జువా వర్గం పుట్టింది. 1880కే అనేక రైతాంగ పోరాటాలు జరిగాయి. నాగపూర్, బొంబాయి, కలకత్తాల్లో కార్మికవర్గం ఏర్పడింది. దళారి బూర్జువాలకీ జాతీయ బూర్జువా, కార్మికవర్గానికీ మధ్య వైరుధ్యాలు పొడచూపటం

జరిగింది. ఈ దశలోనే సంస్కరణవాద సాహిత్యం అని పిలవబడుతున్న జాతీయ బూర్జువావర్గ వుదారవాద సాహిత్యం వచ్చింది. విమర్శనాత్మక వాస్తవికత జాతీయ బూర్జువావర్గ సాహిత్య వాస్తవికతే. కందుకూరి, గురజాడ, గిడుగులు ఈ వర్గభావ జాలం నుంచి వచ్చినవాళ్ళే. దాదాభాయ్‌నౌరోజీ, సురేంద్రనాథ్ బెనర్జీలు ఈ జాతీయ బూర్జువా వర్గ వుదారవాదులే. వీళ్ళూ, జాతీయ బూర్జువావర్గ ప్రజాస్వామ్యవాదులూ కలసి నడిపిన జాతీయ వుద్యమ ఫలితంగా సాహిత్యంలో పత్రికలూ, కథ, నవల, నాటకం వంటి కొత్త ప్రక్రియలూ ఏర్పడ్డాయి. పౌరాణిక నాటకాల్లోని పద్యాలవల్ల కూడా ప్రజల్లో జాతీయ భావాల ప్రచారం జరిగింది. 1920 వచ్చేటప్పటికి క్రమంగా అక్టోబర్ విప్లవ ప్రభావం, పాశ్చాత్య దేశాల్లోని కమ్యూనిస్టు పార్టీల ప్రభావం (భారత దేశంలో 1922లో కమ్యూనిస్టుపార్టీ ఏర్పడింది) దేశంలో వామపక్ష భావాలు ప్రచారంలోకి వచ్చాయి. (1932లో New Signatures) 1934లో పారిస్‌లో (రాజారావు, ముల్కరాజ్ ఆనంద్, సజ్జద్ జహీర్లు) అభ్యుదయ రచయితల ప్రణాళిక విడుదల అయింది. 1930లో దేశ పరిస్థితుల్లో తీవ్రమైన మార్పులు వచ్చాయి. ఈ పరిస్థితుల నుంచి శ్రీశ్రీ మహాప్రస్థాన అభ్యుదయ గీతాలు రాసాడు. ప్రపంచంలో ఫాసిజానికి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలూ, భారత దేశంలో జాతీయోద్యమంలోని వామపక్ష శక్తులూ కార్మిక రైతాంగ పోరాటాలు శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాలకు ప్రేరణలు. శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వంతో పాటు అభ్యుదయ విమర్శ కూడా రాసాడు. శ్రీశ్రీ అభ్యుదయ విమర్శ ఒక రీతి క్రమంలోనూ సాగలేదు. అభ్యుదయ కవిత్వం రాసిన తర్వాత రాస్తున్న కాలంలోనూ కూడా కాల్పనికవాద విమర్శ కూడా రాసాడు. తన కవిత్వంతో పాటు గురజాడ సాహిత్యం, గిడుగు వ్యావహారిక భాషా వుద్యమం శ్రీశ్రీ అభ్యుదయ విమర్శలకు పునాదిని సిద్ధం చేశాయి. ప్రధానంగా గురజాడ సాహిత్య ప్రభావమే శ్రీశ్రీ కాల్పనికవాద విమర్శ నుంచి అభ్యుదయవాద విమర్శ వైపు ప్రయాణం చేయటానికి దోహదం చేసింది. గురజాడ ప్రభావం శ్రీశ్రీ కవిత్వం మీద కంటే శ్రీశ్రీ విమర్శ మీదనే ఎక్కువ వుంది. సాహిత్యం సమాజానికి సంబంధించింది, సాహిత్యానికి సామాజిక ప్రయోజనం వుంది అనే స్థూలమైన అవగాహన శ్రీశ్రీ గురజాడ నుంచి పొందాడు కనుకనే అడుగుజాడ గురజాడది అని శ్రీశ్రీ గురజాడ మీద గాఢమైన ఆరాధనను పెంచుకున్నాడు. తన విమర్శను గురజాడ మీద మాత్రమే ఎక్కువగా కేంద్రీకరించటానికి కారణం కూడా ఇదే. "కన్యాశుల్కమున సాంఘిక జీవన మందలి వివిధ రీతులు ప్రతి ఫలిస్తూ ఉంటవి" (శ్రీశ్రీ సాహిత్యం. ఒకటి. 185 - 1932) సాహిత్యంలో సాంఘిక

జీవితంలోని వివిధ రీతులు ప్రతి ఫలిస్తాయనే ఈ అవగాహనే స్థూలంగా శ్రీశ్రీ అభ్యుదయ విమర్శకు ప్రారంభ దశ. భారతి వంటి పత్రికల్లో 1938కి పూర్వం చేసిన గ్రంథ సమీక్షల్లో కథా క్రమము, కళారమ్యత వంటి పొడి మాటలే కనిపిస్తాయి. 'విశ్వం' ప్రేమగీతాల మీద కాల్పనికవాద విమర్శ ఒక్కటే విశిష్టంగా వుంది. అంటే ఆనాటికీ సాహిత్య విమర్శలో సామాజిక దృష్టి ప్రవేశించిందే కానీ బలపడలేదు. మహాప్రస్థాన గీతాలు రాసిన తర్వాత విమర్శలోనే కాల్పనికవాదం తగ్గుతూ అభ్యుదయ అంశం పెరుగుతూ వచ్చింది. ఇప్పటికీ శ్రీశ్రీ అభ్యుదయ విమర్శకు గురజాడ వాహికగానే వున్నాడు.

1946లో శ్రీశ్రీ విమర్శను గురించి ఇలా చెప్పాడు. "1. సాహిత్యవిమర్శ : కాలం నిర్ణయం, సమకాలికుల నిరూపణ, విషయ విమర్శ, ఛందోవివరణలు యీ వర్గంలోనివి. 2. గతితార్కిక భౌతికదృక్పథం : దీనిని మార్క్సిస్టు దృక్పథం అంటారు, ఈ కోణం నుంచి చూసినప్పుడు - కవికీ వస్తువుకీ, ఆనాటి ఆర్థికరాజకీయ సామాజిక వ్యవస్థకూ వున్న సంబంధాలు గ్రహించి వాటివల్ల కవి వివృతం చేసిన విషయాలు సంఘ పురోగమనానికి ఎంత వరకు తోడ్పడగలవో ఎంత సజీవమైన శబ్ద చిత్రణ ద్వారా కావ్యనిర్మాణం చేశాడో విలువ కట్టడం. 3. మనస్తత్వ పరిశీలన : కావ్యంలో వివిధ సన్నివేశాలలో పాత్రల లేదా కవియొక్క మనః పరివర్తనాలు యెట్లా వున్నాయో సిగ్మండ్ ఫ్రాయిడ్ లాగా పరిశీలించటం" (శ్రీశ్రీ సాహిత్యం మూడు వచన విభాగం - 207)

"అయితే యే ఆదర్శమూ లేకుండా విమర్శించడం శ్రేయస్కరంకాదు" (207)

"సంఘాన్ని ముందుకు నడిపించడమే విప్లవపంథా, అభ్యుదయరీతి. ఇది కావ్యవిమర్శకు గీటురాయి" (209) మార్క్సిస్టుదృక్పథాన్ని గురించి శ్రీశ్రీ వివరణ ఎలావున్నా అభ్యుదయ విమర్శ మీద స్థూలంగా మార్క్సిజం ప్రభావం వున్నదని శ్రీశ్రీ భావిస్తున్నట్టు స్పష్టం అవుతోంది. సంఘ పురోగమనానికి దోహదం చేసేవిధంగా సాహిత్య విమర్శ వుండాలనేది కూడా అభ్యుదయ విమర్శ లక్షణమే. ఇందులోనే కవిత్వంలో వస్తువుని ముఖ్యంగా విశ్లేషించాలని కూడా శ్రీశ్రీ చెప్పాడు. ఈ పద్ధతిలో సాగిన శ్రీశ్రీ సాహిత్య విమర్శలే అభ్యుదయ విమర్శ అనుకోవచ్చును. "అభ్యుదయవాదులు సాహిత్య పరిణామాన్ని జీవిత పరిణామంతో సమన్వయించి చూపిస్తారు.... సశాస్త్రీయమైన హేతువాద దృష్టిని ప్రదర్శిస్తారు" (శ్రీశ్రీ సాహిత్యం - వచన విభాగం. రెండు. 360)

"రచయిత ప్రజల మధ్య, ప్రజలతో కలిసిజీవిస్తాడు. అదొక ఆయుధం. దానితో ప్రజాయత్తమైన ప్రయోజనాన్ని సాధిస్తాడు." (409)

"ఏ కవికైనాసరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా ఆ చరిత్రకొక పరిణామం వుంటాయి. సామాజిక చారిత్రిక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది." (469)

"నిజానికి ఊపిరిపీల్చడం ఎంత సులభమో కవిత్వం చెప్పటం కూడా అంత సులభం" (500)

మేము సాహిత్య వేత్తలం. మాకూ రాజకీయాలకూ సంబంధం లేదు; అనే వాళ్ళ సంకుచిత దృష్టికీ నేను జాలిపడటం మానలేను. సాహిత్యానికీ రాజకీయాలకీ అవినాభావ సంబంధం వుంది."

"రాజకీయ సమస్యలంటే జీవిత సమస్యలు. సాహిత్య సమస్యలు కూడా అంతే" (517 - 1949) (2)

"షేక్స్పియర్ కానీ కాళిదాసు కానీ సహజ కవచకుండలాలతో జన్మించలేదు. వారికి పూర్వం వారిచుట్టూ అపారమైన విజ్ఞానంవుంది" (523)

"సామ్యవాద సమాజమే అభ్యుదయ రచయితల ధ్యేయం. అందుచేత అభ్యుదయ రచయితలంతా సామ్యవాదులే" (524 - 1949)

"కళ కళ కోసమే అనే వాదాన్ని నిరాకరించి ప్రజకోసమే కళ అనే సూత్రాన్ని చేపట్టారు" శ్రీశ్రీ సాహిత్యం. మూడు. (174 - 1960)

"భావం, భాషా, సంఘం – వీటికి అవినాభావ సంబంధంవుంది. వీటిలో ఏది ముందా ఏది వెనకా అన్న తికమక అవసరంలేదు" (197 - 2945)

"తాను ఏ సాంఘిక దురన్యాయాలను నిర్మూలించాలని ఆవేదన పడుతున్నాడో వాటి నిర్మూలనకే ఒక రాజకీయ పక్షం కూడా ప్రచారం సాగిస్తే కవి తనశిల్పాన్ని తప్పకుండా ఆ పక్షానికి అంకితం చేసి తీరుతాడు" (201 - 1946)

"కావ్యంలోని శిల్పాన్ని, వస్తువును విడదీయలేము. .... కావ్యంలో చెప్పేది ఏదైనా బాగా చెప్పబడి వుండటంవల్ల అది మంచిది కాదు. చెప్పిన దానికి చెప్పిన విధానికి సమానమైన ప్రాధాన్యం ఉంటుంది" (1946)

ఇది స్థూలంగా శ్రీశ్రీ అభ్యుదయ విమర్శన స్వరూపం. ఇది శ్రీశ్రీలోని కాల్పనిక ఆత్మాశ్రయ విమర్శకు పూర్తిగా విరుద్ధమైంది. అంటే శ్రీశ్రీ సాహిత్య

విమర్శలో కాల్పనిక దృక్పథంతో బాటు తాత్త్వికంగా, ప్రయోజనపరంగా దానికి పూర్తిగా విరుద్ధమైన అభ్యుదయ విమర్శనా పద్ధతి కూడా వుంది. శ్రీశ్రీ అభ్యుదయ విమర్శనా పద్ధతిని చేపట్టిన తర్వాత కాల్పనిక దృక్పథాన్ని పూర్తిగా వదులుకోలేదు.

గురజాడ కన్యాశుల్కం గురించి 1946లో వ్రాసిందీ - 47లో 'నా కవిత్వం'- 1, 2 లలో వ్రాసిందే ఈ వ్యాసంలోనే పైన చూపబడింది.

"సారస్వత సంస్థలు రాజకీయ పార్టీలతోనూ ఇజాలతోనూ ప్రత్యక్ష సంబంధం కలిగి ఉండరాదనే అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను" (1954. మూడు. వచన విభాగం) అంటూ ఆది మధ్యాంత రహితం, నీరవం నిరూపం, శుద్ధ కవిత్వం, కవి విశిష్ట వ్యక్తిత్వం, రాజకీయ పార్టీల మీద, 'ఇజాల'మీద వైరాగ్యం అంటూ కాల్పనిక శుద్ధ సౌందర్యవాద విమర్శ రాసాడు. రావిశాస్త్రి రచనల్లోని వర్గ చైతన్యాన్ని పట్టించుకోకుండా 1962లో 'రసన' సిద్ధాంతం చేయటం సౌందర్య లాలసత్వమే.

ఏక కాలంలో ఒక్కసారిగా నవ్వూ ఏడుపూ, ఆశ్చర్యం భయం కలిగించటం సాధ్యంకాదు. మనిషి మెదడు విరుద్ధ భావాల్ని పరంపరగా అనుభవించగలదు కానీ ఏక సమయంలో అనుభవించలేదు. దీన్ని బట్టి శ్రీశ్రీలో అభ్యుదయ విమర్శతో బాటు కాల్పనిక దృక్పథం కూడా వున్నదని గ్రహించవచ్చును. మహాప్రస్థానంలోనే కాల్పనిక కవిత్వ సందర్భాలు వున్నాయి. "కళారవి" అనే పేరుతో "మహాప్రస్థానం" లోని గేయం రోమ్ నగరం తగలబడుతుంటే ఫిడేల్ వాయించిన నీరో తత్త్వానికి దగ్గరగా వుంది. కవిత్వం కోసం కవిత్వం అనే సిద్ధాంతానికి ఇది ప్రబలమైన ఉదాహరణ. శ్రీశ్రీ అభ్యుదయ విమర్శ కాల్పనికవాదంలోని పలాయన వాదం మీద, ఆధ్యాత్మిక మూఢ వాదం మీదా మాత్రమే తిరుగుబాటు చేయగలిగింది. కళ కళ కోసమే అనే కాల్పనికవాద అంశం అలాగే వుండిపోయింది. సాహిత్యం నుంచి మార్క్సిజాన్ని గురించి తెలుసుకోవటం అభ్యుదయ విమర్శకి చాలదు. విప్లవ సిద్ధాంతాన్ని అధ్యయనం చెయ్యటమే కాదు, కార్మిక రైతాంగ పోరాటాల ఆచరణల నుంచి అవగాహన చేసుకోవాలి. అలాంటి ఆచరణాత్మక శాస్త్రీయ అవగాహనలేని అభ్యుదయ వాదం కాల్పనిక వాదాన్ని ధిక్కరించలేదు.

శ్రీశ్రీ అభ్యుదయ విమర్శ మార్క్సిస్టు విమర్శనమేనా? అనేది పరిశీలించాలి. గతితార్కిక భౌతికవాదం అని పేర్కొన్నాడు కానీ దానికి ఇచ్చిన వివరణలో చారిత్రక భౌతికవాదంలో కొన్ని అంశాల్ని మాత్రమే పేర్కొన్నాడు. మార్క్సిజం మీద

తనకున్న నమ్మకాన్ని నిర్ద్వంద్వంగా అనేకసార్లు ప్రకటించాడు. "కమ్యూనిజం మానవజాతి ప్రభాత గీతంగా సంభావిస్తున్నాను" (వచన విభాగం - మూడు - 281 - 1964) మార్క్సిజం మీద శ్రీశ్రీకి వున్న నమ్మకం విషయంలో రెండు అభిప్రాయాలు లేవు. నమ్మకంవేరు ఆ దృక్పథంతో రచన చేయటంవేరు. మార్క్సిస్టు దృక్పథం నుంచీ జీవితాన్ని అర్థంచేసుకొని కవిత్వంరాస్తారు. కానీ మార్క్సిజం మీదే కవిత్వం రాయరు. కానీ విమర్శకి మార్క్సిస్టు మూలసూత్రాల పరిజ్ఞానం అధికంగా అవసరం అవుతుంది. అభ్యుదయ విమర్శలో మార్క్సిస్టు దృక్పథం స్థూలంగా మాత్రమేవుంది. మార్క్సిజానికి విరుద్ధమైన అంశం శ్రీశ్రీ అభ్యుదయ విమర్శలో చాలావుంది. వేమన కవిత్వం గురించీ, తిక్కన కవిత్వం గురించీ ప్రశంసించే సందర్భంలో Thesis, Antithesis, Synthesis అనే త్రయాన్ని గురించి శ్రీశ్రీ చాలా అనాలోచితంగానూ, అపరిణితంగానూ అన్వయించటానికి పూనుకున్నాడు. హెగెల్ చెప్పిన ఈ త్రయాన్ని మార్క్సిస్టులు నిరాకరించారని శ్రీశ్రీకి తెలియదు. వేమన ఉప్పు కప్పురంబు.... పద్యంలోనూ (వచనవిభాగం - మూడు - 252 - 1954)

"తిక్కనగారి కవిత్వంలో నాకు డయలెక్టికల్ థీరీ కూడా కనబడుతుంది. మార్క్సు తర్క భాషలో అన్నట్టుగా థీసిస్ + యాంటీథీసిస్ = సింథసిస్ లాగా" (వచనవిభాగం - మూడు - 238 - 1969) అభివృద్ధి ఈ త్రయం నుంచీ జరుగుతుందనే వాళ్ళను పరిహాసంచేస్తూ లెనిన్ ఇలా అన్నాడు-

"It is clear to everybody that the main burden of Engel's argument is that materialist must depit the historical process correctly and accurately, and that insistence on... selection of examples which demonstrate the correctness of the triad is nothing but a relic of Hegelianism... And, indeed, once it has been categorically declared that to attempt to 'prove' anything by triads is absurd, what significance can examples of 'dialectical' process have?... Any one who reads the definition and description of the dialectical method given by Engels will see that the Hegelian triads are not even mentioned, and that it all amounts to regarding social evolution as a natural historical process of development... What Marx and Engels called the dialectical method is nothing more nor less than the scientific method in sociology, which consists in regarding

society, as a living organism in a constant state of development, the study of which requires an objective analysis of the relations of production which constitute the given social formation and an investigation of its laws of functioning and development." (Lenin: What the "Friends of the People" Are and How they Fight the Social Democrates - Part I)4

(భౌతికవాది చారిత్రిక క్రమాన్ని ఖచ్చితంగానూ ఖండితంగానూ వివరించి తీరాలనీ, త్రియం సరియైనదని చెప్పటానికి వుదాహరణల్ని ఏరి ప్రదర్శించటానికి ప్రయత్నంచేయటం హెగెలియన్ తత్త్వశిధిలావశేషం మాత్రమే అని చెప్పటమే ఎంగెల్స్ చర్చయొక్క సారాంశం. త్రియాల ద్వారా దేనినైనా రుజువుచేయటానికి యత్నించటం మూర్ఖత్వం అని తెలుసుకున్న తర్వాత 'గతితార్కిక' క్రమ వుదాహరణల వల్ల ప్రయోజనం ఏముంది? గతితార్కిక పద్ధతిని ఎంగిల్స్ నిర్వచించిన తీరునీ, వివరించిన పద్ధతినీ గమనిస్తే హెగెలియన్ త్రియాన్ని పేర్కొనటం కూడా జరగలేదని గుర్తించవచ్చును. సామాజిక పరిణామాన్ని అభివృద్ధికి సంబంధించిన ప్రక్రుతి - చారిత్రిక క్రమంగా ఎంగెల్స్ పరిగణించాడనీ గ్రహించవచ్చును.

సామాజిక శాస్త్రంలో శాస్త్రీయపద్ధతిగా గతితార్కిక విధానాన్ని మార్క్స్, ఎంగెల్స్ చెప్పారు. ఈపద్ధతి సమాజాన్ని నిరంతర అభివృద్దిదిశలో వుండే అవయవిగా పరిగణిస్తుంది. ఈరకమైన అధ్యయనానికి ఒక నిర్దిష్ట సామాజిక వ్యవస్థలో వుండే వుత్పత్తి సంబంధాల్ని వస్తుగతంగా విశ్లేషించటం, ఆ సమాజం పనిచేసే, అభివృద్ధి పొందే సూత్రాల్ని పరిశోధించటం అవసరం")4

కాబట్టి శ్రీశ్రీ కానీ మరొకరు కానీ సాహిత్య విమర్శలో ఈత్రయంతో క్రీడలాడటం అశాస్త్రీయం. "ఏ కవియొక్క ఆవిర్భావంవల్ల ఈ ప్రపంచం యింకో అడుగు ముందుకువేసిందో ఆ కవే మహాకవి" (మూడు - వచనవిభాగం .. 250 - 1954) ప్రపంచం అడుగు ముందుకువేసే వాస్తవికతను చెప్పటంవల్ల కవి విశిష్ట కవి అవుతాడు కానీ కవి ఆవిర్భావంవల్ల ప్రపంచం ముందడుగు వేయదు. కవికి ప్రపంచ పురోగమనం కారణం అని చెప్పక కవే ప్రపంచ పురోగమనానికి కారణం అని చెప్పటం కాల్పనిక దృక్పథమే. "సార్వజనీనత, సార్వకాలికత కృష్ణదేవరాయల కాలం వరకూ వచ్చిన ప్రబంధాల్లోనూ కావ్యాల్లోనూ కనబడతాయి" (244) ఈ సార్వజనీనత, సార్వకాలికతలు శ్రీశ్రీ అభ్యుదయ విమర్శనిండా కనిపిస్తాయి. గురజాడను గురించి ప్రస్తావించినప్పుడల్లా శ్రీశ్రీ ఈ సార్వజనీన సార్వకాలికతల్ని వదిలిపెట్టడు. గతితార్కిక

భౌతికవాదం సార్వజనీన, సార్వకాలికతల్ని అశాస్త్రీయ భ్రమలని నిరూపించింది. శ్రీశ్రీకి జీవితంమీద కంటే కవిత్వంమీద వుండే కాల్పనిక మమతే ఈ సార్వజనీన, సార్వకాలిక సిద్ధాంతాల్ని చేయిస్తుంది. "జీవితంలో ఏ సందర్భానికయినా సరిపోయే మాటలు ఎక్కడో ఒకచోట గురజాడ మహాకవిలో దొరుకుతాయి" (వచనం - రెండు 339) మిశ్రమ ఆర్థిక విధానం, రాకెట్, నక్సలైట్, ముఖ్యమంత్రి - దొరుకుతాయా గురజాడలో? మళ్ళీ శ్రీశ్రీయే "దేశకాల పాత్రానుబద్ధాలైన శాశ్వతమైన చలనంలేని స్ఖలనంలేని విలువలేవో ఉన్నాయని వీళ్ళు జాలిగా నమ్ముతారు. ఆ విలువలని తమ ఆరాధ్య దేవతలలో చూస్తారు" (వచనం - మూడు - 326) అంటాడు. మరి అలాంటి విలువల్ని శ్రీశ్రీ తన 'ఆరాధ్యదేవత' గురజాడలో చూశాడుగదా? శ్రీశ్రీ అభ్యుదయ విమర్శమీద మార్క్సిజం ప్రభావం వున్నప్పటికీ ప్రధానంగా సామాజిక స్పృహవున్న విమర్శగానే నిర్ణయించాలి. విమర్శనాత్మక వాస్తవికత అనబడే జాతీయ బూర్జువా భావజాలం, పెటీబూర్జువా కాల్పనిక వాదం శ్రీశ్రీ అభ్యుదయ విమర్శలో ముఖ్యమైన లక్షణాలు.

"నిత్యనూతన ప్రయోగాల వల్లనే సాహిత్యం కూడా సైన్సు లాగే అభివృద్ధి పొందుతుంది" (వచన విభాగం - మూడు - 261 - 1965)

"ఆ రోజుల్లో నేను చదివిన గ్రంథాలే నన్ను బాగా Influence చేశాయి. మహాప్రస్థానం అన్నగీతం రాసేనాటికి నాకు Marxism ను గూర్చి తెలియనే తెలియదు. నేను Marxism ను తెలుసుకున్నది సాహిత్యం ద్వారానే కాని రాజకీయాలద్వారా కాదు" (286 - 1969)

"మహాసముద్రంలో హిమపర్వతంవలె మన సుప్త చైతన్యం మూడింట రెండు వంతులు మట్టం క్రింద వుంటుందని మనస్తత్వ వేత్తలు అంటారు. స్వప్న సీమల్లో నుంచి, సుప్త చైతన్యంలో నుంచి కవులు సత్యాలు వెదికి తెస్తారు" (ఒకటి. కావ్య, వచన విభాగాలు - 180 - 1944)

"హృదయాలను, మానసాలను కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతరాల్లో కవికి నిరాఘాటంగా విహరించగల అధికారం కలదు" (కావ్య వచన విభాగం - 1 - 1934)

"అసాధ్యాన్ని సాధించడానికి మార్గాలు అన్వేషిస్తున్నప్పుడు కళాశీలి అనుభవించే అశాంతిలోనే మహాకావ్యం ఆవిర్భవిస్తుంది" (రెండు. వచన విభాగం. 334. 1946)

"నీకేమీ తెలియదని నాకు తెలుసును. కలకత్తాలో ప్రస్తుతం పెట్రోలు ఎలా అమ్ముతున్నదో నీకు తెలుసా? విజయనగరంలో హరిదాసులెంత మంది ఉన్నారు? రోజున్నరలో కోడిన్నర గుడ్డున్నర పెడితే" (రెండు. వచనం. 357)

"డాడాయిజం కేవలం విధ్వంసనమే నిరాకరణమే పనిగా కలది.... సాహిత్యంలో అరాజకత్వానికి ఇది పరమావధి అనవచ్చును" (రెండు. వచన. 474)

"అపస్మారక మనస్సు నుండి స్వప్నలోక రహస్యాలను సంగ్రహించటానికి చేసే ప్రయత్నమని సర్రియలిజాన్ని నిర్వచించవచ్చును" (శ్రీశ్రీ - వచన - రెండు - 475)

"రష్యాలో వచ్చిన సామ్యవాద విప్లవాని కెంత ప్రాముఖ్యంవుందో సాహిత్య ప్రపంచంలో యులిసెస్ నవల కంత ప్రాబల్యం ఉంది" (శ్రీశ్రీ. రెండు. 493)

"సజీవ రచన ఒక్కొక్కప్పుడు వినాశకరముగా పనిచేసినప్పటికీ, అది ఇతః పూర్వము పాతుకుపోయి, ప్రయోజనాన్ని కోల్పోయిన భావాలను నిర్మూలనము చేసి కుటుంబరావుగారు చెప్పిన కృత్రిమ ఏకత్వము స్థానే ఒక నూతన సమన్వయాన్ని సంపాదిస్తుంది." (శ్రీశ్రీ - మూడు వచన విభాగం - 255. 1959)

శ్రీశ్రీ ఫ్రెంచి కాల్పనిక రచనలే కాక ఆధునికమైన ప్రయోగవాద సాహిత్యాన్ని అధ్యయనం చేశాడు. సాహిత్యాన్ని ప్రయోగాలు అభివృద్ధి చేస్తాయని అభిప్రాయ పడ్డాడు. మహాప్రస్థాన రచనలు చేసే కాలంలోనే శ్రీశ్రీ ప్రయోగవాదాల్ని కూడా జీర్ణం చేసుకున్నాడు. డాడాయిజం, క్యూబిజం, ఇమేజిజం, ఫ్యూచరిజం, సర్రి యలిజం, చైతన్యస్రవంతి వంటి పాశ్చాత్య దేశాల్లోని కళా సాహిత్య ఉద్యమాల ప్రభావం శ్రీశ్రీ మీద ప్రగాఢంగా వుంది. మహాప్రస్థాన గీతాల్లో అక్కడక్కడా ఈ ఉద్యమాల ప్రభావం వుంది. సర్రియలిజం, ఇమేజిజం, డాడాయిజం రచనలే చేశాడు. ఈ సాహిత్యంలో భాగంగానే ప్రయోగవాద విమర్శ కూడా శ్రీశ్రీ రాసాడు. మార్క్సిజంతో పాటు ఈ ఇజాలన్నీ శ్రీశ్రీ కవిత్వంలోనూ, వచన రచనల్లోనూ నాటికల్లోనూ సాహిత్య విమర్శలోనూ అవిభాజ్యంగా కలిసిపోయాయి. శ్రీశ్రీ తొలి దశలో మార్క్సిజాన్ని ఫ్రెంచి సర్రియలిస్టు రచయితల నుంచి నేర్చుకొని వుండ వచ్చును. ఫ్రెంచి సర్రియలిస్టు రచయితలకీ ఇతర దేశాలలోని సర్రియలిస్టు రచయితలకీ చాలా తేడా వుంది. 1935 వరకూ అభిప్రాయ భేదాలు వుండినప్పటికీ ఫ్రెంచి సర్రియలిస్టు కళాకారులు ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీతో వున్నారు. సమాజంలో, కళారంగంలో వీళ్ళు సంప్రదాయం మీదా, యథాతథవాదం మీదా తిరుగుబాటు చేశారు.

"We are determined to create Revolution"5 (మానిఫెస్టో) (మేమువిప్లవం చెయ్యటానికి నిశ్చయించు కున్నాం)5 "We are Specialists in Revolt"6 (Manifesto) (మేము తిరుగు బాటుచెయ్యటంలో సమర్థులం)6 అంటూ ఆనాటి ఫ్రెంచి సర్రియలిస్టు రచయితలు విప్లవ ఆశయాన్ని ప్రకటించారు. ప్రజలరాజకీయాల్నీ, మార్క్సిజాన్ని అంగీకరిస్తున్నామని స్పష్టంగా చెప్పుకున్నారు. కార్మిక వర్గ విప్లవంతో మమేకం కాకుండా ఇతర మార్గాల ద్వారా విప్లవానికి సహకారం చేస్తామని ప్రకటించుకున్నారు. పార్టీతో పేచీపెట్టుకొని విడిపోయిన తర్వాత కూడా ఫ్రెంచి సర్రియలిస్టులు తిరుగుబాటు విషయంలో నిబద్ధంగానే వున్నారు. ముందు నుంచీ ఫ్రాయిడ్ సిద్ధాంతాల ప్రభావం వుంటే వుండవచ్చును కానీ ఫ్రాయిడ్ సిద్ధాంతాల్తో ప్రత్యక్ష సంబంధంలేని సర్రియలిస్టు రచయితలు కూడా వున్నారు. వాళ్ళల్లో వామపక్ష భావాలు లేని వాళ్ళూ వున్నారు. రాజకీయమైన ఆలోచనాధోరణీ, సుప్త చైతన్య సీమకు ప్రాధాన్యం, కామకేంద్రాన్ని (Libido) ప్రధాన పాత్రగా చెప్పటం, రాజకీయ నిబద్ధత సర్రియలిజం ప్రధాన లక్షణాలు. ఒక వస్తువుని, ఆ వస్తువుకి ఇతర వస్తువులతో దేశ, కాలాల్తో వుండే సంబంధం నుంచీ విడదీసి, సుప్త చైతన్యంలో పొదుకొని వుండే ఇతర సంబంధాలతో కలిపి చెప్పటం, ఒక స్థలంలో వుండటానికి మామూలుగా అవకాశం, అవసరం లేని వస్తువుల్ని అసంగతంగా ఒక చోట వున్నట్టు చెప్పటం, స్వప్నంలోని భావరూపాలను (Dream image) చెప్పటం సర్రియలిస్టు కళలోని ప్రధానరీతి. "ఎడారిలో ఆకాశంలో క్షణంలో సగంలో ట్రాంలో సెలూన్‌లో జనం మధ్య సముద్రం మధ్య జనసముద్రం మధ్య" (వచన విభాగం - రెండు - 49) శ్రీశ్రీ కవిత్వంలోనూ విమర్శలోనూ కూడా సర్రియలిజం ప్రబల ధోరణిగావుంది. అసలు మార్క్సిజాన్ని శ్రీశ్రీ సర్రియలిస్టు రచనల నుంచి కూడా తెలుసుకున్నాడు. అందుకే శ్రీశ్రీ సాహిత్యంలో మార్క్సిస్టు ప్రభావాన్ని పరిశీలిస్తున్నప్పుడు సర్రియలిస్టు ప్రభావాన్ని కూడా దృష్టిలో వుంచుకోవాలి. "తిరుగుబాటు మావేదాంతం" అనేది సర్రియలిస్టులు కూడా చెప్పగలరు. 1968 ఫ్రెన్చ్ విప్లవంలో కూడా సర్రియలిస్టు నినాదాలు కనిపిస్తాయి. కళానిబంధన మీదా సనాతన శిల్పవాదం మీదా సర్రియలిజం తిరుగుబాటు చేసింది. కాల్పనిక వాదులు సర్రియలిస్టులుగా కానీ నియోసంప్రదాయవాదులుగా కానీ మారిపోతారు. సర్రియలిజం శ్రీశ్రీలోని సౌందర్యవాదాన్ని దెబ్బకొట్టగలిగింది. 1930 - 40 నాటి మార్క్సిస్టు రచయితలు చాలామంది సర్రియలిస్టు రచనలు కూడా చేశారు. శ్రీశ్రీ సాహిత్యంలోనూ, సాహిత్య విమర్శలోనూ సర్రియలిజం మార్క్సిజం సమ్మేళనం పొందాయి. స్మశానాల వంటి

నిఘంటువులూ, ఛందస్సుల సర్పపరిష్వంగాలూ, వ్యాకరణాల సంకెళ్ళూ సర్రియలిస్టు నిరసనలే. కవితా ఓ కవితా సర్రియలిస్టు ధోరణి కవిత్వమే. అందులో స్వప్నభావ రూపాలు (Dream images) అనేకం వున్నాయి. సర్రియలిస్టు వాస్తవిక వాదం గతితార్కిక భౌతికవాద వాస్తవికతకి విరుద్ధమైంది. విప్లవ రచయితకి సర్రియలిజం ఆయుధంగా పనికిరాదు. "Down with Socialist realism, longlive surrealism"7 (సోషలిస్టు వాస్తవికత నశించాలి. సర్రియలిస్టు వాస్తవికత వర్ధిల్లాలి")[7] అన్నారు 1968 ఫ్రెంచి యువ తిరుగుబాటుదారులు. ఈ తిరుగుబాటును కూడా శ్రీశ్రీ అభినందించిన విషయం గమనించదగిన విషయం. "Surrealism is not a poetic form. It is a cry of the mind turning toward itself and determined in desperation to crush its fetters. And, if need, by material hammers"8 (1925) (సర్రియలిజం కవిత్వరూపం కాదు. అది మానసిక ఆక్రోశము. అది నైరాశ్యంలో మానసిక సంకెళ్ళను నిశ్చయంగా బద్దలు కొడుతుంది. అవసరమైతే సంకెళ్ళ నుంచి మానసిక విముక్తి కోసం తుపాకుల్ని వుపయోగిస్తుంది)[8] అని ఫ్రెంచి సర్రియలిస్టుల ప్రకటన శ్రీశ్రీ వంటి అగ్నిసరస్సును కదిలించటం సహజం. శ్రీశ్రీ అభ్యుదయ విమర్శ పరిభాషలోని సర్రియలిస్టు ఛాయల్ని సూక్ష్మంగా విశ్లేషించుకోవాలి. లేకపోతే శ్రీశ్రీ విమర్శలోని గుణాల్నీ, లోపాల్నీ విభజించుకోలేం. ఇప్పటికీ శ్రీశ్రీ విమర్శనలో కాల్పనిక, సర్రియలిస్టు, మార్క్సిస్టు ధోరణులు కలిసేవున్నాయి. 1946లో శ్రీశ్రీ మనస్తత్త్వ విమర్శని ఒక విమర్శనా పద్ధతిగా భావించటానికి ఇదే కారణం.

సర్రియలిజాన్ని ప్రశంసించిన శ్రీశ్రీ డాడాను ప్రశంసించలేకపోయాడు. అయితే శ్రీశ్రీ సాహిత్యంలో సాహిత్య విమర్శలో డాడా ఛాయలు అసలేలేకపోలేదు. "గట గటా! గభ గభా! భగ భగా! గగభగగా! గాగాభాగాగా! గాభాగా! గాగా! గాభాగాగా! బాగా" (వచనం - రెండు. 72. 1948) డాడా కూడా అన్ని దేశాల్లోనూ ఒక విధంగానే లేదు. డాడాలో కేవల విధ్వంసన స్వభావం మాత్రమే లేదు. "In the considered opinion of this manifesto, DADA has both destructive and constructive sides"9 (1949) (ఈ ప్రణాళిక బాగా చర్చించిన వాళ్ళు డాడాలో నిర్మాణాత్మక, నిర్మూలనాత్మక అంశాలున్నాయని గ్రహించగలరు)[9]

"Dada is German Boulshevism"10 (Richard Huelsen back) (డాడా జర్మన్ బోల్షెవిజం)[10] డాడాయిస్టులు అందరూ సంప్రదాయాన్ని వ్యతిరేకించారు. ఇది కళకు వ్యతిరేకమైన కళ. చాలా మంది 'డాడాయిస్టులు కమ్యూ

నిస్టుల్లో చేరారు. 'ప్రపంచ కళాకారులారా ! కమ్యూనిస్టుల్తో అయిక్యంకండి' అని పిలుపు ఇచ్చారు. రాజకీయాలకీ సాహిత్యానికీ అయిక్యతని అంగీకరించారు. వచన కవితనీ (Free Verse) శబ్ద కవితనూ (Free Words) కూడా కవిత్వంగా పరిగణించారు. కళాస్వేచ్ఛను కోరటం, విలువల్నీ రూపాల్నీ మౌలికంగా ప్రశ్నించటం దాదా ప్రధాన లక్షణం. అసాధారణ చర్యల్తో దిగ్భ్రాంతి కలిగించటం, నిరంతర వాదోపవాదాలకి సిద్ధంకావటం, చాలామంది కలిపి ఏక కాలంలో కవిత్వం (Simultaneous Poetry) చెప్పడం దాదా లక్షణాలు. శ్రీశ్రీ సాహిత్యంలోనూ (మేమే) సాహిత్య విమర్శలోనూ కూడా దాదా ఛాయలు వున్నాయి. "కన్యాశుల్కంలో గిరీశం మాట్లాడిన ఎన్నో మాటలు ఆధునిక కవిత్వం అంటాను" (శ్రీశ్రీ. వచన విభాగం - 3 287. 1969) మాటల్నే కవిత్వం అనటం Free Words Poetry స్వచ్ఛంద శబ్ద కవిత్వం అనే దాదా లక్షణమే.

"Cubism was a school of painting, futurism a political movement. Dada is a state of mind. To oppose one to the other reveals ignorance or bad faith"11 (Trist an Thara) (క్యూబిజం చిత్రకళలో ప్రస్థానం ఫ్యూచరిజం రాజకీయ వుద్యమం. దాదా ఒక మానసిక దశ. వీటిల్లో ఒకదానికి మరొక దానికి వైరుధ్యాన్ని కల్పించటం, ఒకదాని నుంచి మరొక దానిని వ్యతిరేకించటం అజ్ఞానంఅన్నా కావాలి. కాకపోతే తప్పుడు విశ్వాసంఅన్నా కావాలి)11 సర్రియలిజానికి దాదా తెర తీసింది. బూర్జువా వర్గాన్ని వ్యతిరేకించింది. పారిస్‌లో సాహిత్య చైతన్యంతో మార్పును సాధించటమే కాక ఒక విప్లవ విభ్రాంతిని సృష్టించింది. చైతన్యస్రవంతిని మొదటి సారిగా విలియం జేమ్స్ (1890) తన మనస్తత్వ శాస్త్ర గ్రంథంలో పేర్కొన్నాడు. మనస్సులోని ఆలోచనల్నీ, జ్ఞాపకాల్నీ, సంవేదనల్నీ, యథేచ్ఛా అనుబంధాన్నీ అవిచ్ఛిన్నంగా చెప్పటం చైతన్యస్రవంతి. ఈ చైతన్య స్రవంతికి సంబంధించిన శిల్పాంశాల్నీ జేమ్స్ జాయస్ యూలిసెస్‌లో పరిణత స్థితిలోవున్నాయి. శ్రీశ్రీ యూలిసెస్‌ని అతిగా ప్రశంసించాడు. కానీ జేమ్స్ జాయస్ గ్రంథం మీద మార్క్సిస్టు విమర్శకుల అభిప్రాయం ఇలావుంది-

"We are stimulated, and then nothing comes but barren mysticism, insincerity and coldness" (Alik west: Crisis and Criticism, 1937)12 (మనం వుత్తేజితులం అవుతాం. కానీ ఆ వుత్తేజం నుంచి విఫల దురవగాహన, వంచన నీరసత్వం తప్ప ఏమీ పొందలేం)12

20వ శతాబ్దంలో కళా, సాహిత్య రంగాల్లో వచ్చిన నూతన వస్తురూపాల్ని ఆధునిక కవిత్వం లేదా ఆధునిక సాహిత్యం అంటారు. 1920 నుంచీ పాశ్చాత్య

దేశాల్లోని సాహిత్య ప్రయోగపరత్వాన్ని ఆధునికత అంటారు. ఈ ప్రయోగాలన్నీ ప్రపంచ సాహిత్యాన్ని ఆధునికం చేయటంలో మహత్తరమైన పాత్ర నిర్వహించాయి. ఈ ఆధునిక ప్రయోగాల ప్రభావం శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాల్లోనూ, నాటికల్లోనూ, వ్యాసకవితల్లోనూ, (పొంగ రంగ రంగరాలు వంటివి) నాటికల్లోనూ, ఖడ్గసృష్టి గీతాల్లోనూ ప్రగాఢంగా వుంది. శ్రీశ్రీ సాహిత్య విమర్శ మీద కూడా వుంది. "కన్యాశుల్కంలోని వాస్తవికత మీద వ్రాయాలంటే చాలా వుంది. అదంతా అయిన తర్వాతనే అందులోని అధివాస్తవికతను పరిశీలించాలి" (రెండు. వచన విభాగం. 340 - 1946) ఆధునిక కవిత్వంమీద శ్రీశ్రీ ప్రత్యేకంగా వ్యాసాలు కూడా రాసాడు. ఈ ప్రయోగవాద సాహిత్యం శ్రీశ్రీని కాల్పనిక వాదంలోకి, సంప్రదాయ వాదంలోకి తిరోగమించకుండా రక్షించటంలో ప్రధాన పాత్రని నిర్వహించింది. భావకవిత్వాన్ని చావుదెబ్బలుకొట్టి అభ్యుదయ సాహిత్యంవైపు రచయితల్ని సంఘటితం చేయటంలో ఈ ప్రయోగవాద సాహిత్యం విప్లవాత్మకమైన పాత్రను నిర్వహించింది. శ్రీశ్రీ ఆలోచనల్ని ఆధునికంగా నిలబెట్టినవి ఈ ప్రయోగవాదాలే. ఇప్పటికీ ప్రయోగవాద ప్రభావం శ్రీశ్రీ సాహిత్యం మీదా సాహిత్యవిమర్శ మీదా వున్నది. ఈ ప్రయోగ వాదాలు సాహిత్య స్వరూపం మీద వున్న మూఢ విశ్వాసాల్ని బద్దలు గొట్టగల్గాయి. కానీ సాహిత్యవస్తువులో ప్రయోజన పరత్వం లేదు. వీళ్ళు మనిషిని సామాజికంగా చారిత్రికంగా అవగాహన చేసుకోవటంలో విఫలం అయ్యారు.

"Many of the great works of modren literature sum to exist in a vaccum, to spring from no particular society and to address no particular audience" (The Nature of a Revolution: by Graham Haugh. 1960) 13 (ఆధునిక సాహిత్యంలోని ప్రముఖ గ్రంథాల్లో అధికభాగం శూన్యంలో వున్నట్టు అనిపిస్తుంది. అవి ఒక నిర్దిష్ట సమాజం నుంచి పుట్టినట్టు కన బడదు. అవి నిర్దిష్ట శ్రోతల్ని వుద్దేశించినట్టు అనిపించదు)13 కాబట్టి ఆధునిక ప్రయోగవాదం ప్రయోజన పరంగా కూడా వున్నప్పుడే విశిష్ట సాహిత్యాన్ని సృష్టించ గలుగుతుంది. శ్రీశ్రీ సాహిత్య వ్యక్తిత్వాన్ని ప్రయోగవాద ధోరణులు ఆధునికం చేసాయి కానీ శూన్యంలోకి తిరోగమించేటట్టు చేయలేదు. ఆధునిక సాహిత్యంఅంటే ప్రయోగవాదమే కాదు. ఆధునిక జీవితాన్ని ప్రతిబింబించిన సాహిత్యం అంతా ఆధునిక సాహిత్యమే. ఆధునిక యుగంలో మనిషికి తనను గురించిన అవగాహనలో మార్పు వచ్చింది. తన కళతో కళాకారునికి వుండే సంబంధంలో మార్పు వచ్చింది.

"Modren art is that in which the artist reflects awareness of an unprecedented modren situation in form and idiom" (Stephen

Spender - the Struggle of the modren)[14] (కళాకారుడు రూపంలో రీతిలో ఇంతకు పూర్వం ఎన్నడూలేని ఆధునిక స్థితికి సంబంధించిన చైతన్యాన్ని ప్రతిబింబించటం ఆధునిక కళఅంటారు) 14 ఈ విశాలార్థంలోనే శ్రీశ్రీ సాహిత్యంలో శ్రీశ్రీ సాహిత్యవిమర్శలో ఆధునికత వుంది. కాల్పనిక, అభ్యుదయ విమర్శలు ఆధునిక విమర్శలో భాగమే. ఆధునిక విమర్శ అంతా కాల్పనిక అభ్యుదయ విమర్శ మాత్రమే కాదు. ప్రయోగవాదం ఆధునిక విమర్శలోకి విజ్ఞానశాస్త్ర దృక్పథాన్నీ, మనస్తత్త్వ శాస్త్ర పరిశోధనల్నీ ప్రవేశపెట్టింది. అభ్యుదయ విమర్శ ప్రయోజనపరమైన ప్రయోగాన్ని మాత్రమే ఆహ్వానిస్తుంది. ప్రయోగం కోసం ప్రయోగం అనే వాదాన్ని నిరాకరిస్తుంది. శ్రీశ్రీ ప్రయోజనపరతలేని ప్రయోగవాదాన్ని కూడా సమర్థించాడు.

శ్రీశ్రీ రచయితల్ని గురించీ రచనలను గురించీ విమర్శ రాసేటప్పుడు అతి ప్రశంస చేయటం కనిపిస్తుంది. ఈమేర మీరిన ప్రశంస వలన సాహిత్య విమర్శకి నష్టమే కానీ లాభం ఏమీ వుండదు. "కన్యాశుల్కం గొప్పది. జీవితమంత గొప్పది. సాహిత్యంలో వాస్తవికతను ఇంత సమగ్రంగా ప్రదర్శించిన నాటకం ఈనాటికీ మన దేశంలో లేనేలేదు" (రెండు - వచన విభాగం - 340) అనేక సందర్భాల్లో ఇంతకంటే ఎక్కువగానే శ్రీశ్రీ కన్యాశుల్కాన్ని ప్రశంసించాడు. కన్యాశుల్కం గొప్ప నాటకం అనటంలో రెండు అభిప్రాయాలు లేవు. కానీ అది ఒక్కటే ఆధునిక భారతీయ నాటకాల్లో గొప్ప నాటకం అనడం సమంజసం కాదు. బెంగాలీలో నీలిదర్పణ్, జమీందారీ దర్పణ్ కన్యాశుల్కం కంటే తక్కువ రకం నాటకాలు కావు. తెలుగులో మా భూమి, ముందడుగు, ఆత్రేయ నాటకాలు కన్యాశుల్కంతో సమానంగా నిలబడగల నాటకాలే.

"రవీంద్రుడి కంటే పాంచకడీ దేవుడే గొప్పవాడని నేను నిజంగా నమ్ముతున్నాను... నిస్సందేహంగా గీతాంజలి కంటే వాదేపీడు గొప్పగ్రంథం" (శ్రీశ్రీ. వచనవిభాగం - 2 - 415) "ప్రపంచమంతా హారతిపట్టినా నేను టాగూరును కవిగా అంగీకరించలేను. ఎవరూ ఎక్కువైనా గురజాడను గొప్పకవిగా ఎన్నికచేయటం మానలేను" (వచన 2 - 420) ఇది హేతువాద దృష్టిగల ఆధునిక విమర్శకుని లక్షణంకాదు. తాత్త్వికంగా గురజాడ దృక్పథం రవీంద్రుని దృక్పథం కంటే ఆధునికం. కానీ టాగూరుని కవి కాదనటం, గీతాంజలికన్నా వాదేపీడు గొప్పదనటం శాస్త్రీయమైన విమర్శకాదు. గీతాంజలిలో ఆధ్యాత్మిక భావాలతో బాటు విముక్తి భావాలు కూడా వున్నాయి. టాగూరుని కవి కాదనటం అర్థరహితం.

"శరత్‌బాబు మన చింతాదీక్షితులుగారి మోకాళ్ళదాకా నైనా రాడు" (శ్రీశ్రీ. వచన. రెండు. 549 - 1945) చింతాదీక్షితులు గొప్ప రచయిత అనడానికి శరత్‌ని అవమానించవలసిన అవసరం ఏమీలేదు. భారతీయ నవలా సాహిత్యంలో శరత్‌కి సహేతుకంగానే వున్నత స్థానంవుంది.

"ఆది కాలంలో తిక్కన, మధ్య కాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ నాకు అభిమాన కవులు. ఈ ముగ్గురూ ప్రజాకవులే కావటం విశేషం." (శ్రీశ్రీ. వచన. 3 - 237) దీన్ని శ్రీశ్రీ పదే పదే చెపుతుంటాడు. చారిత్రికంగా, సామాజికంగా ఈ ముగురికీ ఏమీ సంబంధం లేదు. తెలుగు మాటలు వాడటమే దీనికి ప్రమాణం అయితే మరీ అర్థరహితం. దానికూడా విభిన్న కారణాలు వున్నాయి. శ్రీశ్రీయే చెప్పినట్టు తిక్కన నియోగి, పరిపాలనా యంత్రాంగంలో భాగస్వామి కావటం, శివకవి వుద్యమం తిక్కన తెలుగు మాటలు ఎక్కువ వాడటానికి కారణం కావచ్చును. వేమన జనంలోవున్న మూఢ విశ్వాసాల మీద విమర్శలు ముక్తక రచనల్లో చేశాడు. భక్తి వుద్యమం, పట్టణ జీవితం అభివృద్ధిపొందటం, వర్ణ వ్యవస్థపట్ల వ్యతిరేకత వేమన తెలుగు మాటలు ఎక్కువవాడటానికి కారణం కావచ్చును. ఇద్దరూ గ్రాంథికంలోనే రాసారు. గురజాడ జాతీయ బూర్జువాకవి. ఈ వర్గావసరాలకోసం గురజాడ వ్యవహారిక భాషను చేపట్టాడు. తాత్త్వికంగా ఈ ముగ్గురికీ ఏమీ సంబంధంలేదు. తిక్కన ప్రజాకవి కాడు. పాలకవర్గకవే. వేమన ఆనాటి వ్యాపారస్తుల కవి, గురజాడ జాతీయ బూర్జువా, మధ్యతరగతి మేధావిబృంద కవి, ముగ్గురినీ ప్రజాకవులనడం అభ్యుదయ విమర్శకి విరుద్ధం. ఇలాంటి ప్రశంసలు కొన్ని వున్నప్పటికీ అసలే శ్రీశ్రీ లోపాల్ని చూడలేదనడం వాస్తవంకాదు. కన్యాశుల్కంలోనూ, గురజాడ కవిత్వంలోనూ శ్రీశ్రీ లోపాల్ని కూడా చూపించాడు. ఆధునిక కవులమీదా, అభ్యుదయ కవులమీదా శ్రీశ్రీకి అభిమానం వుండటం సహజం. కానీ అది సహేతుకంగా వుండటం అవసరం.

శ్రీశ్రీ ఆధునిక విమర్శకుడు. కాల్పనిక, అభ్యుదయ, ప్రయోగవాద విమర్శలు ఆధునిక విమర్శలో భాగాలు, రాళ్ళపల్లి, విశ్వనాథ వంటి సంప్రదాయ విమర్శకులకి భిన్నమైన ఆధునిక విమర్శను శ్రీశ్రీ అభివృద్ధి చేశాడు. విరసం ఏర్పడిన తర్వాత మార్క్సిజం - లెనినిజం సాహిత్య విమర్శకి ప్రమాణంగా వుండితీరాలని శ్రీశ్రీ చెప్పాడు. కానీ మార్క్సిజం - లెనినిజం కోణం నుంచి శ్రీశ్రీ సాహిత్య విమర్శన చేయలేదు. మార్క్సిజం ప్రభావం వుంది కానీ శ్రీశ్రీ మార్క్సిస్టు విమర్శకుడు కాడు. అనేక రకాల సంప్రదాయ విమర్శనా పద్ధతులకు పూర్తిగా భిన్నమైన ఆధునిక విమర్శ శ్రీశ్రీ బహుముఖాలుగా అభివృద్ధి చేశాడు.

1-1-1980

కథ :

# ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం - శ్రీశ్రీ

ప్రథమ ముద్రణ : తెలుగు స్వతంత్ర. 1954 అక్టోబర్ 8.
ప్రస్తుత ముద్రణ : శ్రీశ్రీ సాహిత్యం- మూడు- వచన విభాగం. పు: 16, 17.

సాయంకాలం వీపు మీద సవారిచేస్తూ వచ్చిన కుంటి బిచ్చ కుర్రవాడు ఇరుకు సందులో బాడుగకు తీసుకున్న "ఈస్టు అండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీ" గుమ్మం ముందు నిలబడి "అంబా" అని అరిచాడు.

అమ్మతనానికి చిన్నప్పుడే దూరమై పెంటకుప్పల చాటున పెరిగిన కుంటి కుర్ర బిచ్చగాడు సూర్యుడి ప్రవేశం మొదలు చంద్రుడి నిష్క్రమణం దాకా నేలనించి నీటి నించి ఆకాశం ద్వారా వ్యాపారం చేసే భవనం ముందు ఆకలి కణాల కిరణాల వ్రణాలు కుదిపితే కదిపితే కములుతూ కుములుతూ గొంతుకలో సగం ఎత్తి "అంబే" అని అరిచాడు.

వ్యాపార మందిరం లోపల రోజంతా తెగమోగిన టెలిఫోన్లూ, టైపురైటర్లూ మూకీభావం వహించాయి. రోజంతా మనుష్యుల్ని మోసిన కుర్చీలు తిరుబాటుగా తమ అరణ్య ప్రారంభాలని జ్ఞాపకం చేసుకుంటున్నాయి.

కుర్ర బిచ్చ కుంటివాడు మొర్రో అని అరచిన అరుపులు కుర్చీలకి వినబడింది గాని ఇంట్లో ఎవరూ లేరని చెప్పడానికి గొంతుకలేనివా కుర్చీలు. అంబా అని అరచిన అబ్బాయి కేకకి ఆ దారినేపోతున్న ఓ గోమాత అతడే తన చేటపెయ్యా కాబోలునని అరక్షణం అనుమానించి తెలివైంది కాబట్టి తెలుసుకొని ముభావంగా ముట్టె ముడుచుకొని వెళ్ళిపోయింది,

ఇక్కడ బిచ్చం దొరకదని ఎవరు చెబుతారా కుర్రాడికి? లక్షల మీద వ్యాపారం జరిగే ఆ భవనంలో ఎప్పుడూ పచ్చి మంచినీళ్ళు కూడా పుట్టవని టెలిఫోన్లు చెబుతాయా టైపురైటర్లు చెబుతాయా? గదిలోని క్యాలండరు కాగితాలు గాలికి గలగల కొట్టుకుంటున్నాయేగాని ఈ కాస్త కబురు వాడికెలా అందజెయ్యగలుగుతాయి?

వచ్చిన పాట కూడా మరిచిపోయిన బిచ్చకుంటి కుర్రవాడి మొగంలో సాయం కాలపు జేగురు రంగు పిచిక గూళ్ళు కడుతోంది. విసుగుతో పోరాడుతూ అణగారి పోతున్న ఆశల్ని ఎగసన దోసుకుంటూన్న కుర్రకుంటి బిచ్చగాడి కడుపులోని రంపాలు పుట్టిస్తున్నాయి కళ్ళల్లో భూకంపాలు. అసందర్భంగా పుట్టి అనవసరంగా పెరిగి అఘోరిస్తున్న బిచ్చ కుర్రకుంటి వాడి పిడచకట్టిపోయిన నాలిక ఓడిపోయిన రాజ్యం తాలూకు వెలిసిపోయిన పతాకంలాగ వేలాడుతోంది.

అనంతంగా అక్కడే నిలబడి పోతాడా యేమిటా కుర్రాడు ? ఈ కథ యెక్కడికీ కదలదా యేమిటి ? ఆ కదలని కాళ్ళు నేలలోకి కూరుకుపోయి వేళ్ళుతన్ని కుర్రాడే ఒక మర్రిచెట్టయి పోతాడేమిటి ?

చింపిరిజుత్తు బికారివాడి తలకాయ పెట్టెలోని దరిద్రపు సామాన్లు వర్ణిస్తూ, ఎదురుగుండా కంపెనీ భవనంలోని ఖరీదైన వస్తువుల ఐశ్వర్యాన్ని సూచిస్తూ యెంత సేపైనా ఈ రచనని సాగించవచ్చు, సందులో సహా సౌందర్యాన్ని సంతరిస్తున్న సంధ్యాకాలపు మాధుర్యాన్ని రకరకాల ఉపమానాలతో ప్రశంసించవచ్చు. అయినా ఈ కథ యెక్కడ ప్రారంభమయిందో అక్కడే ఉంటుంది.

ఎప్పటికైనా ఆ బిచ్చగాడు కుంటివాడు కుర్రవాడు తలయెత్తి చూసి తలుపుకి వేసిన తాళం కప్ప ఇచ్చే సందేశాన్ని అర్థం చేసుకోగలిగితే, అయ్యా అని అరిచిన నోరు అయ్యో అని నిరాశ ప్రకటిస్తే, ఆ యింటి ముందు నిలబడడంవల్ల లాభం లేదని ఆఖరి కతని కాళ్ళకి బోధపడితే అప్పుడీ కథ అంతమవుతుంది.

## విశ్లేషణ - కాత్యాయనీ విద్మహే

సంఘటనల వల్లా సన్నివేశాల వల్లనే కాకుండా పరిమాణం దృష్ట్యాకూడా ఇది ఒకచిన్న కథ.

ఈ కథలో వచ్చేపాత్రొ ఒక్కటే. అది కుంటివాడు బిచ్చగాడు అయిన ఒక కుర్రవాడి పాత్ర. ఈ కుర్రవాడి పాత్రకు ఆధారం శ్రీశ్రీ 1935 (?)లో రాసిన 'ఉన్మాది' గేయంలోని (మహాప్రస్థానం, 1954. పు 28) 'అలకలన్నీ అట్టకట్టిన బొమికలన్నీ ప్రోవు పట్టిన కాగితం వలె పలచబారిన' కుర్రవాడూ, వెర్రివాడూ కావచ్చు. దరిద్రానికి ప్రతి రూపంగా కనిపించే ఆ కుర్రవాడే ఈ కథలో ఐశ్వర్యం ఎదుట నిలబడి మనకు కనిపిస్తాడు.

శ్రీశ్రీ ఈ పాత్రకు ప్రత్యేకంగా నామవాచకమంటూ ఏదీ వాడలేదు. వాడినవి మూడూ విశేషణాలే. కుంటివాడు, కుర్రవాడు, బిచ్చగాడు- అనే ఈమూడు విశేష ణాలను ఆరుసార్లు ఆరురకాలుగా ప్రయోగిస్తూ ఎప్పటికప్పుడు కొత్తపేరును తయారు చేసుకుంటూ పోయాడు. పేరు మానవుణ్ని ఫలానావాడని గుర్తించటానికి ఒక సంకేతం. దళితులందరికీ దారిద్ర్యమే సంకేతమైనప్పుడు మళ్ళీవాళ్ళకు ప్రత్యేకమైన పేరెందుకు ? ఆ దరిద్రానికి దోహదంచేసే విశేషణాలే వాళ్ళను గుర్తుపట్టేలా చేస్తాయి. ఒక్కొకసారి విశేషణాలే విశేష్యాలవుతుంటాయి. అందుకే శ్రీశ్రీ ఈ కథలో ఈ

మూడు విశేషణాలలో ఒక దానిని నామవాచకం చేస్తూ మిగిలిన రెంటినీ విశేషణాలుగానే ఉంచుతూ ఆ పాత్రను గురించి చెప్పుకుపోతాడు. కథలో ఆ పాత్రను పేర్కొన్నప్పుడల్లా ఏ ఒక్క విశేషణాన్ని వదలటానికి శ్రీశ్రీ యిష్టపడడు. ప్రతిసారీ మూడింటినీ వాడతాడు. కాకపోతే వరసక్రమం మారుస్తాడంతే. అట్లా వాడడంలోను, వరస క్రమం మార్చడంలోనూ ఆ పాత్ర కుంటితనాన్ని, కుర్రతనాన్ని నొక్కిచెప్పటం, అటువంటివాడు బిచ్చమెత్తుకొని కడుపు నింపుకోవాల్సిన దుర్దశలో ఉండటాన్ని సూచించటం- అనే రెండు అంశాలను వివిధ కోణాలలో ఒక్కొకసారి ఒక్కొకదానికి ప్రాధాన్యం యిస్తూ చూపించాడు.

కుంటివాడైనవాడు నిజానికి ఆ విధంగా ఒంటరిగా ఏతోడూ లేకుండా వీధులు పట్టుక తిరగటానికి చేతకానివాడు. వేరొకవ్యక్తి యొక్కగాని సంస్థయొక్కగానీ సంరక్షణలో ఉండవలసినవాడు. కానీ ఈ కుంటివాడికి ఆ యోగంలేదు. పోతే నేటి బాలలే రేపటి పౌరులని అంటుంటారు. బాలలు పౌరులుగా తయారవటానికి కొంత భద్రత, శిక్షణ అవసరం. ఈ కుర్రవాడు రేపటి పౌరుడుగా తయారయేందుకు ఏ వసతులనూ వ్యవస్థ సమకూర్చటంలేదు. శారీరకమైన అవిటితనంచేత బలహీనుడు, వయసుచేత చిన్నవాడు కుర్రవాడు అయిన వ్యక్తి బిచ్చమెత్తుకోవాల్సిన దుస్థితిలో వున్నాడు. కుర్రవాళ్ళ జీవన పరిస్థితులు క్షీణించి బిచ్చగాళ్ళుగా బతకవలసి రావటం, అవిటి వాళ్ళకు రక్షణలేకపోవటం ఈ సాంఘిక ఆర్థిక వ్యవస్థయొక్క అసమర్థతకు, శ్రామికుల దుర్గతికి గుర్తు.[1]

కథలో పాత్ర అయిన 'కుర్రవాడు' వాడికి విశేషణాలుగా వున్న 'బిచ్చగాడు', 'కుంటివాడు'- ఈ మూడూ పరస్పరంగా అనివార్యంగా సంబంధమున్న అంశాలు అని భావించ నక్కరలేదు. కుర్రవాడు, బిచ్చగాడు, కుంటివాడు వేరువేరు వ్యక్తులు కావచ్చు. కానీ పెట్టుబడిదారీ సమాజంలో ఈ ముగ్గురూ 'శని దేవత రథ చక్రపు టిరుసులలో పడి నలిగిన దీనులకు హీనుల'కు 'కూడులేక గూడులేక సంఘానికి బహిష్కృతులు'గా (జగన్నాథ రథచక్రాలు) ఉన్న పీడిత జనసామాన్యానికి ప్రతీకలు. దీనత్వం ముగ్గుర్ని సమం చేస్తున్నది. ఈ ముగ్గుర్నే కాదు, ఇంకా అనేక మందిని సమం చేస్తున్నది. మూడు అన్న సంఖ్య ఒక్కటి కాదు అనేకం అన్నదానికి గుర్తు మాత్రమే. అయితే శ్రీశ్రీ ఆ ముగ్గురిని కూడా ఒకే వ్యక్తిలో చూపించాడు. ఫ్యాన్‌లో ఉండే మూడు రెక్కలు తిరిగేవేగంతో ఒకటిగానే కనిపిస్తున్నట్లు అత్యంతము

1. ఎల్. లియోన్‌త్యెవ్ - అర్థశాస్త్రం, సంక్షిప్తసారం (రారా - 1978 పు: 67)

వేగవంతమైన పెట్టుబడిదారీ ఆర్థిక విధానంలో బిచ్చగాడు, కుర్రవాడు, కుంటివాడు-అందరూ ఒకటిగానే కనిపిస్తున్నారు. ఈ పెట్టుబడిదారీ వ్యవస్థలో కుర్రవాడు, కుంటి వాడు, బిచ్చగాడు - దోపిడీకి సమానంగానే గురిఅవుతున్నారు. వీరు ముగ్గురేకాదు. ఇంకా అనేకమంది ఇలాగే అవుతున్నారు. దీనిని నిరూపించి చూపటానికే శ్రీశ్రీ ఈ కథలో దీనులైన జనులందరికి కుంటితనంతో బిచ్చమెత్తుకుంటున్న కుర్రవాణ్ణి ప్రతీకగా నిలబెట్టాడు.

పెట్టుబడిదారీ సమాజంలో సాధారణంగా జరుగుతున్న దేమిటంటే ఐశ్వర్యం, దారిద్ర్యం అనేవి పూర్తిగా రెండు చోట్ల కేంద్రీకృతమై వర్గాలుగా ఏర్పడి స్పర్థ వహించటం. కుంటితనం కుర్రతనం - అనే రెండు నిస్సహాయతలకు లోనై బిచ్చమెత్తుకుంటున్న వ్యక్తిని దారిద్ర్యానికి ప్రతీకగా ఈ కథలో నిలబెట్టాడు శ్రీశ్రీ. "సాయంకాలం వీపుమీద సవారీచేస్తూ వచ్చిన" ఈ కుర్రవాడు బిచ్చం కోసం ఏ గుమ్మం ముందైతే నిల్చున్నాడో ఆ గుమ్మం ఈస్టు అండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీది.[1] ఈ కంపెనీ ఐశ్వర్యానికి ప్రతీక. ఐశ్వర్యం ఎప్పుడూ ఐశ్వర్యం తోటే పొత్తు కుదుర్చుకుంటుంది. వ్యాపారం అందుకు ఒక సాధనమవుతుంది. ఇదే పెట్టుబడి దారీ సమాజపు అస్తిత్వానికి కారణమవుతున్నది. ఈ విషయాన్ని స్పష్టం చేయటానికి ఈస్ట్ అండ్ వెస్ట్ ఎగుమతి దిగుమతుల కంపెనీ అనేది ఒక సంకేతం. తూర్పు దేశాలు పశ్చిమ దేశాలు ఎగుమతి దిగుమతుల క్రమంలో పాల్గొంటున్నాయి. తూర్పు దేశాలు ముడి సరుకులను ఎగుమతి చేసి పశ్చిమ దేశాల నుండి తయారైన వస్తువులను దిగుమతి చేసుకుంటున్నాయన్న మాట.

తూర్పుదేశాలనే మాట భారతదేశాన్ని సూచిస్తున్నది. భారతదేశంలోని పెట్టుబడిదారీ వ్యవస్థ భారతదేశాన్ని విదేశీ వస్తువులకు మార్కెట్టుగా ఎట్లా సిద్ధం చేస్తున్నది అనే విషయాన్ని గురించి విశ్లేషించి చూచుకోవటానికి వీలుగా ఈ ఈస్టు అండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీని శ్రీశ్రీ ఈ కథలో చూపించాడు. తూర్పుదేశమైన భారతదేశం నుంచి వ్యావసాయిక ఫలసాయం, అటవీ సంపద, భూగర్భ సంపద-ముడి సరుకుగా పారిశ్రామికమైన పశ్చిమదేశాలకు ఎగుమతి కావటం, అక్కడనుంచి

---

1. పుప్పల లక్ష్మణరావుగారు వ్రాసిన అతడు - ఆమె నవల 1వ భాగంలో (పు: 145 - 1977 జులై ముద్రణ) "ఈస్టు ఎండ్ వెస్టు" క్లబ్బు ప్రస్తావన వుంది. కథలోని ఈస్టు అండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీకి ఈ క్లబ్బుకు ఏమైనా సంబంధం వుందేమో విచారించాలి.

పారిశ్రామిక వస్తువులు దిగుమతి కావటం జరుగుతున్నది. ఈ పరిస్థితి 'ఆకలి కణాల కిరణాల వ్రణాలు కుదిపితే కదిపితే కములుతూ' ఉండే కుర్రబిచ్చగాళ్ళ నెందరినో తయారుచేస్తున్నది. కథలోని కుంటి కుర్ర బిచ్చగాడు అర్ధ వలస రాజ్యంలో దళితులుగా మార్చబడిన దేశీయుల దయనీయమైన స్థితికి నిదర్శనం. 'స్వతంత్రం' వచ్చి ఒక పంచవర్ష ప్రణాళిక (1954) గడిచినా ప్రజల దయనీయస్థితిలో మార్పురాక పోవటాన్ని రచయిత చూపిస్తున్నాడు.

ఐశ్వర్యానికి ప్రతీక అయిన ఈస్ట్ అండ్ వెస్ట్ కంపెనీ ముందు నిలబడిన దారిద్ర్యానికి ప్రతీక అయిన ఆ బిచ్చగాడిచుట్టూ అల్లబడిన కథే 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' ఉత్పత్తిసాధనాల మీద గుత్తాధిపత్యంకలిగి మానవశ్రమను వేతనాల పేరుమీద సరుకుగా కొనగల స్థితిలో[1] వుంది కనుక ఈస్టు అండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీ ఐశ్వర్యానికి ప్రతీక అయింది. తన శ్రమను వినియోగించటానికి ఉత్పత్తి సాధనాలులేక, ఉత్పత్తి సాధనాలున్న చోటనే తన శ్రమను అమ్ముకోవటం తప్ప గత్యంతరం లేని దశలో వున్నాడు కనక కుంటి కుర్ర బిచ్చగాడు దరిద్రానికి ప్రతీక అయినాడు. శ్రమను అమ్ముకోవటానికి వ్యక్తి సిద్ధపడినప్పటికి తక్కువ కాలంలో ఎక్కువ పనిచేసే యంత్రాలు ఉత్పత్తి విధానంలోకి ప్రవేశించిన వ్యవస్థలో ఆ శ్రమను కొనేవాడు కూడా కరువైపోతున్నాడు. ఫలితంగా ఈ వ్యక్తి తన శ్రమను కొనమంటూ దీనంగా ఆ వ్యవస్థ మూసిన తలుపుల ముందు వేడుకొంటూ నిల్చోవలసిన దుస్థితిలో వున్నాడు[2]

ఐశ్వర్యం ఎదుట దాని దయనాశించి దారిద్ర్యం సాగిలపడి వుంది. అయితే దారిద్ర్యానికి ఐశ్వర్యం అందించే సహాయం ఏమీలేదు. అయినా ఆ దారిద్ర్యం ఆ ఐశ్వర్యం ముందు యింకా ఆశనింపుకుంటూ సాగిలపడి ఉంతనేవుంది. ఐశ్వర్యం

---

1. ఎల్. లియోన్‌త్యెల్ - అర్థశాస్త్రం, సంక్షిప్తపాఠం (అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి) (1978) పు: 57

2. All those who do not have the necessary means of production at their disposal- and still want to live in the world of private pro-perty- are forced to knock at the doors of those who have a mono-poly of these means of production. They must sell their labour power to them- the factory owners, entrepreneurs, employers and so on. - Hermann Duncker.

From: 'What is socialism?' (1909)

See: Road to the future P: 39.

మాత్రం వేసిన తాళాల వెనుక మూసిన తలుపుల వెనుక తాను భద్రంగా ఉండటానికి ప్రయత్నిస్తున్నది. తిరాచూస్తే ఆ ఐశ్వర్యం బిచ్చగాళ్ళుగా మారిన వ్యక్తుల శ్రమ ఫలితం. తనకున్న శ్రమ సంపదనంతా ధారపోసి దరిద్రుడైన వ్యక్తి తన శ్రమ వల్ల ఐశ్వర్యం ఎక్కడ కూడుకుందో అక్కడ చేతులు చాచి దీనంగా హీనంగా నిల బడవలసి వచ్చింది. కథలో కుర్రవాడు బిచ్చగాడు కావటానికి అతని కుంటితనం కారణం. ఈ కుంటితనం ఆ ఎగుమతి దిగుమతుల కంపెనీలో పనిచేయటం వల్ల సంక్రమించిందే కావచ్చుకూడా. వ్యక్తి ఆరోగ్యంగా వున్నంతకాలం అతని శ్రమను దోచుకొని తాను పెరిగిన పెట్టుబడిదారీ వ్యవస్థ- తీరా ఆ వ్యక్తి అనారోగ్యాన్ని, అంగవైకల్యాన్ని పొంది శ్రమను అందించే స్థితిలో లేనప్పుడు పనికిరాని వస్తువను తీసేసినట్టుగా ఆ వ్యక్తిని తీసేస్తుంది. కుంటివాడై శ్రమ చేయటానికి వీలులేని స్థితిలో వున్న ఆ కుర్రవాడు మళ్ళీ ఆ వ్యవస్థ ముందే తన అవసరాలు తీర్చమంటూ సాగిలపడి ఉండవలసివస్తున్నది. ఈ క్రమాన్ని స్పష్టంగా చిత్రించటమే ఈ కథ చేసిన పని.

ఈస్ట్ అండ్ వెస్టు కంపెనీ ముందు నిలబడి ఆ బిచ్చగాడు 'అంబా' అని అరిచాడు. సమాధానం రాలేదు. ఇక్కడ శ్రీశ్రీ "వ్యాపార మందిరం లోపల రోజంతా తెగమోగిన టెలిఫోన్లూ, టైపురైటర్లూ మూకీ భావం వహించాయి. రోజంతా మనుష్యుల్ని మోసిన కుర్చీలు తీరుబాటుగా తమ అరణ్య ప్రారంభాలని జ్ఞాపకం చేసు కుంటున్నాయి" అంటాడు.

టెలిఫోన్లూ, టైపురైటర్లూ, కుర్చీలు జడపదార్థాలు కాబట్టి ఎటూ ఎవరితోనూ మాట్లాడవు. మాట్లాడలేని వాటిని మాట్లాడటంలేదని చెప్పటం వల్ల రచయిత వాటిని సాంకేతికంగా ఉపయోగిస్తున్నాడన్నమాట. ఈ టెలిఫోన్లూ, ఈ టైపురైటర్లూ ఆ ఎగుమతి దిగుమతుల వ్యాపారం చేసే పెట్టుబడిదారుల భావాలకు ప్రతిధ్వనులు. వాళ్ళేం మాట్లాడితే వాటిని ప్రసారం చేస్తాయి. వాళ్ళేం రాస్తే దానికి నకళ్ళు తీసి పెడతాయి. అందువల్ల అవి ఆ కుర్రవాడు ముందు నిలబడి పిలిస్తే, ఏమీ సమాధానం చెప్పలేకపోయాయి. పోతే ఇక కుర్చీలు తమ అరణ్య ప్రారంభాలని జ్ఞాపకం చేసు కుంటున్నాయి.[1] అరణ్య ప్రారంభాలంటే అరణ్యంలో చెట్లుగా జీవితాన్ని ప్రారం భించినప్పటి స్థితి. ప్రకృతిలో భాగంగా ఉన్నప్పటి స్థితి. చెట్లుగా ప్రకృతిలో భాగంగా వున్నప్పుడు వాటిమీద యాజమాన్యం ఎవరికీ లేదు. కానీ అవి కుర్చీలుగా

1. చూడు : రంగనాయకమ్మ - కాపిటల్ - పరిచయం (1978) పు : 14 - 16

తయారైన తరువాత మాత్రం వాటిమీద యాజమాన్యం ఈస్టు ఇండ్ వెస్టు ఎగుమతి దిగుమతుల కంపెనీది అయింది. ఆ చెట్లు ఈ కుర్చీలుగా మారటానికి మధ్య అనేక దశలలో ఎంతో మానవ శ్రమ వుంది. దీని ఫలితంగానే సమాజం ఆటవిక దశ నుండి పెట్టుబడిదారీ దశకు పరిణమించింది. ఆ చెట్లు చెక్కపలకలుగా మారి వాటి మీద వడ్రంగంపని జరిగాక కుర్చీలు తయారవుతున్నాయి. అట్లా తయారైన కుర్చీలు తమ అరణ్య ప్రారంభాలని గుర్తు చేసుకుంటున్నాయంటే ప్రకృతి స్థితి నుంచి ప్రస్తుత స్థితి వరకు జరిగిన పరిణామాన్ని నెమరువేసుకుంటున్నాయని అర్థం. అంటే తమకా రూపాన్నిచ్చిన మానవ శ్రమను గురించిన ఆలోచన చేస్తున్నాయన్న మాట.

మానవ శ్రమనుంచి తయారైన వస్తు సంపదమీద గుత్తాధిపత్యం కలిగి తమ సంపదను పెంచుకోవటమొక్కటే వాళ్ళకు తెలుసు. మానవ శ్రమ నుంచి తయారై, పెట్టుబడిదారుల గుత్తహక్కుగా మారిన సమస్త వస్తుజాలం ఆ పెట్టుబడి దారులకు మద్దతుగా పనిచేయవలసి వస్తున్నది, తప్పితే సామాన్య మానవుడికి ఏ లాభమూ చేకూర్చలేక పోతున్నది.

బిచ్చగాడి అరుపు తన చేటపెయ్యదని గోమాత క్షణం అనుమానించింది. అరుపునుబట్టి పశువు తన దూడయేమో అనుకొన్నది కానీ పెట్టుబడిదారు మాత్రం మనిషి నిలబడి అరుస్తుంటే మనిషిని గాని మనిషి అరుపునుగాని, ఆ అరుపులోని ఆర్తిని గానీ పట్టించుకోకుండా వుండగలుగుతున్నాడు. బదులు చెప్పగలిగిన గుర్తుపట్టగలిగిన మనిషియైన పెట్టుబడిదారు తన ఉనికికి కారణమైన శ్రామికుణ్ణి తోటిమనిషిగా గుర్తించ టానికి, పిలుపుకు సమాధానం ఇవ్వటానికి నిరాకరిస్తున్నాడు. ఇది అమానుషం.

తానొక మనిషిగా గుర్తింపులేక తన పిలుపుకి సమాధానం లేక వొచ్చిన పాట కూడా మరిచిపోయి వున్నాడా కుర్రి కుంటి బిచ్చగాడు. ఆ కుర్రివాడు ఆ కంపెనీలో శ్రామికుడుగా పనిచేసే రోజుల్లో పనిభారం మనసుకు పట్టకుండా వుండటానికి, పనిలో ఉత్సాహం పుట్టడానికి కొన్నిపాటలు పాడుకొనేవాడు. వాడు కుంటివాడై కంపెనీ నుండి విసిరివేయబడి బిచ్చగాడైన తరువాత ఆ పాటలు కూడా మరచిపోయినాడు. వొచ్చిన పాట కూడా మరచిపోవటానికి తగినంతకాలం అట్లాగే ఎక్కడెక్కడో తిరిగి ఎక్కడా బ్రతుకు తెరువు దొరక్క మళ్ళీ తను వెనుక పనిచేసిన కంపెనీ వాకిట్లోకి తన శ్రమను ఎంత వస్తే అంతకు అమ్ముకోడానికే వచ్చాడు. అతడడిగే బిచ్చం తన శ్రమను కొనమని. పెట్టుబడిదారీ వ్యవస్థ యంత్రశక్తిని పెంచుకొన్న కారణంగా[1]

---

1. మార్క్స్, ఎంగెల్స్ - కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (అనువాదం : రాచమల్లు రామచంద్రారెడ్డి) పు : 43

మానవ శ్రమను వెనుకటిలాగా వినియోగించుకొనే స్థితిలో లేదు. అందువల్ల ఆ బిచ్చగాణ్ణి పనిలో పెట్టుకోదు. అందువల్ల 'తన బిచ్చం మీద బతకవలసిన దుస్థితి'[1] లోనే శ్రామిక జనాన్ని అట్టే పెడుతుంది. అదే దాని పతనానికి కారణమవుతుంది.

కుంటివాళ్ళుగా బిచ్చగాళ్ళుగా మారిన కుర్రవాళ్ళంతా తమకా దుస్థితి కలిగించిన పెట్టుబడిదారీ వ్యవస్థ గురించి తెలుసుకోలేనంతవరకూ ఈ కథకు అంతం అనేది వుండదు. ఈస్ట్ అండ్ వెస్ట్ ఎగుమతి దిగుమతుల కంపెనీ ముందు నిల్చుని ఆ కుర్రవాడు 'అంబా' అని అరుస్తూనే వున్నాడు. ఉంటాడు కూడా. అందుకనే అక్కడ ఆ విధంగా నిలబడి ఉన్న కుర్రవాణ్ణి గురించి శ్రీశ్రీ 'అనంతంగా అక్కడే నిలబడి పోతాడా యేమిటా కుర్రాడు? ఈ కథ ఎక్కడికీ కదలదా యేమిటి? ఆకదలని కాళ్ళు నేలలోకి కూరుకుపోయి వేళ్ళుతన్ని కుర్రాడే ఒక మర్రిచెట్టయి పోతాడేమిటి?" అని వేసిన ప్రశ్నలు గమనింపతగినవి. ఈ ప్రశ్నలు వ్యతిరేకార్థక వ్యంజకాలు. అంటే ఆ ప్రశ్నల్లోనే వ్యతిరేకార్థకాలయిన జవాబులుంటాయి. ఈ ప్రశ్నలకు శ్రామికుడలాగే నిలబడిపోడని ఈ కథ మరొక చోటికి కదులుతుందని జవాబులొస్తవి. అంటే వర్గచైతన్యం పొంది ఉత్పత్తి సాధనాల మీద యాజమాన్యంతో సలక్షణమైన మానవ సంబంధాలతో వుండే సాంఘిక వ్యవస్థయొక్క ఆవిర్భావాన్ని ఆ ప్రశ్నలు ధ్వనింప చేస్తున్నాయి. కొత్త సాంఘిక వ్యవస్థను ఆవిర్భవింప చేసుకోవలసిన అవసరం కుంటి కుర్ర బిచ్చగాళ్ళయిన శ్రామికులకే వుందని, వాళ్ళు చైతన్యవంతులై విప్లవించే వరకూ అది వాళ్ళకు రాదని ఆ విధంగా వాళ్ళు తమను తాము ఉద్ధరించుకొనే ప్రయత్నంలో మేల్కొనటమొక్కటే మార్గమని ఈ కథ స్పష్టంగా ప్రకటిస్తున్నది. తమను తాము ఉద్ధరించుకొనే ప్రయత్నంలో అలాంటి కుంటి కుర్ర బిచ్చగాళ్ళయిన శ్రామికులంతా సంఘటిత శక్తిగా అభివృద్ధికావటం గురించి అనుకొంటున్న రచయిత ఆశాభావాన్ని 'ఆ కదలని కాళ్ళు నేలలోకి కూరుకుపోయి వేళ్ళుతన్ని కుర్రాడే ఒక మర్రిచెట్టయి పోతాడేమిటి?' అనే ప్రశ్నార్థక వాక్యం వ్యక్తీకరిస్తుంది. ఎందుకంటే అలా సంఘటితం కానిది వాళ్ళేమీ సాధించుకోలేరు. అయితే వాళ్ళకు పొయ్యేది కూడా ఏమీ లేదు.[2]

అందువల్ల అక్కడ ఆ విధంగా నిల్చోడం వల్ల ఏ మాత్రం లాభంలేదని ఆ నిల్చున్న వ్యక్తి తెలుసుకో గలగాలి. ఆవిధంగా తెలుసుకునేంత వరకు ఈ కథ ఈ విధంగా నడుస్తూనే ఉంటుంది. అందుకనే చివర్లో రచయిత "ఎప్పటికైనా ఆ బిచ్చగాడు,

1. మార్క్స్, ఎంగెల్స్ - కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (రారా) పు: 46
2. మార్క్స్, ఎంగెల్స్ - కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక (రారా) పు: 70

కుంటివాడు, కుర్రవాడు తలయెత్తిచూసి తలుపుకి వేసిన తాళంకప్ప ఇచ్చే సందేశాన్ని అర్థం చేసుకోగలిగితే అయ్యా అని అరిచిన నోరే అయ్యా అని నిరాశ ప్రకటిస్తే, ఆ యింటి ముందు నిలబడటం వల్ల లాభం లేదని అశక్తతని కాళ్ళకి బోధపడితే అప్పుడీ కథ అంతమవుతుంది" అని కథ ముగిస్తాడు. ఇందులో ఆ కుంటి కుర్రి బిచ్చగాడిలో కలగవలసిన చైతన్యం గురించి చెప్పబడింది. పరిస్థితిని అర్థం చేసుకోవాలి, అయ్యా అమ్మా అని దేబరిస్తూ పడివుండటం నిరాశాజనకం తప్ప మరేమికాదన్న స్ఫూర్తి కలగాలి, ఆశవదలక ఇంకా నిలబడటానికి కాళ్ళు నిరాకరించాలి. అంటే పెట్టుబడి దారు మనసుమారి మనమీద దయచూపడా అన్న ఆశాభావం శ్రామికుణ్ణి కాపాడదని అతడు డిమాండు చేసి సాధించుకోవటం తప్ప గత్యంతరం లేదనీ ఈ కథ చెప్తున్నది. తలుపుకి వేసిన తాళంకప్ప ఇచ్చే సందేశం కూడా అదే. దారిద్ర్యం పట్ల ఐశ్వర్యం తలుపులు పూర్తిగా మూసుకుపోయాయి. కేవలం మూసుకుపోవటమే కాదు. తోసుకు పోవటానికి కూడా వీల్లేకుండా తాళాలతో బిగించబడి ఉన్నాయి. దరిద్రులయెడ ఐశ్వర్యవంతుల హృదయకవాటాలు పూర్తిగా మూసుకుపోయాయి. తోసుకు పోవటానికి కూడా వీల్లేకుండా చేసినప్పుడు పడదోసుక పోవటమొక్కటే మార్గం. అందువల్ల అమ్మా అంటూ బిచ్చమడుక్కోవటం కాదు చెయ్యాల్సింది. సాంఘికంగా అట్టడుగు బ్రతుకు బ్రతికే వాళ్ళ వర్గచైతన్యం రగుల్కొవాలి. వాళ్ళా విధంగా క్రియాశీలురై కార్యరంగంలో దిగితేనే కాని ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ సృష్టించిన ఈ కుర్రి కుంటి బిచ్చగాళ్ళ దారిద్ర్య కథ అంతంకాదని- అప్పుడీ కథ అంతమవుతుందీ అంటే మళ్ళీ ఈలాంటి 'దరిద్రం' కథలు పుట్టటానికి వీలులేని సాంఘిక ధర్మం ఏర్పడుతుందనీ ఈ చిన్న కథ వర్తమానం నుండి భవిష్యత్తును ఆశాజనకంగా సూచిస్తున్నది.

---

మలేషియాలో జరగబోయే రెండో ప్రపంచ తెలుగు మహాసభలను బహిష్కరించండి!

---

1975లో మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు హైదరాబాదులో దర్బారీ పద్ధతుల్లో జరిగిన సందర్భంలోనే వాటి బండారం బయటపెడుతూ విరసం వాటిని బహిష్కరించడమేగాక, శ్రీశ్రీ నాయకత్వాన నిరసన ప్రదర్శన కూడా జరిపింది. వాటికి నకలుగా యిప్పుడు మలేషియాదేశంలో రెండో ప్రపంచ తెలుగు మహాసభలు జరపాలని సన్నాహాలు చేస్తున్నారు. పాలకవర్గాల అడుగులకు మడుగులొత్తే ఆస్థానకవి, ఇతర సర్కారీ కవులూ సందడిచేస్తున్నారు. దీని లక్ష్యం, జమిందారీ సంస్కృతికి పట్టం కట్టడమే. ఈ సభలను బహిష్కరించి, ప్రజా కవిత్వానికీ ప్రజా కళలకూ బాసటగా నిలవాలని సాహితీపరుల కందరికీ విరసం విజ్ఞప్తి చేస్తోంది.

---

# శ్రీశ్రీ కవితలో కూర్పు

పి. సి. నరసింహారెడ్డి

కూర్పు రచన. నోటికూర్పని, రాతకూర్పని ఇది రెండురకాలు. మొదటి దాంట్లో గ్రహీత శ్రోత. రెండో దాంట్లో గ్రహీత పఠిత. రెంటిల్లోనూ జరిగేది శ్రవణ చిత్రణం. పఠనానికి కూడా గమ్యం స్వీయశ్రవణమే స్థూలంగా రాతకూర్పు చదువుకోవడానికి ఉద్దేశించింది. ఈ భిన్న గ్రహణరీతుల వల్ల కూర్పులో కూడా తేడాలుంటాయి.

శ్రీశ్రీ కవితలు చదువుకోవడానికన్నా బిగ్గరగా చదివి వినిపించడానికి అనువైన రచనలు.[1] శ్రీశ్రీది నోటికూర్పుకు దగ్గరగా సాగేరచన. 'మహాప్రస్థానం' సంపుటిలోని చాలా రచనలు ఒక్కమాటు, ఒక్కచోట రాసినవే. 'మహాప్రస్థానం' గీతం రాయడానికి అయిదునిముషాల కంటె ఎక్కువ పట్టలేదు. అందువల్ల అవి Spontaneity (అనర్గళత్వం) కలిగిన రచనలు. నోటికూర్పు లక్షణాల్లో ఇది ఒకటి.

శ్రీశ్రీది సులభకవిత. గురజాడ నుంచి ఈ సులభ వ్యక్తీకరణ పద్ధతినే శ్రీశ్రీ నేర్చుకున్నాడు. దేశచరిత్రలు, అద్వైతం వంటి కవితలకు పారడీలు రావడానికి ఒక కారణం వ్యక్తీకరణలోని ఈ సౌలభ్యమే. 'మహాప్రస్థానం' గీతాలు రాస్తున్నకొత్తలో భీమవరం సభలో వినిపిస్తున్నప్పుడు ఓ కుర్రవాడు 'ఓస్, ఇలాంటి కవిత్వం నేనూ రాయగలను' అని ప్రకటించినప్పుడు శ్రీశ్రీ దాన్ని తన కవిత్వానికి నిజమైన యోగ్యతాపత్రం (కాంప్లిమెంట్) గానే స్వీకరించాడు. కష్టమైన పనులే ఘనకార్యాలనుకునే మనస్తత్వమే మన కష్టాలన్నిటికీ కారణం అంటూ సాహిత్యంలో మహాకష్టసాధ్యమైన పని ఏదీ అంటే సులభంగా రాయడమే అని ప్రకటించాడు.

---

1. (a) నంద్యాలలో 1947లో జరిగిన రాయలసీమ మహాసభలో మహబూబ్ అనే అంధగాయకుడు 'మరోప్రపంచం...' గీతాన్నిపాడగా ప్రజలు ఉత్తేజితులై భూస్వాములు ఆ పాటను ఆపివేయాలని ప్రయత్నించినా ఆపడానికి వీల్లేదని పట్టుబట్టారు.

శ్రీశ్రీ 'నిరాశావాది' కాదు- చండ్ర రాజేశ్వరరావు ప్రజాశక్తి సంపాదకలేఖ (1952 మార్చి 29)

(b) ఆంధ్రలో సోషలిస్టు, కమ్యూనిస్టు ఉద్యమాల ప్రారంభ దశలో అనేక సభల్లో 'మరోప్రపంచం...' గీతాన్ని చదివినా, పాడినా నిరక్షరాస్యులైన శ్రోతలు సైతం ఉత్తేజితులయ్యేవారు.

శ్రీశ్రీ - కొన్ని జ్ఞాపకాలు - తుమ్మల వెంకటా్రామయ్య శ్రీశ్రీ సన్మాన సంచిక (ఫిబ్రవరి 1970)

తిక్కనగాని, వేమనగాని, గురజాడకాని సులభమైన దాన్ని కూడా క్లిష్టంగా చెప్పాలనే వాళ్ళకు నచ్చరు అంటూ క్లిష్టతను ఈసడిస్తాడు. వేమన్నను మహాకవిగా శిరసా వహించడం వల్లనే 'ఋక్కులు' ధైర్యంగా రాయగలిగాను అంటాడు. 'అనర్గళం, అనితరసాధ్యం నా మార్గం' అన్న శ్రీశ్రీ కవితా ప్రకటనను ఈ దృష్టితోనే అర్థం చేసుకోవలసి ఉంటుంది. నిఘంటువులు, వ్యాకరణం, ఛందస్సు - వీటి ఈసడింపు గానే కాకుండా 'అనర్గళం' అనే మాటకు సూటియైన Spontaneous అనే అర్థం కూడా గ్రహించాల్సి ఉంటుంది. ఖండశశి (1932) వంటి కవితలో అనర్గళత్వం Spontaneity లేకపోవడం ఒక లోపంగా గుర్తిస్తాడు.

శ్రీశ్రీది ఉద్వేగ పూరితమైన ఉత్సాహోద్రేకజనకమైన కవిత. Evocation (వర్ణన, ఉద్వేగాల్ని స్మృతుల్ని రేపడం, పురికొల్పడం) కవిత్వ ముఖ్య లక్షణాల్లో ఒకటి అనేది ఆయన భావన. అది లేకపోవడం వల్లనే తన పూర్వ కవిత్వం తనకే నచ్చలేదు. అందరూ పేర్కొనే 'మాటల గారడి' (శబ్దఖేలనం, శబ్ద లోలుపత, శబ్దచాపల్యం, శబ్దాధీనత, శబ్దనేతృత్వం వంటి మాటలతో అనేకులు సూచించింది) దీనివల్ల వచ్చిందే.[2]

శ్రీశ్రీ మొదటిసారిగా వ్యావహారికంలో రాసిన గీతం 'జయభేరి'. 'మహాప్రస్థానం' సంపుటిలోని మిగతా కవితలన్నీ దాని తర్వాత కూర్చినవే. అక్కడక్కడా ప్రజలకు బోధపడని, సమాసభూయిష్ఠమైన కఠిన పదజాలం ప్రయోగించడం పాత వాసనలు వదలనందువల్లనే అని తనే చెప్పుకున్నాడు.

తిక్కనది మాట్లాడే కవిత్వం. సంభాషణాత్మకశైలి (Dramatic Conversational Style) అని భావిస్తూ తెలుగు వాడకపు తీరుతీరునా, మనం మాట్లాడుకునే భాషలో ఎన్నెన్ని రకాల రామణీయకాలున్నాయో అవన్నీ తిక్కనలో గోచరిస్తాయి అంటూ మెచ్చుకుంటాడు. పై లక్షణాలు కేవల పదసంబంధికాదు. వాక్య నిర్మాణ సంబంధి కూడా. వీటికి తిక్కనలోనేగాక శ్రీశ్రీ కవితలోనూ (ముఖ్యంగా మహాప్రస్థానం గీతాల్లో) ఉదాహరణలు కొల్లలుగా లభిస్తాయి.

---

2. An emotional sweep and passionate out bursts conducive of a high poetic order and yet to be infused into this poetry. By a sort of verbal conjuration Considerable poetic effect might have been worked up.

ఖండశశి (1932) నోట్సు - శ్రీశ్రీ సాహిత్యం - ఒకటి (కావ్య వచన విభాగాలు) శ్రీశ్రీ షష్టి పూర్తి సన్మాన సంఘం (2 జనవరి 1970)

శ్రీశ్రీ కవితల్లో ఛందస్సు చాలా వరకు దేశీయమైనది. 'ప్రభవ' ప్రచురణ తర్వాత (1928) శ్రీశ్రీ వృత్తరచనలు త్యజించాడు. అయితే మాత్రా ఛందస్సులో రాసిన వాటిల్లో అక్కడక్కడా పృథ్వి, మాలిని, తోటకము, తరళము, కవిరాజ విరాజితము, భుజంగ ప్రయాతము వంటి వాటి ఛాయలు కనిపించవచ్చు. దీనికి కారణం జీవితంలో వివిధ దశల్లో ప్రభావితం చేసిన కావ్యాలు - మనుచరిత్ర (యవ్వనంలో), వసుచరిత్ర ('ఇంచుక జ్ఞానశీలి'యైన తర్వాత). జాతుల్లో గీత పద్యం అయిన కిష్టం. 'ముత్యాల సరం' ఛందస్సు కూడా వాడాడు. గురజాడ దేశీయ ఛందస్సులలోనే అచ్చమైన తెలుగుదనం ఉందని నిరూపించాడు. అవే ప్రజల జీవితానికి అత్యంత సన్నిహితమైన వాహనాలని మరచిపోయిన సంగతిని మళ్ళీ జ్ఞాపకం చేశాడు అంటూ స్మరిస్తాడు. జాతికి జీవననాళిక జానపదగీతిక అని కీర్తిస్తాడు. అయితే ఆయనది స్వచ్ఛందమైన కవితా ధోరణి.

శ్రీశ్రీ స్వతంత్రంగా రాసిన మొట్టమొదటి వచనగీతం (శ్రీశ్రీ వచన కవితను 'వచన గీతం' అనే వాడాడు) విద్యున్మాలికలు (1933). తర్వాత ఆకాశదీపం, కవితా ! ఓ కవితా ! వంటి మరచిపోలేని వచన కవితల్ని సృష్టించాడు. ఏ నియమం లేకపోవడమే వచన గీతాల లక్షణం. సాహిత్యంలో సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించడమే వీటి లక్ష్యం అంటూ వచనగీతం తన రూపం తనే నిరూపించుకుంటుంది. ప్రతి వచన గీతాన్ని దేన్ని దానిగా విశ్లేషించి సమాలోచించాలి అంటారు. వచన గీతాన్ని కళారూపంగా తీర్చిదిద్దడానికి ముందుగా కొంత శోధనా పరిశోధనా చేశాడు. హరీంద్రనాథ్ గీతాలూ, మరికొన్ని ఆంగ్ల గీతాలు తెనిగించడం ద్వారా సాధన కొనసాగించాడు: ముద్దుకృష్ణనీ (ముద్దుకృష్ణ రాస్తున్న వచన గీతాల్ని ఎప్పటికప్పుడు అతని ముఖతానే శ్రీశ్రీ వినేవాడు), శిష్టానీ ప్రేరేపిస్తున్న పాశ్చాత్య కవుల దగ్గరికి సరాసరి వెళ్ళాడు. ఆంగ్ల కవులకన్నా శ్రీశ్రీని ఫ్రెన్సు, జర్మనీ దేశాల కవులు ఎక్కువగా ఆకర్షించారు. ఆవేశం, నిజాయితీ, నిజాన్ని అన్వేషించే అభినివేశం కవిత్వంలో స్వేచ్ఛా రూపాల్లో ఎక్కువ వ్యక్తం కావడం గమనించాడు. ఆ క్రమంలో తన సొంత గొంతుకను వెదుక్కొనే ప్రయత్నం చేశాడు. దాని ఫలితమే 'మహాప్రస్థానం' సంపుటిలోని వడి, వాడి కవితలు.

శ్రీశ్రీ కవిత్వంలో వడి, వాడి (Speed and Force) ఉన్నాయని చాలా మంది భావించారు. చలం 'యోగ్యతాపత్రం'లో వీటిని సూచించాడు. శ్రీశ్రీ కూడా తన కవిత్వాన్ని గురించి చెప్పేటప్పుడు చాలా చోట్ల వీటిని ప్రస్తావించాడు.

ఇవన్నీ స్వీయాత్మక ప్రతిస్పందనలు (Subjective reactious) శాస్త్ర పరిభాషకాదు. వీటి వెనకాల శాస్త్రీయం(Objective) గా వెతకదగిన రచనా మూలాలేవైనా ఉండి ఉండాలి, కవిత్వంలో వేగాన్ని సాధించే ఒక ఉపాయం ఛందస్సు అంటూ అనుప్రాసలవల్ల, ఒక మాటనుగాని కొన్ని మాటలనుగాని పునశ్చరణ చేయడంవల్ల (నోటి కూర్పులోని పునరుక్తవ్యవస్థ ఇదే), యమకంవల్ల, వాక్యరూపాన్ని మార్చడంవల్ల వచనగీతంలో ఈ గుణం సాధించవచ్చు నంటాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ కవితలో ఇవి పుష్కలంగా కనిపిస్తాయి. వేరే ఉదాహరణలక్కర్లేదు.

వచనగీతానికి ప్రాణప్రదమైనది గమన వైవిధ్యం అంటూ ఇది సంభాషణ లోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణా విశేషాలమీద ఆధారపడి ఉంటుందని గుర్తిస్తాడు. ఇవన్నీ భాషలో వ్యవహార (Speech) వ్యవస్థాంశాలు. వాక్యస్వరం (intonation), ఊనిక (Stress) మొదలైనవి ఈ కోవలోకి వస్తాయి. కవిత్వ మెళకువలను చదవడంలో ప్రస్ఫుటం చేయడం అంటే ఇదే. వీటివల్ల కవితలో ఒక వాస్తవ వ్యవహార సన్నివేశ కల్పన జరుగుతుంది. ప్రశ్న, పిలుపు, నిశ్చయం, నిషేధం, అనుకృతి (Reporting), విధి (Command, request), సంబోధన, ఈప్సితం, మెచ్చుకోలు, తిట్టు, వేళాకోళం, గొప్పలు చెప్పుకోవడం, ఆశ్చర్యం వ్యక్తంచేయడం వీటిల్లోకొన్ని. ఇవి ఒకటి కంటె ఎక్కువరకాలు శ్రీశ్రీ ప్రతి కవితలో కనిపిస్తాయి.

శ్రీశ్రీ కవితలో 'నేను' అంశ ఎక్కువ. 'నాది Subjective poetry యే ఎక్కువ' అని ఆయన అనడం ఇందుకే. శ్రీశ్రీ కవితలో 'నీవు' అంశ కూడా ఎక్కువే. ఈ రెండూ లేని కవితలు అరుదు. అనుకృతి వాక్యాలు, ఈ నేను, నీవులతో నిర్మించిన వాక్యాలు కవితలో సంభాషణాత్మక శైలికి దారితీసి నాటకీయతను (Dramatic effect) తెస్తాయి. తిక్కనగాని, వేమనగాని, గురజాడకాని రాసిందంతా ఆద్యంతం నాటకం అనే అభినివేశం కలిగిన శ్రీశ్రీ వాళ్ళనుంచి ఈ లక్షణాన్నే పుణికిపుచ్చుకున్నాడు.

శ్రీశ్రీ కవితలో ఇంకో ప్రధానాంశం ఉంది. శ్రీశ్రీ తన కవితలో ధ్వని సూచక ధ్వనిబోధక రూపాలతో పాటు చలన సూచక, చలన బోధకరూపాలు, చలనార్థక, ధ్వన్యర్థక పదాలు విరివిగా వాడాడు. ఈ గుణంవల్లనే కావచ్చు కొంతమంది ఈయనది శబ్దాశ్రియ కవిత అన్నారు. అర్థం గౌణం అని వ్యాఖ్యానించినవారూ ఉన్నారు. ధ్వని (Sound), చలనం (Movement) ఈ రెండూ కాలావధికాలు

(Operate in time)[3], శ్రీశ్రీ వచన రచనల్లో కనిపించే కాలతత్వజిజ్ఞాసకు కూడా ఇదే ప్రేరణ. (శ్రీశ్రీ వచన రచనలో novice శ్రీశ్రీ వచన రచన చేయనక్కరలేదు అని కొడవటిగంటి కుటుంబరావు అన్నాడు.[4] దాన్ని గురించిన చర్చ ఈ వ్యాసపరిధిలోకి రాదు కనక మరోసారి). శబ్దగతప్రాణి శ్రీశ్రీ అనే విమర్శలకు శ్రీశ్రీ జవాబు- అర్థగతప్రాణుల అనర్థభాష అది- అని. ఆయన దృష్టిలో శబ్దం అర్థాన్ని శ్రోతకు చేరవేసేవాహిక. అందుకే శబ్దం ఎంత శక్తివంతమైన అర్థమంత స్పష్టంగా అందుతుంది.

శ్రీశ్రీ కథన కవితలు కూడా రాశాడు - ఆకాశదీపం, భిక్షువర్షీయసి వంటివి. వీటిల్లో కథాకథనరీతి, an emotional sweep and passionate outbursts conducive of a high poetic order (ఒక ఉత్తమ కవితా స్థితికే మాత్రమే సాధ్యమయ్యే ఊర్పుకునేపోయే ఉద్వేగం, ఆవేశభరమైన చిమ్ముకొని వచ్చే వ్యక్తీకరణలు) సాధించడానికే తోడ్పడింది - కథనంలో విషయానికీ గుణం కలిగించడం నోటి కూర్పు పద్ధతి.

నియతమైన సులభసాధ్యమైన రచనా నిర్మాణం ఒకటి శ్రీశ్రీ కవితల్లో కనిపిస్తుంటుంది. ఇది నోటి కూర్పు లక్షణాల్లో ఒకటి. శ్రీశ్రీ కవితలో కనిపించే ఆవృత్తి నోటి కూర్పులోని పునరుక్త వ్యవస్థను తెలుపుతుంది. ఇది వర్ణస్థాయి నుండి వాక్యస్థాయి వరకు ఉంది. 'మహాప్రస్థానం' సంపుటిలోని 41 కవితల్లో 32లో

---

3. ఒక వస్తువు చలనంలో ఉన్న క్షణాన్ని అదే వస్తువు సరిగా చలనం ఆగిపోయిన క్షణంతో కలిపేటప్పుడు స్ఫురించే పరస్పర సంబంధాన్ని ప్రదర్శించేదే సంక్షుబ్ధ సౌందర్యం. అది కానిది సౌందర్యమేకాదు. ఏదో ఒక సత్యం సాక్షాత్కరించి నప్పుడు ఉద్గమించే ఉద్రేకపు ఉత్సర్గంలోనే ఇటువంటి సౌందర్యం సంభూత మౌతుంది. అప్రయత్న రచనలో ఆవిష్కృతమౌతూన్న చిత్ర విచిత్ర వస్తుజాలమే ఇందుకు గొప్ప ఉదాహరణ.

ఒకానొక కాలానికీ, స్థలానికీ సంబంధించిన దృశ్యంనుండి వెంటనే ఇంకొక స్థలకాలాల దృశ్యానికి గంతులువేసి ఒప్పించుతుంది కవిత్వం - సంక్షుబ్ధ సౌందర్యం- ఢంకా (1945 ఏప్రిల్)

4. శ్రీశ్రీ వచన రచన - కొడవటిగంటి కుటుంబరావు. సృజన 14, (ఫిబ్రవరి 1970) శ్రీశ్రీ సాహిత్య సమాలోచన సంచిక.

ఇది కనిపించింది. మిగతా తొమ్మిది కథనాత్మక, వివరణాత్మక రచనలు. వీటిల్లోనూ పర్యావృత్తి లాంటివి లేకపోలేదు. ఈ ఆవృత్తి అనే సాధారణ లక్షణం అన్నింటా కనిపించినా మొత్తం కూర్పులో ఆంగిక నిర్మాణంలో ఏ కవితా పద్ధతి దానిదే. ఈ విషయాన్ని గురించి శ్రీశ్రీ చెప్పిన అంశం ఇదివరకే ఉదహరించాను. ఒక్కొక్క కవితలో ప్రత్యేకంగా సాధించిన నిర్మాణ విధాన పరిశీలన ప్రస్తుతం చేయబోవడం లేదు. ఆ విషయాన్ని సూచించడమే ఈ వ్యాసంలో నేను చేయదలచుకున్నది.

శ్రీశ్రీ భిన్న సాహిత్య ప్రక్రియల్లో కృషి చేసిన రచయిత. ఏభై ఏళ్ళుగా కొనసాగుతున్నది ఆయన కవితా సాధన. ఇతరులు ఉడవని ఆయన కవితలలోని రూప లక్షణాల్ని వీలయినంతవరకు ఆయన చెప్పిన మాటల ఆధారంగా బేరీజు వేసి విశ్లేషించి చూపడమే ఈ వ్యాస లక్ష్యం.

"సిద్ధంగా దంచిపెట్టిన సూత్రాలవల్ల శిల్పం ఏదీ జన్మించదు. మనం చేసే ప్రతి కార్యంలోనూ మన చిక్కులకు పరిష్కారం ఉంది" - శ్రీశ్రీ.

---

## కాకినాడ సన్మానాన్ని శ్రీశ్రీ బహిష్కరించాలి

విరసం ఆవిర్భావానికి విశాఖ శ్రీశ్రీ సన్మానసభలు నాంది. వాటిని వమ్ము చేయాలని సెవెన్ స్టార్స్ సిండికేట్ వారి ముసుగులో సర్కారువారు, అరసంవారు ఆనాడు హైద్రాబాదులో శ్రీశ్రీ సన్మానం ఏర్పాటుచేశారు. వాటిని బహిష్కరించి, విరసం శిశోదయానికి మంత్రసానితనం వహించాడు. ఈ పదేళ్ళుగా విరసం సాహిత్య సమరం సాగిస్తోంది. ఎన్నో ఘనవిజయాలు సాధించింది. వాటివి తుత్తునియలు చేయాలని శ్రీశ్రీ అభిమానుల ముసుగులో అరసం కాకినాడలో సన్మాన సభ ఏర్పాటు చేస్తున్నారు.

'కష్ట జీవికి రెండువైపులా నిలబడేవాడే కవి' అన్నాడోసారి శ్రీశ్రీ. ఆ సన్మానసభను శ్రీశ్రీ బహిష్కరించి తాను నిజమైన పీడితజన పక్షపాతిగా, శ్రామిక మహాకవిగా నిరూపించుకోవాలని శ్రీశ్రీని విరసం మరీ మరీ కోరుతోంది.

ఈ కల్లోల దశాబ్దంలో (1970-80) వెలువడిన శ్రీశ్రీ, కొడవటిగంటి కుటుంబరావుల రచనలు అచ్చువేసి ఆ పుస్తకాలు అమ్మగా వచ్చిన డబ్బు వారిద్దరికి అందజేయాలని విరసం తీర్మానించింది.

---

# శ్రీశ్రీ ఛందోన్వేషణ

చేకూరి రామారావు

ఆధునిక సాహిత్యంలో శ్రీశ్రీని మించిన అన్వేషకుడు లేడు. చెప్పదల్చుకున్న వస్తువుకు తగిన రీతికోసం నిరంతరం అన్వేషిస్తూనే ఉన్నాడు. 'ప్రభవ'లో గీతపద్యాలు, వృత్తాలు, 'స్వర్గదేవత'ల్లో వీటితోపాటు రకరకాల మాత్రా ఛందస్సులు, ద్విపదలు, 'మహాప్రస్థానం'లో ప్రధానంగా మాత్రా ఛందస్సులు, కొంత blank-verse లాంటివి, కొద్దిగా వచనకవిత్వం, మధ్యలో 1940 ప్రాంతంలో కొన్ని కొంటెకోణాలు, ఇటీవలి వచనం లాంటి కవిత్వాలూ వ్యక్తీకరణలో శ్రీశ్రీ నిర్వహించిన ప్రయోగాలకు గుర్తులుగా ఉన్నై. ఇవికాక అధివాస్తవికపు వచనం, చరమరాత్రిలో కథల్లాంటి వచనం, వారం, వారంలో జర్నలిస్టు వచనం- ఇవన్నీ ప్రయోగాత్మకమైనవి. గురజాడను గురించి చెప్తూ శ్రీశ్రీయే 'అలుపు లేని అన్వేషణ గతానుగతికత్వాన్ని సహించలేదు.' అంటాడు. అట్లాంటి అలుపులేని అన్వేషకుడు శ్రీశ్రీ. ఈ అన్వేషణ రచనా రూపాన్ని వెతుక్కోవటంలో చాలా ప్రముఖంగా కనిపిస్తుంది. ఆ ప్రయత్నంలోనే ఛందస్సులో కొన్ని ప్రయోగాలు చేశాడు.

శ్రీశ్రీ ఛందస్సులనగానే "శ్మశానాలవంటి నిఘంటువులను దాటి, వ్యాకరణాల సంకెళ్లువిడిచి, ఛందస్సుల సర్ప పరిష్వంగం వదిలి" అని 1939 అక్టోబరు 'భారతి'లో అచ్చయిన 'కవితా ఓ కవితా' అనే ఖండికలో అన్నదీ, 'ఛందో బందోబస్తులన్నీ ఛట్ ఫట్ మని త్రెంచి; Damn it ఏమిటాని ఇదంటే, Pray it is poetry అందాం' అని 1940 'ప్రతిభ' గిడుగు రామమూర్తి స్మారకసంచికలో అచ్చయిన 'కొంటెకోణాలు'లో అన్నదీ గుర్తుకువస్తాయి. శ్రీశ్రీ ఛందో బందోబస్తులన్నీ తెంచినవాడు కాడు. ఛందస్సుల సర్ప పరిష్వంగం వదిలినవాడూకాడు. ఆధునిక సమాజవాస్తవిక చిత్రణ కోసం ప్రాచీనచ్ఛందో మార్గాన్ని దాటి పోవటానికి శ్రీశ్రీ చేసిన ప్రయత్నాలను మాత్రమే అవి సూచిస్తాయి.

శ్రీశ్రీ ప్రాచీన ఛందస్సుల్ని పూర్తిగా వదలినవాడుకాదు. పోనీ, పాత రోజుల్లో- పాత ఛందస్సులను వాడుకున్నా వస్తువు అంతకుముందట కవులు చెప్పిన దానికన్నా భిన్నం కాదు కనక సరిపోయింది. తరవాతయినా వాటిని పూర్తిగా వదులుకోలేదు. 1946లో 'ఆంధ్రజ్యోతి', 'ఆనందవాణి' పత్రికల్లో అచ్చేసిన సిరిసిరిమువ్వ అనే కందపద్యాల శతకం, 1947లో రాసిన 'మహాసంకల్పం' అనే ఖండికలో 'ఏ స్వాతంత్ర్యం నిమిత్తం....' అని ఎత్తుకున్న స్రగ్ధర శ్రీశ్రీకి ప్రాచీన ఛందస్సుల మీద వదలని మోజును గుర్తుచేస్తున్నాయి. 1946లో బాదలేరు ఫ్రెంచి పద్యాల్ని

తెలుగులో 'సంధ్యాగీతము'గా వృత్తగీతాల్లో అనువదించాడు. 1946లో రాసిన 'అధివాస్తవికులకు ప్రవేశం' అనే శీర్షిక కిందవన్నీ ఉత్పలమాలలు, 1944లో రాసిన 'అభిమానం, మొదటి మాట'లో కొన్ని పద్యాలవంటివి ఉన్నాయి. కాని ఇవి గణవిభజనకు లొంగటం లేదు. ఉదాహరణకు,

"అమాంతంగానే కాదండయ్యా క్రమంగా క్రిక్రమంగా నా
సమస్తం మీ సమక్షంలో సమర్పిస్తా శమిస్తే
కపాలం నవ్వితేనేం కంపింపించించిపిస్తా నీ
ప్రపంచాన్నే పాటల్లో ఆటల్లో నా మాటల్లో"

అని రాసిన దాంట్లో నాలుగు పాదాలూ ఉన్నై. ప్రాసనియమం రెండు రెండు పాదాలకు కనిపిస్తుంది. మొదటి మూడు పాదాల్లో యతి లాంటి దాన్ని గుర్తు పట్టొచ్చు. నాలుగు పాదాల్లోనూ మొదటిగణం య గణం. కానీ గణక్రమం నాలుగుపాదాలకే ఒకటిగా లేదు. 1) య, మ, మ, య, య, గగ 2) య, మ, త, మ, య, 3) య, ర, మ, మ, య, 4) య, మ, మ, మ, గగ- అనే విధంగా గణాలున్నై. భిన్నప్రాస పూర్ణ విషమ ఛందస్సు అనో ఏదో అనాల్సుంటుంది దీన్ని. గురువులు ఎక్కువగా ఉపయోగించి వృత్తభ్రాంతి కలిగించేట్టుగా రాసిన పద్యమిది. వృత్తాలు కాని వృత్తాలు రాయటానికి చేసిన ప్రయోగం అనుకుంటాను. వీటన్నిటిని బట్టి చూస్తే ప్రాచీన ఛందస్సుల మోజుని శ్రీశ్రీ కనీసం 1947 వరకైనా వదుల్చుకోలేదని చెప్పొచ్చు.

శ్రీశ్రీ ఏవి రాసినందుకు మహాకవిగా మనలో చాలామంది గుర్తిస్తున్నామో వాటిల్లో ఎక్కువభాగం మాత్రా ఛందస్సులోనూ, ఛందో విరహితంగానూ ఉన్నాయి. ఛందస్సు లేని వాటన్నిటినీ వచన పద్యాలనటం కూడా కుదరదనుకుంటాను. లేకపోతే, పద్యత్వ గుణం- అంటే నాలుగు పాదాలు కూర్చుకుంటూ, పాదపరిమాణంలో విపరీతమైన భేదం లేకుండా ఉండి, సాంప్రదాయికమైన పద్యాల్లో కనిపించే వాక్య నిర్మాణంతో, విరుపులతో అనియతంగానైనా యతులూ, ప్రాసలూ, అనుప్రాసలూ, అంత్యప్రాసలూ వాడి, రాసే దీకప్పు కవిత్వాన్ని వచన పద్యాలనీ, రూపంలో వచనత్వాన్ని అర్థంలో కవిత్వాన్ని సంతరించుకున్న వాటిని వచన కవిత్వమనీ అనుకుంటే శ్రీశ్రీ రాసిన ఛందోవిరహిత కవిత్వంలో ఎక్కువ భాగాలు పద్యాలవాసన కొట్టేవే. అంటే పైనచేసిన విభాగం ప్రకారం వచన పద్యాలవుతాయి. (ఇక్కడ వచనగేయాలని వేరే విభాగం చెయ్యటం లేదు. గేయాలుకూడా పద్యాల్లాంటివే అనుకోవాలి.)

తిలక్, అజంతా, దిగంబర కవులతో పోలిస్తే ఈభేదం గుర్తించగలం. ఉదాహరణకి 'విషాదాంధ్రి' (1969)లో ఛందస్సు పాటించలేదు.

> 'శిశువుకి దక్కని స్తన్యంలాగ ప్రవహిస్తున్నాయి గోదావరి నీళ్ళు
> బద్దలైన గుండెల్లాగ బీటలు వేశాయి పొలాలు
> మన పరిశ్రమలు ప్రణాళికల్లోనే మన ప్రతిభ చాకిరీకి తాకట్టు
> మనకో ఇల్లంటూ లేదు రచ్చకెక్కె రాద్ధాంతాలు.'

ఇట్లా నాలుగు పాదాల విభజన వాక్యవాక్య భాగాల్లో సమత్వం, పాదపరిమాణంలో దగ్గరితనం, పద్యలక్షణాల ప్రభావమే అనుకొంటాను. అట్లాగే 1954లో రాసిన శరచ్చంద్రికలో విషాదాంధ్రి చిన్నపాదాలతో ఉంది. మళ్ళీ అదే సమత్వం.

> అలాంటప్పుడు మళ్ళీ
> కలం కాగితం మీద పెట్టి
> కళంకం లేని తెల్లదనాన్ని
> ఖరాబు చెయ్యడ మెందుకు?
>
> అనాది నుంచీ నువ్వ
> అంతమంది కవులకీ
> ఉపాదేయ వస్తువుగా నిలిచి
> ఉపకారం చేశావు

ప్రాసయతులూ, ఆదియతులతో పైవి పద్యాల్లాగే కనిపిస్తున్నై కాని వచనత్వాన్ని సంపాయించలేదు. విషాదాంధ్రిలో వాక్యాల్లోనైనా వచనత్వం కనిపిస్తున్నది. శరచ్చంద్రికలో అదికూడా లేదు. కవిత మొదటి సంచికలో (1954) అచ్చయిన "నగరంలో వృషభం"లో నాలుగు పాదాల విభజన లేకపోయినా పాదమధ్య, పాదారంభ యతులు కనిపిస్తూనే ఉన్నై. నిజానికి యతులమోజు శ్రీశ్రీలో వచనం రాసేటప్పుడు కూడా కనిపిస్తుంది. ఉదాహరణకు కొన్ని వాక్యాలు చూడండి.

1) 'ఆరుద్రకి ఈ మధ్య అర్జంటుగా ఐదు రూపాయలు కావలసి వచ్చింది. కథ రాస్తానని కాగితం మీద కలం పెట్టి తర్వాత ఇరవై నిమిషాలకి పూర్తిచేసి నాకు చూపించాడు. ఆ కథ అప్రయత్న రచనకి ఆశ్చర్యకరమైన ఉదాహరణ. సద్యోగర్భానికి చక్కని నిదర్శనం. (కథ కథ - నవోదయ 1947)

2) 'ప్రబంధాల్లో శృంగారం అని ప్రత్యేకంగా పేర్కొన నక్కరలేదు. ... ఉత్పత్తి సాధనాలు ఏ వర్గం చేతిలో ఉంటాయో ఆ వర్గానికే అన్ని అధికారాలూ అని మార్క్సిజం బోధిస్తుంది.' ప్రస్తుతం మనం మాట్లాడుకునేది సాహిత్యం కాబట్టి అందులో మానవుడందుకున్న మహత్తర శిఖరాలను మననం చేసుకోవడంలో అను

చితం ఏమీలేదు. ["ప్రబంధాల్లోని శృంగారం"- ఆలిండియా రేడియో, మద్రాసు 1966] శ్రీశ్రీ ప్రతివాక్యమూ ఇట్లారాస్తాడని కాదు. ఇట్లాంటి వాక్యాలు తరుచుగా రాస్తాడని. అందువల్ల శ్రీశ్రీ రాసే వచన కవిత్వంలో కూడా ఇట్లాంటి యతులు పాదాదిన కాని పాద మధ్యంలో కాని తరచు దొర్లుతుంటాయి.

వచనత్వాన్ని సాధించిన వచన కవిత్వం శ్రీశ్రీ అసలు రాయలేదనికాదు. Walt Whitman లాంటి కవులకు చేసిన అనువాదాలు ఈ వచనత్వాన్ని సాధించినై. కొన్ని వచన కవితలు సీరియస్‌నెస్ వల్ల కాక చమత్కారం వల్ల, వైచిత్రివల్ల కవిత్వంగా కనిపిస్తాయి. శ్రీశ్రీలో వైచిత్రి ప్రియత్వమూ, లయ, ధ్వని సామ్య ప్రియత్వమూ మొదటి నుంచీ ఉన్నాయి. వాటిని గుర్తుపట్టటం కష్టం కాదు. ఆయన ఆలోచనల్లో విడదీయరానంతగా కలిసిపోయిన ఈ రెండు లక్షణాలు ఆయన వచన కవితల్లోకి కూడా ప్రవేశిస్తాయి. అందువల్ల వచన కవిత్వం శ్రీశ్రీకి బాగా నలిగిన మార్గం లాగా కనిపించదు.

అధివాస్తవిక పద్యాల్లో చమత్కారం, 'ప్రభవ' పద్యాల్లో సమాన కల్పన వదిలేస్తే ఆయన కంద పద్యాల్లో సాధించింది ఒకటుంది. మాట్లాడే భాషను పద్యాల్లోకి అతి సునాయాసంగా చొప్పించాడు. కృతకత్వాన్ని కూడా చాలా వరకు తప్పించాడు. గేయాలకన్నా కూడా వాడుకభాష ఈ కంద పద్యాల్లో ఎక్కువ కని పిస్తుంది. ముఖ్యంగా 1946లో రాసిన సిరిసిరిమువ్వ శతకం ఇందుకుదాహరణ.

వృత్తాల్లో ప్రాచీన కవులకన్నా, గీత పద్యాల్లో భావ కవులకన్నా, శ్రీశ్రీ కాని, ఇంకొకరు కాని కొత్తగా సాధించేదేమీ ఉండదనుకుంటాను.

శ్రీశ్రీ ఎక్కువగా ప్రచారమయింది గేయకవిత్వం ద్వారా. అప్పటికే కృష్ణ శాస్త్రి, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, అడివి బాపిరాజు, ఇంకా మరి కొందరు కవుల భావగీతాలు, రాయప్రోలు సుబ్బారావుగారి దేశభక్తి గీతాలు దేశంలో బాగా ప్రచారంలో ఉన్నై. రాయప్రోలు నుంచి మొదలయిన భావకవులు గురజాడ అప్పారావుగారు ఆవిష్కరించిన ముత్యాలసరాలు వాడుకున్నారు. (మొదటి తరంలో తల్లావఝుల శివశంకరశాస్త్రి, రెండో తరంలో పట్టికొండ రంగయ్య ముత్యాలసరాలను అందంగా నడిపించటానికి ప్రయత్నించిన వాళ్లు.) ఆ దశలో శ్రీశ్రీ గేయాల్ని అందు కున్నాడు. ['ప్రభవ'లో వాడిన గేయ ఛందస్సు ముత్యాలసరం మాత్రమే.] ఛందస్సులో మూలగణాల రీత్యా శ్రీశ్రీ రాసిన గేయాలకీ, భావగీతాలకీ, ఆ మాట కొస్తే జానపద గీతాలకీ, ఇంకా కలుపుకుంటే కీర్తనలకీ భేదం లేదు. అన్నిట్లోనూ

అవే మాత్రాగణాలు - త్రిస్ర, చతురశ్ర, ఖండ గతులనుత్పత్తి చేసే 3, 4, 5 మాత్రల గణాలు; వీటి కలయిక వల్ల ఏర్పడే మిశ్ర, సంకీర్ణ గతులు - వీటన్నిటికీ సమానమే. అయితే ఈ రీతులను వేరుచేసే ఇతర లక్షణాలు లేకపోలేదు. కీర్తనలలో పల్లవి, అనుపల్లవి, చరణాలు అనే విభాగం ఉండి నియత రాగాలుంటాయి. జానపద గీతాలలో సాంప్రదాయికమైన రాగ ప్రస్తారం ఉండదు. స్వచ్ఛందమైన జానపదుల బాణీలుంటాయి. ఇవేకాక, వస్తువుని బట్టి, డిక్షన్‌ని బట్టి కూడా భేదాన్ని గుర్తించొచ్చు.

శ్రీశ్రీ కవితను భావకవుల నుంచి వేరుచేసే ఒక గుణం వస్తువు. ఈ భేదం అందరికీ తెలిసిందే కనక విస్తరించాల్సిన పనిలేదు. రెండో భేదం డిక్షన్, ఇమేజరీ. లోహవిహంగాలు, మౌనమృదంగాలు, యంత్రభూతములు, కార్మికధీరులు, షరాబు, ఎగిరేలోహశ్యేనం, లోహఘంటలు, ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం, జవరాలి మనః ప్రపంచపుటావర్తాలు, ఏడుపుకత్తె రాత్రసరతిలో అర్ధనిమీలిత నేత్రాల భయంకర బాధల పాటల పల్లవి, ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం, రవ్యుష్ణ గీతి, పవ్యగ్రహేతి, ఇనుపడేగ – ఈ రకమైన పద సంయోజన, భావ చిత్రణ భావ కవుల్లో ఎక్కడా కనపడదు. వాళ్లల్లో కనిపించేవి ఇరుల గుసగుసలో తుషారపు స్వప్న రాశులు, చలువపిసాళి గాలి నునుచక్కిలిగింతలు, నునుమంచుతీవ సొన – వంటి లలితమైన పదసంయోజనలు. వీటికీ శ్రీశ్రీ డిక్షన్‌కీ ఎంత భిన్నమో గుర్తించటం కష్టం కాదు.

ఇక మూడో భేదం శ్రీశ్రీ మాత్రాగణ సంయోజనలో ఎన్నుకొన్న పద్ధతులు. శ్రీశ్రీ గేయచ్ఛందస్సులను రకరకాలుగా ప్రయోగించారు. భావకవుల ముత్యాల సరాల్లో డిక్షన్, పదసంయోజన, ప్రాసయతుల వాడకం, పాదాంతాల విరుపులు లేకుండా తరువాత పాదాల్లో కలిసిపోయే పద్ధతి (run - on - verse), సమాసకల్పనలో ప్రౌఢత్వం, వంటి కొన్ని మార్పులు చేశారేగాని ఛందస్సును యథాతథంగానే స్వీకరించారు. నాలుగోపాదంలో వీళ్ల వాడిన భేదాలన్నీ గురజాడ వాడుకలోనూ కనిపిస్తాయి, అబ్బూరి రామకృష్ణరావుగారు మాత్రం 1918లో అచ్చయిన 'ఊహాగానం'లో ఒక చిన్న మార్పు చేశారు.

'పూ / జాశిరీషము లేరుకొంటివి / పోయివచ్చెదో జవ్వనీ
తే / జోవిలీన దృగంచలమ్ముల / తేటి చూచెద నెవ్వని?'

దీన్ని శ్రీశ్రీ 1930లో గంటి సూర్యనారాయణగారి సంపాదకత్వాన వెలువడిన 'శృంగార కంఠాభరణం' అనే సంకలనంలో 'హారతి' అనే ఖండికలో ఈ విధంగా అనుసరించారు.

'ఈ / తామసీ నిశ్శబ్ద హృదిమన / కిర్వరకు స్వాగతముగా
శ్వే / తస్మితామృత శిశిరవీచీ / శీకరములో లయించగా !'

ముత్యాలసరంలో పాదానికుండే 14 మాత్రలు, మిశ్రగతిలో 3+4+3+4 క్రమంలో ఉంటై, ఇట్లాంటివి రెండుపాదాలు కలిపితే 28 మాత్రలుంటాయి. ప్రాచీనుల వృషభగమన రగడలో పాదానికి 28 మాత్రలు ఉంటాయి. ప్రాచీన ఛందశ్శాస్త్రంలో గతుల నిర్వచనం చేయలేదుగనుక ఈ రగడ నడక మిశ్రగతిలో ఉంటుందని చెప్ప లేదు. అప్పకవి రచించిన లక్ష్య పద్యంలో ఈ నడక కనబడదుగానీ అనంతుడి ఛందో దర్పణంలో చూపిన లక్ష్యంలో మిశ్రగతిని గుర్తించొచ్చు. ఈ 28 మాత్రల పాదాన్నే పైన చూపించిన రామకృష్ణరావుగారి 'పూజా శిరీషములు'లో చూడవచ్చు. రెండు పాదాలు ఒక యూనిట్‌గా ద్విపదలాగా నేసే ప్రాస కూడా అమర్చారు. నియతస్థానంలో యతి కూడా ఉంది. ఇక్కడ చేసిన తమాషా ఒకటుంది. పాదం మొదటి గురువును తొక్కిపడితే, అంటే వేరుచేసి చదివితే మనకు మిశ్రగతి విని పిస్తుంది. ఆ గురువు పాదం చివర ఉండాల్సింది మొదటికి చేరింది. ప్రతి పాదమూ గుర్వాదీ, గుర్వంతమూ అయింది. పాదానికి రెండు గురువులుంటాయి. అట్లా లేకపోతే మిశ్రగతిని సాధించటం కష్టం. కొత్త ఛందస్సుల కోసం అన్వేషించే శ్రీశ్రీని ఇది సహజంగా ఆకర్షించింది. అయితే అంతటితో ఆగకుండా తాను సొంతంగా కూడా ఈ ఛందస్సుల్లో ప్రయోగాలు చేశాడు, పాదానికి చివర గురువు లాగా ఉచ్చరించదగిన లఘువును చేర్చటం ఒక మార్పు.

1. యముని మహిషపులోహ ఘంటలు / మబ్బుచాటున ఖణేల్మన్నాయి.
2. నేను సైతం ప్రపంచాగ్నికి / సమిధ నొక్కటి ఆహుతిచ్చాను.

ఇతర ఛందస్సులలో కూడా ఈ రకమైన ప్రయోగాలు చేశాడు. తోక ముత్యాల సరంలో నాలుగో పాదంలో రెండో మాత్రా గణం తర్వాతగాని, మూడో మాత్రా గణం తర్వాతగానీ ఒక గురువుతో ముగించే సంప్రదాయం ఉంది. దాన్నే శ్రీశ్రీ ఇతర చోట్లకు వ్యాపింపచేసినట్లు కనిపిస్తుంది.

మరో ప్రపంచం, మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది.

ముత్యాలసరంలో నాలుగు పాదాలు అనే నియమం పెట్టుకోకుండా 3+4 సంయోజనను అవసరమైనంతవరకు వాడుకుంటూ పోవటం శ్రీశ్రీ పద్ధతుల్లో ఒకటి.

నే నొక్కణ్ణే నిల్చిపోతే
చండ్రగాడ్పులు వాన మబ్బులు మంచు సోనలు
భూమి మీదా భుగ్న మౌతాయి :

ముత్యాలసరంలో నాలుగు మాత్రల గణం స్థానంలో 'జ'గణం వాడరు. జగణంలో ఉన్న మూడక్షరాలలో రెండోది మాత్రమే గురువు కావటం వల్ల దాని మీదే ఊనిక (Stress) ఉంటుంది. (అధికశక్తితో ఉచ్చరించటాన్నే ఊనిక అంటారు.) మాత్రా గణాలలో ఊనికను బట్టి లయ ఉంటుంది. ఊనిక లేని మొదటి అక్షరం అంతటి ముందటి గణంతో కలిసి 3+4 కు బదులు 4+3 గణాలుగా విడిపోయి ముత్యాలసరపు నడకకు ఎదురు తిరుగుతుంది. అందువల్ల ప్రసిద్ధ కవులెవరూ ముత్యాలసరంలో జగణం వాడలేదు. కాని మూడు మాత్రల గణం స్థానంలో 'లగం' (లఘువు - గురువు క్రమం) వాడటం శ్రీశ్రీకి ఇష్టం. విశ్వనాథ సత్యనారాయణగారు తన కోకిలమ్మ పెళ్ళిలో ఇట్లావాడిన చోటును ప్రాథంగా ఉందని మెచ్చుకున్నాడు. శ్రీశ్రీ జయభేరిలో

పగళ్ళన్నీ పగిలిపోయీ / నిశీథాలూ విశీర్ణిల్లీ
మహా ప్రళయం జగం నిండా / ప్రగల్భిస్తుంది.

ఇట్లా లగం వాడిన చోట్లు చాలా ఉన్నాయి. బాటసారిలో "జ్వరం కాస్తే భయం వేస్తే ప్రలాపిస్తే" అనేది ఇంకో ఉదాహరణ.

ముత్యాలసరంలో 3+4 మాత్రల గణాల క్రమంవల్ల ఒక ప్రయోజనంఉంది. ఒకే రకపు గణాలవల్ల వచ్చే విసుగు పోగొడుతుంది. దీన్ని పర్యాయ గణప్రయోగం (alternating metrical pattern) అని అందాం. బహుశా ముత్యాలసరం నుంచి స్ఫూర్తి తీసుకొనే కాబోలు శ్రీశ్రీ మిగతాచోట్ల కూడా ఇదేపద్ధతి అవలంబించాడు. 'నల, గగ, భ, జ, స, అనేవి నాలుగు మాత్రల గణాలు. వీటిల్లో నుంచి ఎన్నుకుని చతురశ్ర గతిలో గేయం నడిపించొచ్చు. శ్రీశ్రీ ఒకే గణాన్ని పక్కపక్కనే ఉపయోగించకుండా మారుస్తూ (altenate చేస్తూ) పోతాడు. ఈ రకంగా చేయటంలో రెండు పద్ధతులు కనిపిస్తున్నై. 4 గణాలున్న పాదాల్లో బేసి గణాల్లో ఒకటిగానూ, సరిగణాల్లో ఒకటిగా ఉండేట్టు చేయటం ఒక్కోసారి రెంటిలోనూ సామ్యం తీసుకు రావటం ఒక పద్ధతి. రెండో పద్ధతి చతుర్మాత్రాగణాలకు బదులు రెండెనిమిది మాత్రల గణాలువాడి, ఆ ఎనిమిది మాత్రలూ 3+5 గా తిరిగేట్టు చెయ్యటం రెండో

పద్ధతి. ఈ రెండూ ఒకే గేయంలో ఉంటుంటాయి. ఉదాహరణకి 'జ్వాలా తోరణం'లో

"ఇదేమిలోకం హిరణ్యనేత్రుని / పదాఘాతమున ప్రతిధ్వనించగ
కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు / గదా ఘాతమున గజగజలాడగ" అనీ

'ప్రతిజ్ఞ'లో

"హాలాలనన్నీ హలాల దున్నీ / ఇలా తలంలో హేమం పిండగ
జగానికంతా సౌఖ్యం విండగ / విరామ మెరుగక పరిశ్రమించే" అనీ

'మహాప్రస్థానం'లో

"ఎముకలు కుళ్లిన వయస్సు మళ్లిన / సోమరులారా చావండి
నెత్తురు మండే శక్తులు నిండే / సైనికులారా రారండి" అనీ

రాసిన పాదాల్లో గణాలు మార్చిమార్చి వాడటం గమనించవచ్చు. గేయాల్లో వెరైటీ కోసం శ్రీశ్రీ పాటించే టెక్నిక్ ఇది. 1957లో 'తోడికోడళ్లు' సినిమాకి రాసిన పాటలో "నలుగురు కలసీ పొరుషులు మరిచీ" అన్న చోట ఇదే పద్ధతి కనిపిస్తుంది. ఈ పద్ధతిలో రాసే అలవాటు శ్రీశ్రీకి చాలా పూర్వం నుంచే వున్నట్టు 1928 అక్టోబరు 'భారతి'లో ప్రచురించిన కావ్యఖండికలో ఈ భాగం వల్ల తెలుసుకోవచ్చు.

"అహర్ముఖాంచిత హర్షవీచికల / జాండ ఖాండమున నిండినవి
రహః ప్రశాంత దినోదయవేళా / రాగఘోషములు మ్రోగినవి"

పదాది అక్షరమ్మీద ఊనిక ఉండటం తెలుగు పద్ధతి. మొదటి లఘువు తరవాత గురువువస్తే ఆ గురువు మీదనే ఊనిక ఉంటుంది. ఈ ఊనికను బట్టి లయ ఏర్పడుతుంది. వీటిల్లో అనులోమ, విలోమ భేదాలు ఉన్నై. లఘువుతో మొదలయి, రెండో అక్షరం గురువుగా ఉండే గణాల్లో రెండో అక్షరం మీద ఊనిక ఉండటం వల్ల వచ్చేనడకను విలోమగతి అంటారు. దీనికి విరుద్ధమైనది అనులోమగతి. విలోమ గతుల ప్రయోగం వల్ల ఇంగ్లీషులో iambic, amphibrachic ఛందస్సుల గతులకు సమమైన నడకలు తెలుగులో వస్తాయి. శ్రీశ్రీ విలోమగతి ప్రియుడు. ఇంతకు ముందటి ఉదాహరణాల్లో ఈ విలోమ గతిని చూడొచ్చు. బెజవాడ గోపాలరెడ్డిగారి పెళ్లికి 1937లో రాసిన కల్యాణ గీతిలో కూడా ఈ విలోమ ప్రియత్వం కనిపిస్తుంది.

"విభాతవేళా శుభానిలంలో / పికాంగనా శ్రావ్య కూజితంలో
అమాత్యమణీ నీ వివాహమని ఈ / సమస్త లోకం పలికింది.

వసుంధరావార్ష సుందరాస్యం / వసంత హాసం విరిసింది
దిశాంత దివిష న్నిశాంతముల హ్మ / ద్యశాంతి గానం కురిసింది"

ఈపై కళ్యాణగీతిలో బేసిగణాలు జగణాలు. ఇంతకు ముందు పేర్కొన్న గణాలు మార్చిమార్చి వాడేపద్ధతి కూడా ఇక్కడ కనిపిస్తుంది. 'ఆఖరి మాట మొదటి మాట'లో నేనింతకు ముందు పేర్కొన్న విషమ వృత్తాల్లాంటివి (ఆ వృత్తాల్లాంటి వాటిని చిన్నచ్చులో అచ్చేశారు) నాలుగున్నాయి. వాటిల్లో ఒక్క పాదం తప్ప అన్నీ 'జ' గణంతోకాని 'య' గణంతోకాని మొదలవుతై. ముత్యాలసరంలో మూడు మాత్రల గణాన్ని 'లగం'గా ఎక్కువగావాడింది శ్రీశ్రీయే. ఐతే ఈ విలోమగతి చెప్పదల్చుకున్న భావంలో ఫోర్సుకోసం ఇంతకు ముందు పేర్కొన్న 'మహాప్రస్థానం, జ్వాలా తోరణం, ప్రతిజ్ఞ' అనే గీతాల్లో సమర్థంగా వాడుకున్నాడు. మిగతాచోట్ల వెరైటీ కోసం వాడినట్టు కనిపిస్తుంది.

ముత్యాలసరంలో పాదానికి 14 మాత్రలు 3+4+3+4 క్రమంలో ఉంటాయి. శ్రీశ్రీ ఈ మిశ్ర గతితో ఇంకోరకం మిశ్రగతి 6+8 పద్ధతిలో వాడి చూపించాడు. 6 మాత్రలు రెండు మూడు మాత్రల గణాలుగా కొన్నిచోట్ల మూడు రెండు మాత్రల గణాలుగా విరగొచ్చు. 8 మాత్రలు ఒక్కోసారి రెండునాలుగు మాత్రల గణాలుగా విరగొచ్చు. లేకపోతే 3+5 గా విరగొచ్చు. 'అద్వైతం, నవకవిత, దేశచరిత్రలు, పేదలు' అనే మహాప్రస్థానంలోని గేయాల్లో ఈ ఛందస్సు వాడుకున్నాడు. తాత్వికమైన భావాలకు ఈ ఛందస్సు వాడుకున్నట్లు కనిపిస్తుంది. 'అద్వైతం'లో A,A, BB, అనే రైమూ, 'పేదలు'లో A,A,B,A అనే పద్ధతి రైమూ, (అంత్యసామ్యం) కనిపిస్తుంది. రైముల్లో వీలైన పద్ధతులన్నీ శ్రీశ్రీలో కనిపిస్తాయి. లిమ బుక్కుల్లో పద్యత్వం ప్రధానంగా అంత్యసామ్యం వల్లనే.

శ్రీశ్రీ ఛందస్సుల్ని భావానుగుణంగా ప్రయోగించినట్టు ఆయన గేయాల్ని పట్టి చెప్పొచ్చు. ఔద్ధత్యాన్ని వ్యక్తీకరించే చోట చతుర్మాత్రాగణాల్లో జగణాన్ని ఎక్కువగా వాడతాడు. శృంగారగీతమైన అద్వైతంలో జగణాలు రావు. గురువులున్న 4 మాత్రల గణాలే వాడి పాదం గుర్వంతం, అదీ సున్నాతో అంతం చేస్తాడు. దీని వల్ల గేయానికి గేయత్వం వచ్చింది. విషాదాన్ని వ్యక్తం చేసే 'భిక్షువర్షీయసి'లో కూడా విలోమగతి ఎక్కువగా రాదు. కనీసం పాదాదిన రాకుండా జాగ్రత్తపడతాడు. సమాసా లెక్కువుండవు. పెద్ద సమాసాలసలే వుండవు. ఇట్లా భావానుగుణంగా శైలిని రూపొందించుకోవటంలో శ్రీశ్రీ ప్రతిభను విమర్శకులింతకుముందే గుర్తించారు. ఆ శైలి పదాలను ఎన్నుకోవటంలోను, గతులను కూర్చటంలోనూ, ఛందస్సు సెలక్షన్‌లోనూ చూపించే మెలకువలవల్ల ఏర్పడుతుంది.

వ్యక్తీకరణకోసం భాషలోనూ, ఛందస్సులోనూ చేసిన అన్వేషణ శ్రీశ్రీ రచనలన్నింటిలోనూ కనిపిస్తుంది. అందుకే అనితరసాధ్యమైన మార్గాన్ని తయారు

చేసుకోగలిగాడు. ఈఅన్వేషణ ప్రాధాన్యాన్ని చెప్పిన శ్రీశ్రీ వాక్యాలతోనే ఈ వ్యాసం ముగుస్తుంది.

"వేసిన దారంట వెళ్ళిపోవడం సులభం. అంతేకాదు పదిలం. నలుగురికీ తెలిసిందీ, చిరకాలం నుంచీ నలిగిందీ ఒక దారి సిద్ధంగా, సుప్రసిద్ధంగా ఉంటూనే ఉన్నప్పుడు వేరే ఒక కొత్తదారి వెతకడం అవివేకం, ప్రమాదం అని అంటారు కొందరు. కానీ పురోగమనానికి కొత్తదారులే రాచబాటలు. అలుపులేని అన్వేషణ గతానుగతికత్వాన్ని సహించలేదు."

శ్రీశ్రీ అట్లాంటి అన్వేషకుడు!

---

ప్రజాకవి చెరబండరాజు ఆరోగ్యం కోలుకోవడానికి

ఆర్థికంగా, అన్నివిధాలా తోడ్పడండి.

విరసం కార్యవర్గ సభ్యుడు చెరబండరాజు బ్రెయిన్ ట్యూమర్ గురించి రెండో సారి పధ్నాలుగు గంటలపాటు నవంబర్ 3, 1979న ఆపరేషన్ చేయబడి ఇటీవలే ఆస్పత్రి నుంచి బయటకు వచ్చాడు. ఆయన ఆరోగ్యం ఇంకా పూర్తిగా కోలుకోలేదు.

సికిందరాబాదు కుట్ర కేసులో అరెస్టయిన కొద్ది రోజుల్లోనే ప్రారంభమైన అనారోగ్యం క్రమంగా దీర్ఘవ్యాధిగా పరిణమించి ఎమర్జెన్సీ తొలగిన తర్వాత బ్రెయిన్ ట్యూమర్ గురించి మేజర్ ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. దీనికి తోడు ఆయనకు అల్సర్ వ్యాధి కూడా వుంది. మళ్ళీ తీవ్ర అస్వస్థతకు గురై రెండోసారి బ్రెయిన్ ట్యూమర్ ఆపరేషన్ చేయాల్సి వచ్చింది.

ఈ పరిస్థితులలో ఆరు సంవత్సరాలుగా ఆయన ఉద్యోగంలో కూడ లేడని ప్రజల దృష్టికి తేదల్చుకున్నాం. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత తిరిగి ఉద్యోగంలో చేర్చుకోబడని ఒకే ఒక్క రాజకీయ ఖైదీ చెరబండరాజు. ఈ సందర్భంలో ప్రజలకీ కింది విజ్ఞప్తి చేస్తున్నాం.

1) చెరబండరాజును వెంటనే ఉద్యోగంలోకితీసుకోవాలని ప్రభుత్వంమీద ఒత్తిడితేవాలి
2) ఉపాధ్యాయ సంక్షేమ నిధుల నుంచి ఆయన ఆపరేషన్ గురించి, కుటుంబ పోషణ గురించి సహాయం అందచేయాలి.
3) విరసం ఏర్పాటు చేస్తున్న చెరబండరాజు ఆరోగ్య సహాయ నిధికి డబ్బు పంపదల్చుకున్నవారు ఈ కింది అడ్రసుకు పంపించాలి.

కె.వి. రమణారెడ్డి, 11-33-957, కావలి 524202 - నెల్లూరు జిల్లా.

(ఇదే కాక 110, 116 పేజీల్లోనివి కూడా 1979 అక్టోబర్ 1న చేసిన తిరుపతి, విరసం ఏడవ మహాసభ తీర్మానాలు)

---

# శ్రీశ్రీ అనువాదాలు

ఎస్. వి. ఎస్. రావు

'బండ మీద పచ్చడి నూరుతోందా అమ్మాయి
నీ గుండెల్ని నువ్వు నూరుతున్నంత సులువుగా
ఆ పచ్చడీ నీ గుండెలు మనస్స్వప్నాలు అన్నీ మిధ్య
.... .... .... .... .... .... .... .... .... ....
ఏదో వ్యాపారం చేస్తారు ఎలాగో బ్రతుకుతారు'

ఇంత సాఫీగా తెలుగుతనం పుట్టిపడుతూ యీనాటి వచన కవిత్వానికి ప్రతీకగా నిలువగల యీ పాదాలు శ్రీశ్రీ ఏనాడో వ్రాసినవని గుర్తించగల పాఠకులు తక్కువ. పైగా విదేశీ అమ్మాయి చేత మన కంది పచ్చడి రుబ్బించగల చాకచక్యం, 1913లో Appolinaire వ్రాసిన ఫ్రెంచి భాషలోని కవిత్వాన్ని యింతటి నుడికారంతో అనువదించగల ప్రతిభ శ్రీశ్రీది కాక యింకెవరిది? Waste land వంటి ఆధునిక కవిత ఆంగ్లంలో వెలువడిన పిదప కూడా భావకవిత్వపు ఊహాలోకంలో సంచరిస్తున్న తెలుగు కవిత్వాన్ని ఆధునిక మార్గంలోకి నడిపించడమే గాక మొదటిసారిగా విశ్వ సాహిత్యంతో మనకు పరిచయం కల్పించింది కూడా శ్రీశ్రీయే. ఒక శతాబ్దం వెనుకటి Words Worth, Goldsmith లను అనుసరించడం లేదా శ్రీశ్రీ చెప్పినట్లు దెబ్బయి పదకొండోసారి వల్మీకంలోని వాల్మీకిని లేవనెత్తడానికి బదులు ఫ్రెంచి భాషలోని కవితారీతులను ఆంధ్రదేశానికందజేయడం ద్వారా సమకాలీన కవిత తాలుకు పునాదులను, పరిధిని శ్రీశ్రీ మనకు విశదీకరించాడు. శ్రీశ్రీ అనువాదాలు ఇలియట్ ప్రభృతుల ద్వారా పరోక్షంగా గాక స్వయంగా Rimband తో ప్రారంభమైన ఆధునిక కవిత్వతత్త్వాన్ని గూర్చి తెలుసుకొనేందుకు ఉపయోగపడతాయి. సింబాలిస్టు ఉద్యమం తగ్గుముఖం పట్టాక Alfred Jarry (1873-1909) నాటక సాహిత్యం ద్వారా ప్రభావితుడై అదేకాలంలో చిత్రకళలో క్యూబిజం వెలువడుతున్న రోజుల్లో తదనుగుణ్యమైన ప్రయోగాలు జరిపాడు పైన ఉదహరించిన Appolinaire (1880-1918). ఆ దరిమిలాను ఉద్భవించిన సర్రియలిస్టు ఉద్యమానికి కూడా ఆద్యుడు. శ్రీశ్రీ అనుసరించిన Zone అనే Appolinaire కవిత అతిముఖ్యమైనది. ఆనాటి సాహితీ వాతావరణాన్ని తెలియజేస్తుంది. కాని శ్రీశ్రీ అనువాదాలన్నీ భావానువాదాలు కావడంవల్ల చాలా చోట్ల సముచితమైన మార్పులను మనం గమనించగలం.

'Si tu vivais dans l' ancien temps tu entrerais dans un monastere' అన్న పాదాన్ని వర్తమానానికి మార్చి 'ఏదైనా మహర్షి ఆశ్రమానికి

ఖోదామని ఉంది నీకు' అని అనువదించాడు. (ఖడ్గ సృష్టి - 128 పేజీ 5వ లైను). భావం ఒక్కటే. మరింత సూటిగా చెప్పడం జరిగింది. తరువాత వచ్చే పాదంలో నీకు నీవే సిగ్గుపడతావు అనడానికి బదులు 'యిప్పుడు నువ్వు జపించే గాయత్రి నీ గుండెల్లో బాకు' అని మార్చడం emphasis కోసమని నా ఊహ. మధ్యధరా సముద్రానికి బదులు కావేరీతీరాన్ని ఎన్నుకున్నాడు (17 లైను) కాని మూలంలోని Pragne నగరాన్ని అలాగే వదిలిపెట్టడం జరిగింది; పరాకువల్ల. 'La fille d' un sergent de ville de Jersey' తెలుగులో 'ఓీద ఉద్యోగి కూతురు'గా మారడంలో ఔచిత్యం ఉంది. మన సమాజంలో సైన్యాధికారులతో గల అనుబంధం తక్కువ. శ్రీశ్రీ అనువాదాల్లో గల స్పష్టతకు నిదర్శనంగా యీ క్రింది పాదాలు ఉపయోగ పడతాయి.

Ils Sont des christ d'une autre forme et d'une autre Croyance
Ce Sont les christ infe'rieurs des obscures espe'rances

పై వాక్యాలలోని భావాన్ని శ్రీశ్రీ క్లుప్తంగా సులభంగా అర్థమయేటట్లు

ఒక్కొక్క వీధిలో ఒక్కొక్కడు కనబడుతాడు
అందరిలోనూ దేవుణ్ణి చూస్తావు'

అని అనువదించేడు. మన సంస్కృతికి అతికినట్లున్నాయి యీ పాదాలు రెండూ.

సర్రియలిస్టు కవిత్వంతో మనకు పరిచయం కల్పించినది కూడా శ్రీశ్రీ అనే నా ఊహ. కాని శ్రీశ్రీ ఎన్ని ప్రక్రియలు చేపట్టినా అభ్యుదయవాది, మార్పుశీలి గనుక పై ఉద్యమానికి నాయకుడైన Breton (1896 - 1966) కవితను ఒక్కదానినే అనువదించినట్లు కనపడుతుంది (ఖడ్గసృష్టి - 114 పేజీ), అసలు సర్రియలిస్టు కవిత్వం మరొకళ్లు వ్రాసింది అనువదించటం దాని తర్కానికే విరుద్ధమని భావించి తానే స్వయంగా '5, 3, 2 అముక్తమాల్యద' వంటి తమాషా రచనలు మనపైకి విసిరాడు. ఫ్రెంచి భాషలోని కవులలో శ్రీశ్రీని ఎక్కువగా ఆకర్షించింది Paul Eluard (1895 - 1952). ఎక్కువ అనువాదాలు అతని కవితలే. అందుకు కారణం Eluard కూడా సర్రియలిస్టు ఉద్యమ స్థాపనకు తోడ్పడినా సిద్ధాంతంతోపాటు శిల్పం, కవిత్వపు విలువల పట్ల శ్రద్ధ తీసుకోవాలని గ్రహించిన కవి గనుక సర్రియలిస్టు ఉద్యమమంతటిలోనూ ఉత్తమకవిగా గుర్తించబడ్డాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం నాటికి పార్టీలోచేరి యుద్ధకాలంలో విమోచనోద్యమంలో ప్రముఖపాత్ర వహించాడు. శ్రీశ్రీ అనువదించిన Eluard అనువాదాలు (90 - 103 పుటలు. ఖడ్గసృష్టి) యితరు

లెవరైనా పరిశీలిస్తారని ఆశిస్తున్నాను. వాటి మూలాలు యీనాటి సంకలన గ్రంధాలలోకూడా లభ్యంకావడం లేదు. శ్రీశ్రీ అనువదించిన యితర ఫ్రెంచి భాషలోని కవులు బెల్జియం దేశస్థులైన Henri Michanx (జననం 1899), Verhaeren (1855 - 1916)లు. సర్రియలిస్టు సాహిత్యం కవిత్వంలో కన్నా గద్యంలోనే ఎక్కువగా రాణించిందని విజ్ఞుల అభిప్రాయం. Michanx అనువాదం ద్వారా శ్రీశ్రీ ఆనాటి వచన రచనతో పరిచయం ఏర్పడింది. Verhaeren కవిగాను, మానవతావాదిగాను యింకా ఎక్కువగా తెలుసుకోదగిన ఉత్తమ రచయిత. సామ్యవాదాన్ని అభిమానించిన సాహితీపరులలో ప్రథముడు. వచన కవిత్వానికి మెరుగులు దిద్దిన కవి కూడా. శ్రీశ్రీ అనువదించిన 'అంతేలే పేదల గుండెలు' (మహాప్రస్థానం - పుట. 64) శ్రీశ్రీ కవిత్వంలో అత్యుత్తమ గేయంగా కొనియాడబడింది. ఈ గేయం అనువాదాన్ని డా॥ నారాయణరెడ్డి యిదివరకే చర్చించడం సాహితీపరులకు విదితమే. ప్రఖ్యాత గ్రీకుకవి Odyssens Elysis కవిత అనువాదం (పిచ్చిదానిమ్మ చెట్టు - ఖడ్గసృష్టి, 133 పుట.) ఫ్రెంచి భాషలోని అనువాదానికి తర్జుమా అని శ్రీశ్రీయే చెప్పినట్లు జ్ఞాపకం.

ఫ్రెంచి భాషలోని ఉత్తమ కవిత్వాన్ని అనువదించి ఆంగ్లేతర సాహిత్యంతో పరిచయం కల్పించిన శ్రీశ్రీ పుష్కిన్, మైకోవస్కీ వంటి రష్యను కవులను అనువదించడం ఆధునికాంధ్ర సాహిత్యానికి సమకూర్చిన యింకొక మహోపకారం. ఆంధ్రదేశంలో సామ్యవాద ఉద్యమానికి దాదాపు ఏభయి సంవత్సరాల చరిత్ర ఉన్నా రష్యన్ భాషలోని కవిత్వంతో మనకంతగా పరిచయం లేకపోవడం ఆశ్చర్యకరమైన విషయం. కేవలం నవలా సాహిత్యం అదికూడా అతిస్వల్పంగానే లభ్యమవుతుంది. కేరళ మిత్రుల కథనం ప్రకారం War and Peace వంటి విశ్వసాహిత్యంలోని ముఖ్యమైన గ్రంథాలన్నీ మళయాళ భాష అనువాదాల ద్వారానే చదువుతారట విద్యావంతులు, మేధావులు కూడా. ఆంధ్రదేశంలో యింకా ఏవాదో బూజుపట్టిన సాహిత్యానికి, చపుకబారు రచనలకు గిరాకీ ప్రాప్తించడం యిందువల్లనే కాబోలు; మంచేదో చెడ్డదో తెలియక. మనకీ అనువాదాలున్నా అవన్నీ దిగదుడుపు రచనలు. గవర్నమెంటు గ్రాంట్లకోసం. రాజకీయ కారణాలేగాక రష్యన్ కవిత్వానికి పాశ్చాత్య సాహిత్యంలో చాలా గౌరవం ఉంది ముఖ్యంగా శబ్దలాలిత్యం దృష్ట్యా. నేనెరిగినంతవరకు రష్యన్ కవిత్వాన్ని అనువదించింది శ్రీశ్రీ మాత్రమే. పుష్కిన్ అనువాదాలు విరివిగా దొరుకుతాయి కాని మైకోవస్కీ కవిత ఆంగ్లానువాదం కూడ యిటీవలనే

వెలువడింది (సోవియట్ ప్రచురణ). ఇకపైన Lermontov, Tyutchev, Blok Esenin వంటి కవులను నేరుగా తెలుగులోకి అనువదించాలి. శ్రీశ్రీ అనువదించిన పుష్కిన్ కవితలో కొంత స్వతంత్రత కనిపిస్తుంది. 'yourself a northern star, the blazing / Aurora, northern beauty, meet' (లభ్యమయ్యే ఆంగ్లాను వాదం) అనే పాదాలను

'ఉత్తర దిగ్గగనంపయి చుక్కలాగ వెలుగుమా
ఉత్తర దిక్ప్రభాత శిఖి నెదుర్కొనుమా' (ఖడ్గసృష్టి - 138 పుట)

అని మార్చేడు. మరొక పాదంలో మంచుకింద నదికలలు కంటున్నది అనడం శ్రీశ్రీ స్వంతమే Nekrasov కవిత్వంలో మొదటి నాలుగు వృత్తాలనే అనువదించేడు శ్రీశ్రీ. తరువాత వచ్చే రసవంతమైన భాగాలను ఎందుకెన్నుకోలేదో దురూహ్యం. 9వ పాదంలో Pine చెట్లు Teak చెట్లయినాయి. ఓకుచెట్లు అనడం తర్వాత ప్రాస కోసమేమో.

శ్రీశ్రీ ఆంగ్లంనుండి చేసిన అనువాదాలపై వ్యాఖ్యానం అనవసరం. వాటిలో కొన్ని స్వయంప్రభతోనే విరివిగా ప్రచారం పొందేయి. 'ఆనందం అర్ణవమైతే....' వంటివి అనువాదం కాకపోయినా ప్రసిద్ధి చెందిన మరొకగేయం-Villon అనుసరణ- 'ఏవితల్లీ! నిరుడు కురిసిన హిమసమూహములు', ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించ వలసివుంటుంది. ఫ్రెంచి మూలం, దానికి Rossetti అనువాదం కాల్పనికరీతిలో శృంగారాత్మకమైనవి. శ్రీశ్రీ అదేగేయంలోని భావాన్ని విస్తృతమైన పరిధిలో చేతనాత్మకంగా మనకందించాడు. ఇకపోతే ఆంగ్లానువాదాల్లో 'ప్రేమగీతం' (JamesJoyce యిమిటేషన్) మంచి తమాషా అయిన రచన డిలాన్ టామస్ అనువాదాలు నాలాంటి వాళ్ళకి ఎక్కువగా పనికొస్తాయి. శ్రీశ్రీకి విశ్వనాథ రామాయణం కన్నా వాల్మీకి రామాయణమే ఎక్కువగా అర్థమయినట్లు మిడిమిడి జ్ఞానంతో ఫ్రెంచి కవిత్వాన్ని అర్థంచేసుకోవచ్చు అనిపిస్తుంది డిలాన్ టామస్ కవిత్వం చదవదలచు కున్నవాళ్ళకి. అఫ్‌కోర్స్ హాస్యానికే యీమాట అన్నది. నిజానికి Dylan thomas ఒక్కడే ఆంగ్లసాహిత్యంలో సిసలైన కవి అని నా అభిప్రాయం.

25-12-79

## 'సృజన' లో శ్రీశ్రీ

| | | సంచిక |
|---|---|---|
| **కవితలు :** | | |
| జవాబు రాని ప్రశ్న | నవంబర్ 1966 | 1 |
| లెనిన్ | మే 1970 | 15 |
| ఝంఝ | ఫిబ్రవరి 1971 | 17 |
| పేదవాళ్ళ ఆగ్రహం | మే 1972 | 32 |
| పేదవాళ్ళు పేదవాళ్ళుగా ఉండడం వల్లనే గొప్పవాళ్ళు గొప్పవాళ్ళుగా ఉన్నారు. | జూన్ 1972 | 33 |
| **పాటలు :** | | |
| తుది పయనం : తొలి విజయం | జూన్/జులై 1971 | 21/22 |
| అంతంకాదిది ఆరంభం | ఫిబ్రవరి 1973 | 41 |
| అరెరే దమ్మిడి | జూన్ 1975 | 69 |
| మెల్లమెల్లగా జోరుజోరుగా | మార్చి 1978 | 77 |
| **వ్యాసాలు :** | | |
| నాకు నచ్చిన వచన శైలి | ఫిబ్రవరి 1967 | 2 |
| ఆధునిక సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతన | ఆగస్టు 1967 | 4 |
| తెలుగు కవితా నాటక రంగాలమీద లెనిన్ ప్రభావం | ఫిబ్రవరి 1971 | 17 |
| విప్లవ కెరటం నన్ను ప్రైడ్ చేసింది | అక్టోబర్ 1971 | 25 |
| సినిమాల్లో అవినీతి | జనవరి 1972 | 28 |
| **సాహిత్య ప్రసంగాలు :** | | |
| రెండు తెగలు : రెండు తెలుగులు - విరసం 2వ మహాసభల అధ్యక్షోపన్యాసం | నవంబర్ 1971 | 26 |
| ఈనాడు విప్లవం ప్రపంచ వాస్తవికత. విరసం 3వ మహాసభల అధ్యక్షోపన్యాసం | డిసెంబర్ 1972 | 39 |
| **సమీక్షలు :** | | |
| దిక్సూచి (చెరబండరాజు కవితా సంకలనం) | ఫిబ్రవరి 1971 | 17 |
| రా (భైరవయ్య కవితా సంకలనం) | ఫిబ్రవరి 1971 | 17 |
| బందూక్ (సాహితీ సంకలనం) | సెప్టెంబర్ 1973 | 48 |

| సంస్మరణ : | | సంచిక |
|---|---|---|
| జడ సమాజానికి చలం షాక్ ట్రీట్‌మెంట్ | జూన్ 1979 | 92 |
| **సాహిత్య లేఖ :** | | |
| నిష఼్ల వెంకటరమణ మూర్తికి జవాబు | మే 1970 | 15 |
| **పత్రికా ప్రకటనలు :** | | |
| ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని ముందుకు తీసుకుపొండి (కొ.కు.తో కలిసి) | ఫిబ్రవరి 1973 | 41 |
| తెలుగు మహాసభల బహిష్కరణ | ఏప్రిల్ 1975 | 67 |
| కామ్రేడ్ భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షలు రద్దు చేయాలి. | జూన్ 1975 | 69 |

## శ్రీశ్రీ పై 'సృజన'లో

| | | |
|---|---|---|
| కవిత : 1+1=1 కాళోజీ | ఫిబ్రవరి 1970 | 14 |
| **వ్యాసాలు :** | | |
| మహాప్రస్థాన కావ్యమీమాంస - కుందుర్తి | ఆగస్టు 1967 | 4 |
| కుందుర్తి మహాప్రస్థాన కావ్యమీమాంస - ఆర్వియార్ | నవంబర్ 1967 | 5 |
| మహాప్రస్థానంలో కొసమెరుపు - వరవరరావు | ఆగస్టు 1968 | 8 |
| సాంస్కృతిక విప్లవ స్వాగతపత్రం 'యోగ్యతాపత్రం' - శ్రీపతి | ఫిబ్రవరి 1969 | 10 |
| విప్లవపథ నిర్దేశకుడు - ఎబికె ప్రసాద్ | ఫిబ్రవరి 1970 | 14 |
| శ్రీశ్రీ నాటికలు - అద్దేపల్లి రామమోహనరావు | ,, ,, | 14 |
| విమర్శకుడుగా శ్రీశ్రీ - చేకూరి రామారావు | ,, ,, | 14 |
| యుగకర్త - సి. రాఘవాచారి | ,, ,, | 14 |
| శ్రీశ్రీ వచన రచన - కొడవటిగంటి కుటుంబరావు | ,, ,, | 14 |
| శ్రీశ్రీ మహాప్రస్థానం - కె.వి. రమణారెడ్డి | ,, ,, | 14 |
| శ్రీశ్రీ రాజకీయ దృక్పథం - మార్ప్ | ఫిబ్రవరి 1970 | 14 |
| గురజాడ వారసుడు శ్రీశ్రీ - నవీన్ | ,, ,, | 14 |
| శ్రీశ్రీ మనోరూపం 1934 - నూతలపాటి గంగాధరం | ,, ,, | 14 |
| శ్రీశ్రీ అనువాద సరళి - రోణంకి అప్పలస్వామి | ,, ,, | 14 |
| వ్యక్తిగా శ్రీశ్రీ - వరవరరావు | ,, ,, | 14 |
| శ్రీశ్రీలో అలంకారికత - చేకూరి రామారావు | మే 1971 | 20 |

**నిన్న**

"ఎమర్జెన్సీ" సర్పం
చచ్చిపోయిందనుకోకు నేస్తం
అది కేవలం
కుబుసం విడిచింది
పుట్టలోకి వెళ్ళింది
జాగ్రత్త

**ఇవ్వాళ**

ఎమర్జెన్సీ సర్పం
'ఎన్నిక'యి వచ్చింది
పార్లమెంటరీ కుబుసం ధరించి
పడగెత్తి నాట్యం చేస్తున్నది
పసిపాపలూ
విషపు కోరల నుంచి హుషార్!

— దామెర రాములు

## సృజన జీవిత సభ్యులుగా చేరండి- చేర్పించండి

ఇవ్వాటి గురించి ఆలోచిద్దాం-

ఇరవయ్యొకటవ శతాబ్దం గురించి కూడ ఇప్పటి నుంచే ఆలోచిద్దాం.

ఇవ్వాళ సృజనను నిలబెట్టుకుందాం- ఇరవయ్యొకటవ శతాబ్దం సృజనకు ఇప్పుడే ఇంధనం ఏర్పాటు చేద్దాం.

'అరవై ఆరు నుంచి త్రైమాసికగా, ఒక దశాబ్దంగా మాస పత్రికగా ఎమర్జెన్సీ చీకటిరోజుల్లో తప్ప ఎన్నడూ ఆగిపోకుండా వెలువడుతున్న ఒకే ఒక్క ఆధునిక సాహిత్య వేదిక సృజన.

మీరు సృజనకు చందాదారులుగా చేరారు, చేర్పించారు-

విరాళాలు ఇచ్చారు. మీకు వీలయినంతగా తోడ్పడ్డారు.

ప్రజల ఆదరణవల్లనే సృజన నూరవ సంచికకు చేరువవుతున్నది.

నూరు పూలు వెయ్యి కాయలుగా సృజన

నూతన సమాజ పరిమళాలు, ఫలాలు పంచడానికి

## సృజన జీవిత సభ్యులుగా చేరండి.

జీవిత సభ్యత్వం 200 రూపాయలు

ఒకేసారి గానీ, నాలుగు సమాన వాయిదాల్లో ఒక సంవత్సరం లోపునగానీ చెల్లించవచ్చును.

శాశ్వతంగా సృజన మాత్రమే కాదు

మీరు సృజన ప్రచురణలపై 25% కమీషన్ కూడా పొందుతారు

సృజన జీవిత సభ్యులుగా ఈ రోజే చేరండి, చేర్పించండి.

ప్రజా జీవిత ప్రతిస్పందన సృజన పది కాలాలపాటు చేయూత నివ్వండి.

## స్మృతి గీతం

ఎ. ఎస్.

జనం గుండెల్ని
కూడగట్టి
ఎరుపు దారివేపు నడిపించినవాడివి నువ్వు
అతి చిన్న వయసే అయినా
జీవితాన్ని వికసించే విరిలా
జనపదాల కోసం అర్పించావు-
గూడూరు, అంబాల, కన్నూరు,
కమలాపూర్
ప్రతి దారి పొడుగునా,
నాగేటి చాల్లలో,
ఎర్రమన్ను చెలకల్లో,
ఎదిగిన నిటారుకాళ్ళ పిలగాండ్లు,
నిన్ను గుర్తుకుతెచ్చుకు
కుమిలిపోతున్నారు.
నిన్ను కన్నకొడుకులా సాదిన తల్లులు
బువ్వగిన్నె ముందర పెట్టుకు,....
"రవ్వన్నా అన్నం తిన్నావా"
అని అడుగుతూనే వున్నట్టున్నారు.
నువ్వు బోధించిన ప్రతి విషయాన్ని
మనసుకు హత్తుకున్న
అక్కలు చెల్లెండ్లు
నువ్వు పాడిన జనగీతాలు
జ్ఞప్తికి తెచ్చుకు గద్గదికమవుతున్నారు.
నువ్వు కొడుకువి, తమ్ముడివి
అన్నవు- అందరికీ అన్నీ నువ్వే.
కుమారూ, ఏడకెళ్ళిపొయ్యేవు-
బంజేరు, పరంపోగులు,
ఆక్రమించుకున్న పట్టాభూములు
సమస్యలు అన్నీ
నీకోసం కాచుకున్నాయి-
జనానికి నువ్వున్నావు-
నీ జీవితార్పణం ఎందుకైతే చేశావో
ఆ కార్యం పూరించడానికి
మేమంతా వున్నాం
కుమార్,
నువ్వు మరణించలేదు
నువ్వు పచ్చని మొక్కలా
మొలకేస్తావు-
మా రక్తం, చెమట, పోరాటాల్లోంచి
అరుణారుణ రవిగా ఉదయిస్తావు-

[20-12-79 నాడు ప్రమాదవశాత్తు కామ్రేడ్ కుమారస్వామి (రవి) బాంబు పేలి మరణించినాడు. ప్రజల్లో పెనవేసుకున్న ఆయన స్మృతికి.]

---

స్త్రీ జాతి సముద్ధరణకు తీవ్ర కృషిచేసిన కందుకూరిని గాని, భాషా పరిణామ క్రమాన్ని శాస్త్రీయంగా పరిశోధించి నవరజాతికి అక్షరాభ్యాసం నేర్పిన గిడుగువారిని గానీ, 'మంచి గతమున కొంచెమేనోయి' అన్న గురజాడను కాని అంత తేలికగా కొట్టి పారేయలేము. ఆనాడు వారుచేసిన కృషివల్ల ప్రజాస్వామిక విప్లవం ఒకడుగు ముందుకు వేసిందనే చెప్పాలి. ఈనాటికీ కోకొల్లలుగా వెలువడుతున్న మత సాహిత్యానికి, మాతృశ్రీ సాహిత్యానికి, సెక్సు, క్రైము, సినిమా సాహిత్యానికీ శాశ్వత సమాధులు కట్టాలంటే - అది 'యుగపురుషుల' వల్ల సాధ్యమయే పని మాత్రం కాదు.

పీడించబడే వర్గం, పోరాడే వర్గం, కర్షక కార్మిక వర్గం విప్లవ చైతన్యంతో విజృంభించిననాడే మధ్యతరగతి వాళ్ళమైన మనకు కూడా విముక్తి- ఈలోగా మనం, పిడికెడు మందికన్నా ఎక్కువలేని పీడకుల ప్రలోభాలకు లొంగిపోకుండా కార్మికవర్గ ప్రయోజనాలతోనే మనవి కూడా ముడిపడి వున్నాయని గ్రహించి ఆ వర్గంతో భుజం కలిపే ధైర్యం లేకపోయినా, ద్రోహం తలపెట్టే నీచ బుద్ధిని వదల్చుకోవాలి.

19-4-75

**SRJANA Telugu Monthly** **Jan. '80** **H/WL-10**
Regd. No. with Registrar of News Papers 10953/67

# 'యుగపురుషులు' కాదు, ప్రజలు మన విముక్తిని సాధిస్తారు



....... ఈనాడు మనం మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం అనే వెలుగులో యీ శతాబ్దారంభంనాటి సంస్కృతిని పరిశీలిస్తున్నాం. నిన్న మొన్నటిదాకా కన్ఫ్యూషియస్‌ను చైనాలో గొప్ప వేదాంతిగా, దార్శనికుడిగా పరిగణించడం జరిగింది. కాని అతని భావాలు సామ్యవాద మానవుని నైతిక పురోభివృద్ధికి ఆటంకమే కాదు, హానికరం అని కూడా యిప్పుడు స్పష్టమైంది. యాభై ఏళ్ళ కిందట మన ఎవరివద్దా ఇటువంటి కొలబద్దలు లేవు. మనం బూర్జువా సంస్కృతి ఆవరణలోనే ఆలోచిస్తూ వచ్చాం. కందుకూరి, గిడుగు, గురజాడ యీ ముగ్గురిదీ సాహిత్య దృక్పథమే. దాన్ని ఆవిధంగా తీర్చిదిద్దిన ఆర్థిక కారణాలవైపు వారి ఊహలు ప్రసరించనే లేదు. సామాజిక పరిస్థితులే సాహిత్య స్వరూపాన్ని కూడా నిర్ధారిస్తాయనే చిన్న విషయాన్ని కూడా తెలుసుకోలేని పెద్ద విమర్శకులే పీఠాధిపతులలాగా నిలిచి పెత్తనం సాగిస్తున్నారు. మొన్న ప్రపంచ తెలుగు మహాసభల్లో సన్మానాలు పొందిన ఘనాపాఠీలంతా యీ కోవకు చెందిన వారే. మనది బూర్జువా సంస్కృతి. మనవి బూర్జువా కళలు. ఇవి నశించి తీరవలసిందే - అన్నంత వరకు మనకు విస్పష్ట అభిప్రాయాలే వున్నాయి. కాని ఏది ప్రజా సంస్కృతి, విప్లవ సంస్కృతి అనే అంశాల మీద యింకా విరివిగా పరిశీలన జరగాలి. ప్రపంచం అంతటా కమ్యూనిజాన్ని స్థాపించే ఆఖరు పోరాటం ఇండియాలోనే జరుగుతుందనేది నా దృఢ నిశ్చయం. ఇందుకుగాను మనం యిప్పటి నుంచే సన్నద్ధులం కావాలి.

(మిగతా 3వ కవర్‌లో)

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao